# భారతామృతరసము

## గోహరణము

గ్రంథకర్త
కాశూరి వ్యాసమూర్తి

# పీఠిక

రోమహర్షణపుత్రుడైన సూతపౌరాణికుడు నైమిశారణ్యమందు గులపతియగు శౌనకుడు ద్వాదశ వార్షిక సత్రయాగ మొనరించుచుండగా మునీశ్వరుల సమక్షమందు భారతము వినిపించెను. సర్పయాగమందు జనమేజయునకు వైశంపాయనుడు వేదవ్యాసుని నియోగానుసారము దెల్పిన యీ యితిహాసమును మునీశ్వరులు విని తరించిరి మనోబుద్ధి సమాధులతో నొప్పినవాడై వైశంపాయనుడు మొదట గురువునకు నమస్కరించి ద్విజులను ఇతరులైన విద్వాంసులను పూజించి సర్వలోకవిశ్రుతుడైన వ్యాసుని మతమునంతయు వినిపించెను (ఆది ౬౧-౧౨)

గ్రంథకర్తయగు కృష్ణద్వైపాయనుడు బ్రహ్మర్షియగు వసిష్ఠునివంశమందు పరాశరునివలన సత్యవతియందు సద్యోగర్భమున నుద్భవించి వెంటనే యనిష్ఠస్థితి నొందెను. 'స్మరణమాత్రమున కానవచ్చెదను' అని కన్నతల్లికి దెల్పి యామెయనుజ్ఞ నొంది వేదవ్యాసుడు తపమొనరింపవెడలిపోయెను (౬౩-౮౪ ౮౬) అత డద్భుతకర్మ కలవాడు (౧-౨౨), సర్వలోకపూజితుడు అమితతేజస్వుడు (౬౨-౧౩) తపము, వేదాధ్యయనము, వ్రతము, ఉపవాసము, సంతానము, కోపము వీనియం దతని నతిశయించినవా రెవరును లేరు (౬౦-౪)

పుణ్యమైన హిమవత్పాదమందు గిరిగుహాలయమం దా ధర్మాత్ముడు దేహమును శుద్ధమొనరించుకొని ప్రాచీనాగ్రము లగు దర్భలపై నాసీనుడాయెను. శుచియు, నియమవంతుడు,

శాంతాత్ముడు నగు పరాశరాత్మజుడు తపస్వితుడై యంతయు నవగాహన మొనరించుకొనెను (౧-౩౩ ౩౧) త్రివిధరహస్యమైన భూతస్థానములు, వేదములు, యోగము, విజ్ఞానము, ధర్మార్థ కామములు. ధర్మార్థకామయుక్త వివిధశాస్త్రములు, లోక యాత్రావిధానము నా సాత్యవతేయు డవగాహన మొనరించు కొనెను (౧-౫౫-౫౬) మూడువత్సరము లహోరాత్రములు తదేకదీక్ష వహించి నారాయణాంశజుడైన వేదవ్యాసుడే పంచమవేదమును రచించెను (౬౩-౮౧,౮౨)

లోకానుగ్రహమునఁ గోరి వేదవ్యాసుడు వేదవిభాగ మొనరించి సుమంత్రుడు, జైమిని, పైలుడు, శుకుడు-వీరిచే నది లోకప్రచార మొనరించెను (౬౩-౯౯ ౯౦) భారతము ౬౦ లక్షల గ్రంథముగా రచించి యందు ౩౦ లక్షల గ్రంథము నారదునివలన దేవలోకమందును, ౧౫ లక్షల గ్రంథము అసితుడగు దేవలునివలన పితృలోకమందును, ౧౪ లక్షల గ్రంథము కుమారుడు శుకునివలన యక్షరాక్షసులందును, ౧ లక్ష గ్రంథము వైశంపాయనునివలన మనుష్యలోకమందును వ్యాపింపజేసెను. (౧-౯౬౦-౨౬౧)

జన్మాదులకు గారణుడగు సనాతనుడైన నారాయణుని దివ్యగాథ యీ మహాభారతమందు గలదు. దేవతలు దేవర్షులు, నిర్మలులగు బ్రహ్మర్షులు, యక్షులు, మహోరగులు మున్నగువా రిందు జేర్చెనబడియున్నారు (౧-౨౬౦ ౨౬౧) దేవేశుడు, దేవి, కార్తికేయుడు, బ్రాహ్మణులు, గోవులు వీరి మహిమ యిందు గీర్తింపబడినది (౬౨-౩౪,౩౫)

బ్రహ్మ తనయొద్దకు రాగా వ్యాసుడు భారతప్రాశ స్త్యము నిట్లనుడివె: పరమపూజితము, అభిహితము, వేద రహస్యమునైన యీ కావ్యము నాచే రచింపబడినది. సాంగో పాంగమైన యుపనిషత్తులు, వేదవిస్తరమైన క్రియలు ఇతిహాస పురాణోన్మేషము నిందు వివరింపబడినది. త్రివిధసంజ్ఞితమైన కాలముయొక్క నిర్ణయ మిందుగలదు. జరామృత్యుభయ వ్యాధి భావాభావవినిశ్చయ మిందుగలదు. ధర్మము యొక్క వివిధ లక్షణము, ఆశ్రమముల లక్షణము, చాతుర్వర్ణ్యము యొక్కయు కృత్స్నమగు పురాణముల యొక్కయు, [*] తపోబ్రహ్మ చర్యల యొక్కయు విధాన మిందు చెప్పబడినది. పృథివి, చంద్ర సూర్యులు, గ్రహనక్షత్తారలు, యుగముల యొక్క ప్రమాణ ములు నిందు చెప్పబడినవి ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అట్లే వేదాధ్యాత్మము, న్యాయశిక్ష, చికిత్స, జ్ఞానము వాని ప్రమాణ మిందుగలదు ఇట్లుగా ననేకాశ్రయమైన దివ్యమానుషసంతతిమైన జన్మయు పుణ్యతీర్థములు, దేశములు నిందు గీర్తింపడినవి. నదులు, పర్వతములు, సాగరము లిందు గీర్తింపబడినవి దివ్యమైన పురములు. కల్పములు, యుద్ధకౌశ లము, వాక్యజాతి విశేషములు, లోకయాత్రాక్రమము నిందు ప్రతిపాదింపబడినవి, సర్వగతమైనవస్తువే యిందు ప్రతిపాదిత మైనది (౧-౬౮,౭౬) అని వ్యాసుడు బ్రహ్మతో నివేదించెను

---

* తపసో బ్రహ్మచర్యస్య పృథివ్యాశ్చంద్ర సూర్యయోః
గ్రహనక్షత్రతారాణాం ప్రమాణంచ యుగైస్సహ ౧-౭౨

భారతప్రాశస్త్యమునుగూర్చి బహువిధములు నా గ్రంథ
మందే యిట్లు వ్రాయబడియున్నది (*) ఈ భారతమునకు శరీ
రము సత్యము, ఇదియు నమృతము, దేవతలు నాలుగువేద
ముల నొకవైపున, భారతము నొకవైపున నుంచి తూచిరి
సరహస్యమైన నాలుగువేదములకంటెను నిది యధికముకాగా
నపుడు మహిమతోను, భారముతోను నొప్పియున్నందున మహా
భారతమని ప్రసిద్ధినొందినది. (౧-౨౭౩) వేదములు, ఉపని
షత్తులు తెలిసినను నీ యితిహాస మెఱుంగనివాడు విచక్షణుడగు
విద్వాంసుడు కానేరడు, (౧-౩౨౬) విస్తారార్థమైన యీ విచి
త్రార్థపదాఖ్యాన మనేకసమయాన్వితమైనది మోక్షేచ్ఛుల
వారు వైరాగ్యమునువలె ప్రాజ్ఞులగునరులు. దీని నాశ్రయించె
దరు వేదితవ్యములలో నాత్మవలె, ప్రియములందు జీవితమువలె
నీ యితిహాసము ప్రధానార్థమైనది. సర్వాగమములందు శ్రేష్ఠ
మైనది ఆహారము నాశ్రయింపక శరీరధారమట్లు దీని నాశ్ర
యించనికథ భూమియందు లేనేలేదు, (౨-౩౮-౨) శుభోదయము
గోరు భృత్యులు అభిజాతుడగు నేలికనువలె కవులీభారతము
నాదరించుచున్నారు. (౨-౩౮-౩) అక్షరయుక్తమగు వాక్కునందు
లోకము, వేదమునున్నటుల నీయుత్తమేతిహాసమందు ఉత్తమ
మైనబుద్ధి యున్నది (౧-౩౫-౪౧) ఇది యర్థశాస్త్రము. మహా
ధర్మశాస్త్రము, కామశాస్త్రము, మోక్షశాస్త్రము (౬౨-౨౩)
ఇట్లుగా నమితబుద్ధిగలిన వ్యాసుడు దీనిని తెల్పెనుపుంస్కోకిలము

---

* భారతస్యవపుర్హ్యేతత్సత్యం చామృతమేవచ ఆది౧-౨౬౮
వపుః అనునది యీ శ్లోకమందు ఉత్తమముగా నున్నది

రుతము విన్నపిదప రూక్షమైన కాకికూత యింపుగానట్లు శ్రావ్యమైన యుపాఖ్యాన మింకేదియు రుచింపనేరదు త్రిలోక విధులు పంచభూతముల వలన నైనట్లు కవిబుద్ధులీ యుత్తమేతిహాసమునుండి గలుగుచున్నవి. అంతరిక్ష విషయముగా జతుర్విధప్రజయైన ట్లీ యుపాఖ్యానవిషయమందే పురాణము వర్తించుచున్నది. సమస్తేంద్రియములకు చిత్రమైన మనః క్రియలెట్లో యట్లే సమస్త క్రియాగుణములకు నీ యాఖ్యాన మాశ్రయమైనది. సాధువగు గృహస్థుని తక్కిన మూడాశ్రమములవారు నతిశయింపలేనట్లు కవులు దీని నతిశయింపలేరు. సతతోత్థితులగువారలకు ధర్మమందే మతియుండదగును. అదియే పరలోకగతునకు బంధువు. అర్థములు, లలనలు నిపుణముగా ననుభవింపబడినవైనను నవి యాప్తభావమును బొందలేవు, స్థిరత్వములేదు. ద్వైపాయనోష్టపుట నిస్సృతమైనట్టి అప్రమేయము, పుణ్యము, పవిత్రము, శివము నైన యీభారతాఖ్యానము సర్వోద్ధారకమైనది (౧-౩౭౭-౩౮౬) వ్యాసమహర్షి యొక్క మనస్సాగరసంభూతమైన యీ భారతము (౫౮-౯) సముద్రము, మేరుపర్వతమువలె రత్ననిధియైనది. (౬-౧-౪౮)

మహాభాగతమాహాత్మ్య మిట్లుగా నాదిపర్వమందు బలుచోట్ల దెల్పబడినది. ఇందలివిశేషములు గ్రంథప్రాశస్త్యమును చక్కగా విశదీకరించుచున్నవి. అనునిత్య మన్నివిషయములందు నాత్మోద్ధరణముగా బ్రవర్తించు సన్మార్గవివేకమిందువలన ననగాహనముకాగలదు. తల్లిదండ్రులు, అన్న

నమ్ములు, ఆలుబిడ్డలు, బంధువులు, జ్ఞాతులు, స్నేహితులు, అహితులు, విరోధులు మఱియు సంఘము,రాజ్యము,దేశము, ప్రపంచము, లోకములు, దేవర్షులు వీనియందు నరు డింటను, బైట నెట్లుప్రవర్తించుట యుచితమగునో, వీనిపట్ల పరస్పర విరోధ మేర్పడినపు డేదిగావించిన ధర్మమగునో (ప్రశస్తమగునో) యేదిగావించిన ధర్మముగా బైకిగనబడుచు ధర్మాభాసమైయుండునో (అప్రస్తుతమగునో) యీవివేకము గలుగగలదు. ప్రపంచమం దన్నివిధముల ప్రశాంతిగా నుండదగురీతి యిందువలన తెల్లముకాగలదు.ఆద్యంతములు తెలియరానిది కాలము, బహువిస్తారమైనది విశ్వము, పైగా బ్రహ్మాండము. అందొక జీవు డొక దేహముతో నుండురీతి యత్యల్పము. ఉత్తమలోకప్రాప్తిని (శాశ్వతత్వమును గోరువాడు లోకశాంతిన పేక్షించుచు దదుచితప్రవృత్తిగొనిగాని తరింపజాలడు. ఈజన్మమున కతీతముగానున్న దే పెద్దవిషయము, మఱియు విస్తారము అని గుర్తించిన వివేకి మూడుకాలముల నర్థముచేసికొని తదుచితమైన సత్ప్రవృత్తి నలవఱచుకొనగలడు. అట్టినిదాన మీ గ్రంథమువలన గలుగగలదు. లోకప్రవర్తకులు, నుద్ధారకులు, జ్ఞానదాతలు దేవతలు. పితృదేవతలు, ఋషులు నట్టివారే. ఏతద్గ్రంథస్థమగు వీరిచరితములను సదా నెమ్మదిగా నెమరవేయుకొలంది యత్యుత్తమప్రవృత్తి యలవడి ఇహాముత్రఫల మొనగూడగలదు. సకలమానవోద్ధరణరూపమైనది, యింకను చరాచరలోకోద్ధరణరూపమైనది, మఱియు సకలలోకోద్ధరణరూపమైన దీ మహాభారతగ్రంథరాజము.

ఇందలి రచనావిధాన మమోఘమైనది. ఈగ్రంథము ప్రజ్ఞాభిపన్నమైనది. విచిత్రపదపర్వమైనది. సూక్ష్మార్థన్యాయ యుక్తము, వేదార్థభూషితము, అర్థసంయుతము, పుణ్యము, బ్రాహ్మసంస్కారోపగతము,నానాశాస్త్రోపబృంహితము,చతుర్వేదసహితము, ధర్మ్యము పాపభయాపహము నైనది. (౧-౧౭-౨౨॥ ౨-౪౧) దివ్యమానుషసమయమైన శుభశబ్దములతో గూడినది, వివిధఛందస్సులు గల్గినది. విద్వత్ప్రియము, వేదార్థసారభూతము, సకలార్థప్రదము నైనది. (౧-3-౨, 33)

సర్వకాలసర్వావస్థలందు సకలదేశములకు, లోకములకు నుపయుక్తమైన యీ యితిహాసమందు కౌరవపాండవప్రవృత్తి ప్రధానముగా వర్ణింపబడినది. వేదవ్యాసుడు కౌరవపాండవోత్పత్తికి, గ్రంథోత్పత్తికిగూడ గారణుడై విలసిల్లినాడు. నాస్తికుడేనాడును విలువలేనివాడు. విద్యావిహీను డల్పుడు. విద్యాధికులగు ననార్యులవలననే ప్రపంచమునకు బహుసంకటము ప్రాప్తించును. ఉత్తమరాజవంశములు పరిపాలించుచుండగా బహుప్రాణులతో గూడిన ప్రపంచము ప్రశాంతిగానుండెను. (౬౪-౧.౨౬) అపుడు కామవేషముగల దైత్యులు, దానవులు రాజులయిండ్లలో బుట్టి యంతయు గలగుండుగావించిరి. (౨౭-౨౯) మఱియు నీయసురులు రాజవంశములందేకాక గోవులు, గుఱ్ఱములు, ఖరములు, ఉష్ట్రములు, మహిషములు, క్రవ్యాదులు, భూతములు, గజములు, మృగములు వీనియందును బుట్టిరి. వీరియందు దగ్రగణ్యులగువారే కౌరవులు. దుష్బుద్ధియు,

దుర్మతియు కౌరవుల క్షయకారము గల్గించువాడును నగు దుర్యో ధనుడు కలియంశమున భువియందుబుట్టి సమస్తప్రపంచమునకు ఘాతచేసెను. భూతాంతకరణమగు గొప్పవైరము వానివలన నుత్పన్నమైనది. పులస్త్యపుత్రులైనవారే దుశ్శాసనుడు, దుర్ముఖుడు, దుస్సహుడు మొదలయినవారు నూర్గురు భ్రాత లుగా బుట్టిరి వీరందఱు క్రూరకర్మగలవారు. (౬౭-౪౯,౯౩) వీరందఱు నతిరథులు, శూరులు. అందఱు యుద్ధవిశారదులు, అందఱు వేదవిదులు, రాజశాస్త్రపారగులు. సంగ్రామవిద్య, విద్య, కులము వీనిచే శోభించువారు. (౬౭-౧౦౯, ౧౧౦) వీరి శాస్త్రజ్ఞానము, ఉత్తమవంశజన్మము మొదలయినవి దుర్వ్యి నియోగమై ప్రపంచమునంతకు ననర్థములు గల్గించినవి. అందు వలన లోకక్షయమేర్పడినది. కావుననే ధృతరాష్ట్రుడు పుత్రుల కొఱకు శోకించుచుండగా వలదని యాతనికి దెల్పబడినది. 'నీ పుత్రులు దురాత్ములు, మన్యుప్రతప్తులు, లుబ్ధులు, దుర్వృ త్తభూయిష్ఠులు. వీరినిగూర్చి నీవు శోకింపదగవు. నీవు శ్రుత వంతుడవు, మేధావివి, బుద్ధిమంతుడవు. ప్రాజ్ఞసమ్మతుడవు. ఎవరికి శాస్త్రానుగమైన బుద్ధియుండునో వారు మోహమునొం దరు.' అని సంజయుడు వచించియున్నాడు. (౧.౨౪౮-౨౫౦) దుర్యోధనుడు మన్యుమయమగు మహాద్రుమము, కర్ణుడు స్కంధము, శకుని శాఖలు, పుష్పఫలస్థానమందు దుశ్శాస నుడు, మనీషియగు ధృతరాష్ట్రుడు మూలము'. ఇట్లుగా నాసురీసంపదతో గూడిన మహాద్రుమము భారతమందు

బేర్కొనబడినది. (౧-౧౧౫) దుర్మార్గులగు కౌరవులు, కౌరవానుయాయులవలన లోకము సర్వవినాశనమే యైనదనియు, పాండవులు, పాండవానుయాయులవలన ధర్మము సంస్థాపింపబడి లోకోద్ధరణమైనదనియు నీగ్రంథమందు గ్రంథకర్త లిఖించియున్నాడు. ఇతిహాసపురాణములచేత వేదమును విశదిగా దెలియవలయును. అల్పశ్రుతుడగువాని జూచి వేదము 'వీడు నన్ను మోసపుచ్చును' అని భయమొందును. (౧-౨౭౩) అని చెప్పబడినది. తపము, అధ్యయనము స్వాభావికమైన వేదవిధి. కష్టించి ధర్మమార్జించుట విపరీతముకాదు. భావోపహతముగా వానినొనర్చుటయే విపరీతము. (౧-౨౮౦) విపరీతప్రవృత్తిగల దుర్యోధనాదులను, తత్పక్షస్థులను సత్ప్రవృత్తిగలపాండవులు హతమార్చిరి. అది వినాశనము, సర్వలోకహితముగోరి దివౌకసులు బ్రహ్మర్షి రాజర్షి కులములం దుద్భవించిరి. బాల్యమందున్నను బలస్థులైన వీరిని దానవులు మున్నగువారు నాశనము చేయలేకపోయిరి, వారే సర్వనాశనమొందిరి. యుధిష్ఠిరుడు ధర్మమయమైన మహాద్రుమము, అర్జునుడు స్కంధము, భీమసేనుడు దానిశాఖలు, సమృద్ధమగుపుష్పఫలస్థానమందు మాద్రీపుత్రులు, కృష్ణుడు బ్రహ్మ బ్రాహ్మణులు మూలము. ఇట్లుగా దైవీసంపదతోగూడిన మహాద్రుమము భారతమందు బేర్కొనబడినది. (౧-౧౧౬) దైవీసంపద యుద్ధారకమైనది. ఆసురీసంపదవలనగల్గిన సంకటపరిస్థితిని యీదైవీసంపద సరిచేసినది. ఈమహోత్కృష్టవిషయమే యీగ్రంథమందు వ్రాయబడినది.

క్రియాపదముల నధ్యాహారముచేయుట, ఒకే క్రియా పదము శ్లోకమందు పలుచోట్ల, పూర్వాపరశ్లోకములందు నన్వయించుట, పాఠక్రమముకంటె నర్థక్రమము ప్రాధాన్యమని యెంచుట విభక్తులను తాఱుమాఱొనర్చి యర్థము చెప్పుట, పర్యాయపదము లర్థముగావ్రాయుట, గ్రంథాంతరవిశేషములను సంపుటిచేసి వివరణమొనరించుట వీనియందు నిదానము చాలనిచో గ్రంథాభిప్రాయము వమ్మగును. 'ఘట్టమేది, అదియే పాత్రవిషయము, పూర్వాపరసందర్భమేమి, ఉపక్రమోపసంహారము లెట్లున్నవి, ఇందుకు సంబంధించిన ఘట్టములు, విశేషములు గ్రంథమం దెట్లు తెలుపబడియున్నది' అనువాని కిందువలన ప్రాముఖ్యముపోయి గ్రంథభావము విపరీతముచేయబడుచున్నది పాత్రలనుబట్టి, ప్రకరణమునుబట్టి సందర్భమును పురస్కరించుకొని పదములకు, శ్లోకములకు నర్థమేర్పడుచుండును. 'ఏపాత్రచే జెప్పబడినది, ఎవరిమూలకముగా జెప్పబడినది, ఎందునిమిత్తమై చెప్పబడినది' అనువానినిబట్టి విషయనిర్ణయము గావింపవలసియున్నది. ఇట్లుగాక అనేకగ్రంథములు పలుభాషలలో పెఱిగి భారతము విపరీతవిమర్శనలకు పాలగుచున్నది.

రామాయణమందు దేవతలందఱు నొకేపక్షమున నుండిరి. భారతమం దుభయపక్షములం దున్నారు. భువియం దుద్భవించిన వీరి నర్థముచేసికొనుటలో గొప్పవిపరీత మేర్పడుచున్నది. నరవానరులుగా నుద్భవించినవీరు మానవాతీత మహి

మాన్వితులగుచు నరవానరప్రవృత్తియే కల్గియున్నారని గుర్తించినగాని భారతరామాయణము లవగాహనము కావు. 'మీరు భూమియందు బుట్టి మీలోమీరు కొట్టుకొని మరల మీలోకములను పొందుడు' అను బ్రహ్మయొక్క యాదేశానుసారము దేవతలు భువియం దుద్భవించి కలహించుకొని మరల మూలరూపములను చేరిపోయిరి. దేవలోకమందు దేవతలకు పరస్పర కలహకారణము లేదు. భూలోకక్షేమార్థము దేవతలలోదేవతల కీవైరము భూలోకమందే కల్పింపబడినదని యెఱుంగవలెను. సూర్యేంద్రులేకపక్షస్థులు. ఇది దేవలోకవిషయము, కర్ణార్జునులు విరోధులు. ఇది భూలోకవిషయము. కావున దేవతలయొక్క జన్మసందర్భము, పక్షము, ప్రవృత్తి - వీనినిబట్టి భూలోకస్థులగు వీరి నర్థముగావించుకొనవలసియున్నది.

కర్ణుని విషయముమాత్ర మిచట వివరించెదను. కానీనుడుగా నుద్భవించినాడు. కన్నతల్లిచే విడువబడినాడు, సూతునకు లభించినాడు,* ౧ కృష్ణార్జునుల ఆబాల్యస్నేహమును,ధనుర్విద్యయందు ధనంజయుని సర్వాధిక్యమును, కృష్ణార్జునుల లోకప్రఖ్యాతిని జూచి కర్ణు డహోరాత్రములు తపించుచు స్పర్ధగా దుర్యోధనపక్షమున చేరినాడు. లోకవిదారణమైన

* అన్యోన్య మభినిఘ్నంతః పున ర్లోకా నవాప్స్యథ॥ సభా ౩౬-౧౫

* ౧ సఖ్యంచ వాసుదేవేన బాల్యే గాండీవధన్వినః
పరిజానా మనురాగంచ చింతయానో వ్యదహ్యత " శాంతి ౨. ౭
స సఖ్య మకరో ద్బాల్యే రాజ్ఞా దుర్యోధనేనచ
యుష్మాభి ర్నిత్య సంద్విష్టో దైవా చ్చాపి స్వభావతః ౮

వైరమునే వృద్ధిగావించినాడు. ఇందువలన కర్ణుడు * మిత్ర శత్రు వినాశనుడైనాడు. ఇందు్రిడంతవాడు బ్రాహ్మణరూపములో రాగా నత దర్శించినది 'ఈయను' అని పలికినాడు. అర్థింపవచ్చినవాడు దేవేంద్రుడని యెఱింగియు కర్ణుడు 'వినియము గావించి కవచకుండలములు హరించుము' అని పలికినాడు. విధివిహితముగాగాక యొకవస్తువున కింకొకవస్తువు నర్థించి మాటాడినాడు. కర్ణ డమోఘశక్తి నర్థించకముందే యిందు్రిడు సూర్యకర్ణపరిసంగమును ముచ్చటించినాడు. కర్ణ

---

సర్వాధిక మథాలక్ష్య ధనుర్వేదే ధనంజయం
ద్రోణం రహ స్యుపాగమ్య కర్ణో వచన మబ్రవీత్ ౯

అపుడు ద్రోణతిరస్కారము, బ్రాహ్మణశాపము, పరశురామశాపము కర్ణునకు వచ్చినవి.

* కర్ణం నరవరశ్రేష్ఠం సర్వశస్త్రభృతాంవరం
దుర్యోధనస్య సచివం మిత్ర శత్రు వినాశనమ్ ఆది ౬౭-౧౪౧

ఈశ్లోకమందు శత్రుపదముకంటె మిత్రపదమే మొదటగానుండుట గమనింపదగినది. కర్ణుడు మిత్రులకే యెక్కువగా ముప్పుగల్గించినాడని యభిప్రాయము.

ఇంద్రః ఏవ మే సర్వభూతానాం లాభః పరమమో మతః
కర్ణః అవనిం ప్రమదాగాశ్చ నివాసం బహువార్షికం
తత్తే విప్ర ప్రదాస్యామి నతు వర్మ సకుండలమ్ అర౹౹౩౦౬.౬

కర్ణుడు మూడవమాఱు గావించిన ప్రసంగము.
విదితో దేవదేవేశ ప్రాగే వాసి మమ ప్రభో
నతు న్యాయ్యం మయా దాతుం తవ శక్ర వృథా వరమ్ ౧౪
త్వంహి దేవేశ్వరః సాక్షాత్ త్వయా దేయో వరో మమ
అన్యేషాం చైవ భూతానా మీశ్వరో హ్యసి భూతకృత్ ౧౫
యది దాస్యామి తే దేవ కుండలే కవచం తథా
వధ్యతా ముపయాస్యామి కించ శక్రా పహాస్యతామ్ ౧౬

డించలి విషయము ను పాటించువాడు కాలేదు. అమోఘమైన యా శక్త్యాయుధము నింద్రుడు కర్ణున కిచ్చినపు డది యొక్క

---

తస్మా ద్వినిమయం కృత్వా కుండలే వర్మచోత్తమం
హరస్వ శక్ర కామం మే న దద్యా హ్యాహ మన్యథా ౧౭

ఇంద్రః విదితో౽హం రవేః పూర్వ మాయా నేవ తవాంతికం
తేన తే సర్వ మాఖ్యాత మేన మేత న్న సంశయః ౧౮
కామ మస్తు తథా తాత తవ కర్ణ యథేచ్ఛసి
వర్జ యిత్వాతు మే వజ్రం ప్రవృణీష్వ యథేచ్ఛసి ౧౯
తతః కర్ణః ప్రహృష్టస్తు ఉపసంగమ్య వాసవం
అమోఘాం శక్తి మభ్యేత్య వవ్రే సంపూర్ణ మానసః ౨౦
వర్మణా కుండలాభ్యాంచ శక్తిం మే దేహి వాసవ
అమోఘాం శత్రు సంఘానాం ఘాతినీం పృతనాముఖే ౨౧
తతః సంచిత్య మనసా ముహూర్త మివ వాసవః
శక్త్యర్థం పృథివీపాల కర్ణం వాక్య మథాబ్రవీత్ ౨౨
కుండలే మే ప్రయచ్ఛ స్వ వర్మచైవ శరీరజం
గృహాణ కర్ణ శక్తిం త్వ మనేన సమయేనచ ౨౩
అమోఘా హంతి శతశః శత్రూన్ మమ కరచ్యుతా
పునశ్చ పాణి మభ్యేతి మమ దైత్యాన్ వినిఘ్నతః ౨౪
సేయం తవ కరప్రాప్తా హత్వైకం రిపు మూర్జితం
గర్జంతం ప్రతపంతం చ మామే వైష్యతి సూతజ ౨౫

కర్ణః ఏక మే వాహ మిచ్ఛామి రిపుం హంతుం మహాహవే
గర్జంతం ప్రతపంతంచ యతో మమ భయం భవేత్ ౪౬

ఇంద్రః ఏవం హనిష్యసి రిపుం గర్జంతం బలినం రణే
త్వంతు యం ప్రార్థయ స్యేకం రక్ష్యతే స మహాత్మనా ౪౭
య మాహు ర్వేదవిద్వాంసో వారాహ మపరాజితం
నారాయణ మచింత్యంచ తేన కృష్ణేన రక్ష్యతే ౪౮

.....................................

విద్యమానేషు శస్త్రేషు యద్యమోఘా మసంశయే
ప్రమత్తో మోక్ష్యసే చాపి త్వయ్యే వైషా పతిష్యతి ౩౩

నినే చంపి పిదప యింద్రహస్త మొందునను బాస గల్గినది. మఱియు విద్యమాన శస్త్రిషు, అసంశయుషుగా గర్ణుడీ శక్త్యాయుధమును ప్రయోగింపరా దనుషరతు గలదు. ఈషరతు నతిక్రమించిన యీ శక్త్యాయుధము కర్ణునిపైననే పడునను సమయ మిపు డేర్పడినది. కావున కర్ణుడు వ్యర్థముగా కవచకుండలములను వమ్ము గావించుకొనినాడని పర్యవసానము. ఇట్లే యుద్యోగపర్వమందును కృష్ణ కర్ణ సంభాషణమందు

---

కర్ణః సంశయం పరమం ప్రాప్య వియోక్ష్యే వాసవీ మిమాం
యథా మా మాత్థ శక్ర త్వం సత్య మేత ద్బ్రవీమి తే ౩౮
తతః శక్రః ప్రహసన్ వంచయిత్వా కర్ణం లోకే యశసా యోజయిత్వా
కృతం కార్యం పాండవానాం హి మేనే తతః పశ్చా ద్దివమే వోత్పపాత ౩౯
శ్రుత్వా కర్ణం ముషితం ధార్తరాష్ట్రా దీనాః సర్వే భగ్న దర్పా ఇవాసన్
తాం చావస్థాం గమితం సూతపుత్రం శ్రుత్వా పార్థా జహృషుః కాననేషు ౪౦

కర్ణుడు దేవేంద్రునితో 'ఒక్కనినే చంపగోరుచున్నాను' అని పలికినాడు. ఆయొక్కడు అర్జునుడని కర్ణు నభిప్రాయము. అర్జును డింద్రసుతుడగుటచే కర్ణుడు 'ఒక్కనినే చంపెదను' అని పలికినాడు. ఇంద్రుడు 'ఆయొక్కడు కృష్ణరక్షితుడై యున్నాడు' అని పలికినాడు. కావున కర్ణుడా శక్తియాయుధము నర్జున సంహారార్థ మపేక్షింపగా నింద్రు డట్లు జరుగునది కాదని తెల్పుచు నాయుధము నొసంగినాడు అర్జునుడు దివ్యాస్త్రములు సంపాదించు నీసమయమున కర్ణు డిట్లు దైవోపహతుడైనాడు. దీనికి కౌరవులందఱు దీనులు, భగ్నహృదయులునైరి. పాండవులు హర్ష మొందిరి

గూడ గర్ణుని యవివేకము సువ్యక్తమగుచున్నది. * కృష్ణుడు పాండవపక్షమునకు చేరరమ్మని కర్ణునితో పలికిన విషయము

---

* కర్ణుని రథమెక్కించికొనిపోయి కృష్ణుడు సురుచిరమగు మంత్ర మొనర్చెను. (ఉద్యో 136-20,30) అని మాత్రము చెప్పబడినది. 'కృష్ణ కర్ణుల కేమి ప్రసంగ మేర్పడినది' అని ధృతరాష్ట్రు డడిగిన దానికి సంజయుడు సమాధాన మిచ్చినట్లుగా నీప్రసంగమంతయు వివరింపబడినది. సంజయు డీసమయమునకు దివ్యదృష్టిగలవాడు కాడు. వేదవ్యాసానుగ్రహమున సంజయునకు యుద్ధసమయమందుమాత్రమే దివ్యదృష్టి యేర్పడియుండినది. కాగా సంజయున కిపు డీ రహస్యవృత్తాంతము వ్యక్తమగుట గమనింపదగినది. యుద్ధాత్పూర్వ కాలమందే కర్ణుడు కౌంతేయుడను విషయము కౌరవులం దిందువలన వ్యాప్తమైనది. రాయబారవిఫలకాలమున కృష్ణు డిట్టి రాజకీయప్రయోజనము నమోఘముగా సాధించినాడని యభిప్రాయము 'నీకు కుంతీపాండురాజులు తల్లిదండ్రులు, పంచపాండవులు తమ్ములు, ద్రౌపదేయులు అభిమన్యుడు పుత్రులగుదురు' అని కృష్ణుడు కర్ణునితో బలికినాడు. కర్ణు డిపుడు తన్ను పెంచియున్న సూతుని, రాధను, వారి సంతానమును, విడిచి పాండవులను చేరవలసియున్నది. అట్లే తనభార్యను, పుత్రులను విడిచి పాండవపక్షము చేరవలసి యున్నదని దీని యభిప్రాయము. ఈపరిస్థితిగా గర్ణుడు పాండవపక్షమున జేరినచో వసుసేనుడుగా పట్టాభిషిక్తుడగుట, ద్రౌపదిభార్యయగుట గల్గునని కృష్ణుడుపలికినాడు. కృష్ణు డీవిధమగు ధర్మవిధానమును లోకక్షేమార్థముగా కర్ణునితో బలికినాడు.

కృష్ణః ఉపాసితా స్తే రాధేయ బ్రాహ్మణా వేదపారగాః
తత్త్వార్థం పరిపృష్టాశ్చ నియతా నానసూయతా
త్వ మేవ కర్ణ జానాసి వేదవేద్యాన్ సనాతనాన్
త్వ మేవ ధర్మశాస్త్రేషు సూక్ష్మేషు పరినిష్ఠితః
కానీనశ్చ సహోఢశ్చ కన్యాయాం యశ్చ జాయతే
వోఢారం పితరం తస్య ప్రాహు శ్శాస్త్రవిదో జనాః
సోఽపి కర్ణ తథా జాతః పాండోః పుత్రోఽసి ధర్మతః
నిగ్రహా ద్ధర్మశాస్త్రాణా మేహి రాజా భవిష్యసి

ధృతరాష్ట్ర సంజయసంభాషణముగా వ్రాయబడినది. కర్ణు డీప్రసంగమందు సామ్రాట్ ధర్మరాజే యని పలికినాడు తాను సామ్రాట్ కానని నాడు. తనకు రాజ్యమొసగిన దా

---

పితృపక్షేచ పార్థా మాతృపక్షేచ వృష్ణయః
ద్వౌ పక్షా నభిజానీహి త్వ మేతౌ పురుషర్షభ
మయా సార్థ మితో యాత మద్య త్వాం తాత పాండవాః
అభిజానంతు కౌంతేయం పూర్వజాతం యుధిష్ఠిరాత్

---

పాదౌ తవ గ్రహీష్యంతి భ్రాతరః పంచపాండవాః
ద్రౌపదేయా స్తథా పంచ సౌభద్ర శ్చాపరాజితః
రాజానో రాజపుత్రాశ్చ పాండవార్థే సమాగతాః
పాదౌ తవ గ్రహీష్యంతి సర్వే చాంధకవృష్ణయః
హిరణ్మయాంశ్చ తే కుంభాన్ రాజతా న్పార్థివాం స్తథా
ఓషధ్య సర్వబీజాని సర్వరత్నాని వీరుధః
రాజన్యా రాజకన్యాశ్చ పావయం త్వభిషేచనం
షష్ఠే త్వాంచ తథా కాలే ద్రౌప ద్యుపగమిష్యతి
అగ్నిం జుహోతు వై ధౌమ్యః సంశితాత్మా ద్విజోత్తమః
అద్య త్వా మభిషించంతు చాతుర్వైద్యా ద్విజాతయః
పురోహితః పాండవానాం బ్రహ్మకర్మ ణ్యవస్థితః
తథైవ భ్రాతరః పంచ పాండవాః పురుషర్షభాః
ద్రౌపదేయా స్తథా పంచ పాంచలా శ్చేదయ స్తథా
అహంచ త్వాభిషేక్ష్యామి రాజానం పృథివీ పతిం
యువరాజోఽస్తు తే రాజా ధర్మపుత్రో యుధిష్ఠిరః
గృహీత్వా వ్యజనం శ్వేతం ధర్మాత్మా సంశితవ్రతః
ఉపాన్వారోహతు రథం కుంతీపుత్రో యుధిష్ఠిరః
ఛత్రంచ సుమహాశ్వేతం భీమసేనో మహాబలః
అభిషిక్తస్య కౌంతేయో ధారయిష్యతి మూర్ధని
కింకిణీశత నిర్ఘోషం వైయాఘ్రపరివారిణం

నది దుర్యోధనున కిచ్చెదనని పలికినాడు మనః ప్రవృత్తి నెఱింగిన కృష్ణుడు తుదిప్రయత్న మిట్లు గావించినాడు. కర్ణుడు కౌంతేయుడని కౌరవులకు దెలియుట యిందువలన నేర్పడినది. కర్ణుడు వ్యర్థముగా- అశక్త దుర్జనత్వముగా నర్జునసంహార మపేక్షించియే దుర్యోధనపక్షమందుండినాడుగాని దుర్యోధన కార్యమునకు గాదని యెఱుంగదగును. మఱియు గర్ణుడు కృష్ణునితో విపరీతము పలుకుటయే కాక కుంతి తన యొద్దకు వచ్చినపుడు ధర్మజ భీమ నకుల సహదేవులను యుద్ధమందు జంపను. అని మాట పలికినాడు. కుంతికోరనిదే కర్ణు డిట్లుపలుకుట విచిత్రము, ఈవిషయము దుర్యోధనునకు వ్యక్తము చేయకుం

---

రథం శ్వేతహయై ర్యుక్త మర్జునో వాహయిష్యతి
అభిమన్యుశ్చ తే నిత్యం ప్రత్యాసన్నో భవిష్యతి
నకుల స్సహదేవశ్చ ద్రౌపదేయాశ్చ పంచ యే
పాంచాలా శ్చానుయాస్యంతి శిఖండీచ మహారథః
అహంచ త్వానుయాస్యామి సర్వే చాంధకవృష్ణయః
దాశార్హాః పరివార స్తే దశార్ణాశ్చ విశాంపతే
భుంక్ష్వ రాజ్యం మహాబాహో భ్రాతృభి స్సహ పాండవైః
జపై ర్హోమైశ్చ సంయుక్తో మంగళైశ్చ పృథ గ్విధైః
విజయం వసుషేణస్య ఘోషయంతుచ పాండవాః

.................................

సత్వం పరివృతః పార్థై ర్నక్షత్రై రివ చంద్రమాః

ప్రశాధి రాజ్యం కౌంతేయ కుంతీంచ ప్రతినందయ
మిత్రాణి తే ప్రహృష్యంతు వ్యథంతు రిపవ స్తథా
సౌభ్రాత్రం చైవ తేఽద్యాస్తు భ్రాతృభి స్సహ పాండవైః

నూతకులసంబంధమును విడనాడి పాండవపక్షమునజేరి దుర్యోధనాదులను రిపులుగా నెంచి కర్ణుడు సామ్రాట్టు కాదగినదని కృష్ణుడు సూచించినాడు.

డుట మఱియు విచిత్రము. కర్ణు డిట్టి వ్యర్థుడు కావుననే కుంతి ధర్మరాజునితో * 'కర్ణుడు శోచ్యుడు కాడు' అని పలికినది. కర్ణుడు దుష్టచతుష్టయమం దొకడుగా నేర్పడినాడు.

స్వర్గారోహణ పర్వమం దొక విచిత్రము గలదు. స్వర్గమందు గర్ణుడు దుర్యోధనాదులయొద్ద నుండలేదు, భీమార్జునాదులున్న చోట నుండినాడు. * లోకమందు దుష్టుల దుదముట్టింప గారణజన్ములుగా నుద్భవించియున్న దేవతలం దఱు మరల స్వస్థానముల జేరినారని యిందువలన గ్రహింప వలయును, కావున సూర్యేంద్రులు స్వర్గమున నొకేచోట

* యుధిష్ఠిర మహాబాహో నైనం శోచితు మర్హసి
జహి శోకం మహాప్రాజ్ఞ శృణు చేదం వచో మమ శాంతి ౬-౪
యాచిత స్స మయా పూర్వం భ్రాతృం జ్ఞాపయితుం తవ
భాస్కరేణచ దేవేన పిత్రా ధర్మభృతాంవర ౫
య ద్వాచ్యం హితకామేన సుహృదా హిత మిచ్ఛతా
తథా దివాకరే ణోక్తః స్వప్నాంతే మమ చాగ్రతః ౬
న చైన మశక ద్భాను రహం వా స్నేహకారణైః
పురా ప్రత్యను నేతుం వా నేతుం వా ప్యేకతాం త్వయా ౭
తతః కాలపరీత స్తు వైర స్యోద్ధరణే రతః
ప్రతీపకారీ యుష్మాక మితి చోపేక్షితో మయా ౮
కర్ణునివిషయకమగు నీకుంతియొక్క ఉపేక్ష రాజకీయమైనది, లోక హితకారకమైనదని యభిప్రాయము.

* నారదుడు ధర్మజునితో నిట్లు పలికినాడు.
గుహ్య మేతత్తు దేవానాం కథయిష్యామి తేఽనఘ
తన్నిబోధ మహాబాహో యథావృత్త మిదం పురా శాంతి ౨-౩
క్షేత్రం స్వర్గం కథం గచ్ఛే శ్శస్త్రపూత మితి ప్రభో
సంఘర్షజనన స్తస్మా త్కన్యాగర్భో వినిర్మితః ౪

నున్న వారైరని పర్యవసానము. కర్ణుడు దుర్మార్గప్రవర్తకుడని, సూర్యుడు లోకహితకారియని ఫలితార్థము.

వ్యాసభారతమందు గర్ణునివిషయ మిట్లుండగా భాషాంతరీకరణములు, విమర్శనములు కర్ణునందు భావమును ప్రకటించుచున్నవి. కర్ణాదులు లోకద్రోహులనియు, భీష్మాదులు ధర్మబుద్ధిగలవారనియు, పాండవాదులు ధర్మప్రతిష్ఠాపకులని ఫలితార్థము. దేవతలందఱు రెండుగా విభాగమై భూలోకమందిట్లు ప్రవర్తించి లోకక్షేమకారకులైరని, మరల స్వస్థానములు చేరుకొనిరని పర్యవసానము.

రామాయణ భారతములందు ముఖ్యముగా నారాయణ సూర్యేంద్రులయొక్క ప్రవృత్తి, వాయువుయొక్క ప్రవృత్తి, చక్కగా నవగాహన మొనరించుకొనుట తగును. వాల్మీకిరామాయణమును, వ్యాసభారతమును మిక్కిలిగా నెమరవేయుటవలన పరమోద్ధారకము కాగలదు.

వేదవ్యాసవిరచితమైన మహాభారతము పలుమాఱుగా బఠించుట ఉభయతారకమైనది. పఠించినకొలందియు నందలి

---

ఏవం శప్త స్తవ భ్రాతా బహుభి శ్చాపి వంచితః
న శోచ్య స్స నరవ్యాఘ్రో యద్దేహి నిధనం గతః         ౫-౧౫

కర్ణుడు రాజ్యమంగీకరించువాడు కాడని యుద్ధాత్పూర్వము కృష్ణుడు తేల్చి వచ్చినాడు. కుంతీసూకారము కర్ణునందు పొడకట్టిన ధర్మరాజు (పాండవులు) కర్ణ నుపేక్షగావించి లోకక్షేమదృష్ట్యా కర్ణుని తుదముట్టించెను. క్షత్ర మిట్లు శస్త్రపూతముకాగా దేవతలు స్వస్థానములు చేరికొనిరి. (పునశ్లోకా నవాపన్యథ సభా 3౬-౧౫)

విశేషము లవగాహన మగుచుండును. (ఒకమాఱుకంటె నొక మాఱు గ్రంథస్థవిశేషము సువ్యక్త మగుచుండును.) అవగాహ నమగుకొలంది యాసక్తి మెండగును, మనశ్శాంతి యేర్పడి సత్ప్రవృత్తి కలుగును. నిదానముగా బఠించినగాని గ్రంథ మవగాహనము కాదు. భారతామృతరసము నోపికగా బఠించి యనుభవింపవలసియున్నది. పాఠకు లోపికపట్టి పలు మాఱుగా నీగ్రంథమును పఠించి విషయగ్రహణము గావింప వలసినది. తాత్పర్యము, వివరణముల మూలముగా మహాభా రతశ్లోకముల నవగాహన మొనరింపవలసి యున్నది. అట్లయి ననే రససిద్ధి యేర్పడగలదు, వివేకము, ఆస్తికత, సనాతన మార్గము గలుగగలదు.

రామాయణ భారతములు, తిక్కనభారతము విమ ర్శించి నేను గ్రంథములు ముద్రించుచున్నాను. గవర్నమెంటు, సాహిత్య ఎకాడమీ, సంస్థలు, వ్యక్తులు తగుప్రోత్సాహము కల్గించుచున్నవి.

ఆంధ్రప్రదేశప్రభుత్వము విద్యాశాఖనుండి రూ2500లు లభించినది. 1. కృష్ణరాయణము 2. రాజసూయము, 3. ద్యూ తము 4. గౌతమాశ్రమము-అహల్య - అనుగ్రంథములను ము ద్రించుచున్నాను 2 గ్రంథములు ముద్రణమైనవి. 2 గ్రంథ ములు ముద్రణమగుచున్నవి.

Central govt, State govt నాకు నెలకు రూ75లు Allovance ఇచ్చుచున్నవి.

1. తిక్కన కళాసామ్రాజ్యము-
   అజ్ఞాతవాసము, కీచకవధ 2-50
2. తిక్కన కళాసామ్రాజ్యము-
   సంజయరాయబారము 2-75
3. తిక్కన కళాసామ్రాజ్యము- కృష్ణరాయబారము 2-75
4. భారతామృతరసము- అజ్ఞాతవాసము, కీచకవధ 2-75
5. భారతామృతరసము- గోహరణము 3-00
6. భారతామృతరసము- రాజసూయము 3-00
7. భారతామృతరసము- ద్యూతము 3-00
8. రామరాజ్యము- కుశలవులు 3-00
9. గౌతమాశ్రమము- అహల్య 2-50
10. మహాభారత తాత్పర్య నిర్ణయము-
    రామాయణము 3-00

ఆదినుండి నాకృషిని ప్రోత్సహించుచున్న గవర్నమెంటుకు, సంస్థలకు, వ్యక్తులకు మిగుల కృతజ్ఞుడను.

విజయనగరము }
శా॥శ॥ ౧౮౯౧ }

కొఱూరి వ్యాసమూర్తి
గ్రంథకర్త

# భారతామృత రసము

## గోహరణము

పాండవులు ద్రౌపదితో గూడ విరాటనగరమందు ప్రచ్ఛన్నచారులై యజ్ఞాతవాసము గావించుచుండిరి. తనయం దల్పమతిగా వర్తించు దురాత్ముని దుదముట్టించు కట్టడి గావించి కొని ద్రౌపది సైరంధ్రిగా విరాటునంతఃపురమున వర్తించు చుండెను. కీచకు డట్లు విపరీతమునకు గడంగగా ద్రౌపది భీము నితో 'కీచకుని వధింపుము' అని ప్రేరేపించినది. , 'బంధువు లతో గూడ కీచకుని వధించెదను' అని భీముడు పలికి రాత్రి కాలమం దానూటయాఱుగురు కీచకులను తుదముట్టించెను. ఈ సంఘటనమునకు పౌరులు భయమొంది విరాటునకు విన్న వించిరి, విరాటుడు చెప్పిన ప్రకారము సుధేష్ణ 'నీ యిష్టము వచ్చిన చోటుకు వెడలిపొమ్ము' అని ద్రౌపదితో బలికినది. అప్పుడు సైరంధ్రి యిట్లు పలికినది.

---

(1) ద్రౌపది కీచకుని సంహరింపుమని చెప్పగా భీముడు బంధువులతో గూడ వానిని దుదముట్టించెదనని పలికెను.

తథా భద్రే కరిష్యామి యథా త్వం భీరు భాషసే
అద్య తం సూదయిష్యామి కీచకం సహ బాంధవమ్-౨-౨-౧, ౩౩

కీచకులందఱు దుష్టబంధువులు, వారల దుదముట్టించిన పాండవులవలన విరాటుడు తన బంధువులతో గూడ నిశ్చయ ముగా శ్రేయ మొందువా డగుచున్నాడని యభిప్రాయము.

త్రయోదశాహమాత్రం మే రాజా క్షామ్యతు భామిని
కృతకృత్యా భవిష్యంతి గంధర్వా స్తే న సంశయః ౨౮-౩౦
తతో మా ముపనేష్యంతి కరిష్యంతిచ తే ప్రియం
ధ్రువంచ శ్రేయసా రాజా యోక్ష్యతే సహబాంధవైః ౩౧

('భామిని పదుమూడుదినములుమాత్రము రాజు క్షమింప దగును. ఆ గంధర్వులు కృతకృత్యు లగుదురు, నిస్సంశయము- అప్పుడు నన్ను వారు గొనిపోయెదరు నీకు ప్రియమును గల్గింపగలరు. రాజు బంధువులతోగూడ శ్రేయ మొందగలడు. ధ్రువ మిది-అని సైరంధ్రి పలికెను.)

'ధ్రువంచ శ్రేయసా రాజా యోక్ష్యతే సహబాంధవైః' అనునది యెంతటి గాంభీర్యార్థమునో వ్యక్తీకరించుచున్నది.
కీచకస్యతు ఘాతేన సానుజస్య విశాంపతే
అత్యాహితం చింతయిత్వా వ్యస్మయంత పృథగ్జనాః ౨౫ ౧
తస్మిన్ పురే జనపదే సంజల్పోఽభూచ్చ సర్వశః

శౌర్యాద్ధివల్లభో రాజ్ఞో మహాసత్వశ్చ కీచకః ౨
ఆసీత్ ప్రహర్తా సైన్యానాం దారామర్శీచ దుర్మతిః
స హతః ఖలు పాపాత్మా గంధర్వై ర్దుష్టపూరుషః
ఇత్యజల్ప న్మహారాజ పరానీకవినాశనం
దేశే దేశే మనుష్యాశ్చ కీచకం దుష్ప్రధర్షణమ్ ౪
అథవై ధార్తరాష్ట్రేణ ప్రయుక్తా యే బహిశ్చరాః
మృగయిత్వా బహూన్ గ్రామాన్ రాష్ట్రాణి నగరాణిచ ౫

సంవిధాయ యథాదృష్టం యథాదేశప్రదర్శనం ౧౧
కృతకృత్యా న్యవర్తంత తే చరా నగరం ప్రతి ౬

(సామజుడగు కీచకుడు హతుడగుట విని జనులు విస్మయము నొందిరి. రాజునకు శౌర్యాద్ధివల్లభుడగు కీచకుడు-మహాసత్వుడు, సైన్య ప్రహర్త. దారామర్శియగు దుర్మతి-యా కీచకుడు-ఆ పాపాత్ముడు దుష్టపూరుషుడు గంధర్వులచే హతుడైనాడుకదా యంచు విరాటనగరమందు, జనపదమునందు నంతట వార్త యేర్పడెను. ఈ కీచకమరణవార్తను దేశ దేశ ప్రజలు చెప్పుకొనసాగిరి. ఇది యిటులుండగా ధార్తరాష్ట్రప్రయుక్తులగు చారులు బహుగ్రామములను, రాష్ట్రములను, నగరములను గాలించుచు పాండవులను వెదుకనారంభించి యెచ్చట నెట్లు చూడవలెనో యేదేశమం దెట్లు గాలించవలెనో యట్లు గాలించి కృతకృత్యులుగా నేర్పడినవారై హస్తినాపురమునకు మరలి వచ్చిరి.)

పాండవులు కీచకులను సంహరించినందున విరాటుడు శ్రేయమొందు వాడగు సమయమునకు దుర్యోధనచారులు పాండవులజాడను గాలించుచుండిరి. వారికీ కీచకమరణవార్త దేశదేశములందు వినవచ్చినది. ఈ సంఘటన కౌరవ పరాభవ సూచకమగు పాండవవ్రతసమాప్తిని వ్యక్తమొనరించుచున్నది. ఇచ్చట దుర్యోధనచారులనుగూర్చి 'కృతకృత్యాన్యవర్తంత' అనియుండుట చిత్రముగానున్నది. ఎవరు వెదికినను పాండవుల జాడ యెఱుకపడదుకదా. కావున కౌరవచారులు వారి కృత్యమును వారు సంపూర్తిగా నిర్వర్తించి (ప్రపంచమంతయు గాలించి)హస్తినాపురమునకుమరలి పోయిరని, వారు కృతకృత్యులని తలంచికొని హస్తినాపురమునకు జేరికొనిరని చమత్కారము. ఇది పాండవుల జాగరూకతను వెల్లడించుచున్నది.

తత్ర దృష్ట్వాతు రాజానం కౌరవ్యం ధృతరాష్ట్రజం
ద్రోణకర్ణకృపైః సార్ధం భీష్మేణచ మహాత్మనా ౭
సంగతం భ్రాతృభి శ్చాపి త్రిగర్తైశ్చ మహారథైః
దుర్యోధనం సభామధ్య ఆసీన మిద మబ్రువన్
కృతో ఽ స్మాభిః పరో యత్న స్తేషా మన్వేషనే సదా
పాండవానాం మనుష్యేంద్ర తస్మిన్ మహతి కాననే
నిర్జనే మృగసంకీర్ణే నానాద్రుమలతాకులే
లతాప్రతానబహులే నానాగుల్మసమావృతే ౧౦
నచ విద్మో గతా యేన పార్థా స్సుదృఢవిక్రమాః
మార్గమాణా పదన్యాసం తేషు తేషు తథా తథా ౧౧
గిరికూటేషు దుర్గేషు నానాజనపదేషు చ
జనాకీర్ణేషు దేశేషు కటకేషు పరేషు చ ౧౨
నరేంద్ర బహుశో ఽ న్విష్టా నైవ విద్మశ్చ పాండవాన్
అత్యంతంవా వినష్టా స్తే భద్రం తుభ్యం నరర్షభ ౧౩
వర్త్మ న్యన్వేష్య మాణావై రథినాం రథిసత్తమ
నహి విద్మో గతిం తేషాం వాసంహి నరసత్తమ ౧౪
కచ్చి త్కాలం మనుష్యేంద్ర సూతానా మనుగా వయం
మృగయిత్వా యథాన్యాయం విదితార్థాస్స్మ తత్త్వతః ౧౫
ప్రాప్తా ద్వారావతీం సూతా వినా పార్థైః పరంతప
న తత్ర కృష్ణా రాజేంద్ర పాండవాశ్చ మహావ్రతాః ౧౬

కౌరవదూతలు పాండవులను గురించి యెల్ల చోట్లగాలించి వెదకిరో యది యిందు వివరింపబడినది. కౌరవదూతలు పాండవ సంబంధమగు పదన్యాసములను వర్త్మములను, సూతులను గాంచిరి కాని ద్రౌపదిని గాని, పాండవులనుగాని గనుగొన వారు కాజాలకపోయిరి. 'పాండవులను మేము బహువిధముల వెదకితిమి. వారి జాడ తెలియనేలేదు. అత్యంతము వారు నశించియే యుందురు, నరర్షభ. నీకు మంగళ మగుగాక' అని కౌరవదూతలు దుర్యోధనునితో బలికిరి ప్రభువెట్టివాడో చారులును నట్టివారే. అహంకారపూరితులగు నా దూతలు పాండవులు వారికి గానరానందున నశించినవారుగా నిర్ణయము పలికిరి. ద్రౌపది తప్పక కనిపించి పోగలదని యొకయూహ యిందు గలదు. 'న తత్ర కృష్ణా రాజేంద్ర పాండవాశ్చ మహావ్రతాః' అను దానిలో "మహావ్రతాః" అనునది విపులాన్వయ మైనది. పాండవులకంటె ముందుగా ద్రౌపది యుల్లేఖింపబడు టయు గమనింపదగినది. పాండవు లీవిషయమును గమనించి ఎంతయో మెలకువగ ప్రవర్తించిరి. కౌరవదూతలు పాండవుల వారినెల్ల గాంచిరి కాని పాండవులను గాంచలేరైరి.

అజ్ఞాతవాస మొనర్చుటకు పదమూడుదేశముల నర్జునుడు నిర్దేశించి పలుకగా నందు విరాటనగరమును ధర్మజుడు నిర్ణయించినాడు, విరాటనగరమున దామెట్లుండవలెనో యది పాండవులు ద్రౌపది నిర్ణయించుకొనిరి.

యుధిష్ఠిరః

కర్మాణ్యుక్తాని యుష్మాభి ర్యాని యాని కరిష్యథ
మమ చాపి యథా బుద్ధి రుచితా విధినిర్ణయాత్ ౪-౧

పురోహితోఽయ మస్మాక మగ్నిహోత్రాణి రక్షతు
సూతపౌరోగవై స్సార్థం ద్రుపదస్య నివేశనే ౨
ఇంద్రసేనము ఖాశ్చేమే రథానాదాయ కేవలాన్
యాంతు ద్వారవతీం శీఘ్ర మితి మే వర్తతే మతిః ౩
ఇమాశ్చ నార్యో ద్రౌపద్యా స్సర్వాశ్చ పరిచారకాః
పంచాలా నేవ గచ్ఛంతు సూతపౌరోగవై స్సహ ౪
సర్వై రపిచ వక్తవ్యం న ప్రాజ్ఞాయంత పాండవాః
గతా హ్యస్మా నపాకీర్య సర్వే ద్వైతవనా దితి ౫
వైశంపాయనః
ఏవ ముక్త స్తతో రాజ్ఞా ధౌమ్యోఽథ ద్విజసత్తమః
అకరోద్విధివ త్సర్వం ప్రస్థానే యద్విధీయతే ౫౪
తేషాం సమిధ్య తా నగ్నీన్ మంత్రవచ్చ జుహోవ సః
సమృద్ధివృద్ధిలాభాయ పృథివీవిజయాయచ ౫౬
అగ్నిన్ ప్రదక్షిణీ కృత్య బ్రాహ్మణాంశ్చ తపోధనాన్
యాజ్ఞసేనీం పురస్కృత్య షడేవాథ ప్రవవ్రజుః ౫౭
గతేషు తేషు వీరేషు ధౌమ్యోఽథ జపతాంవరః
అగ్నిహోత్రా ణ్యుపాదాయ పాంచాలా నభ్యగచ్ఛత ౫౮
ఇంద్రసేనాదయశ్చైవ యథోక్తాః ప్రాప్య యాదవాన్
రథా నశ్వాంశ్చ రక్షంత స్సుఖ మూషు స్సుసంవృతాః ౫౯
తే వీరా బద్ధనిస్త్రింశా స్తతాయుధ కలాపినః
బద్ధగోధాంగుళిత్రాణాః కాళిందీ మభితో యయుః ౫౧
తత స్తే దక్షిణం తీర మన్వగచ్ఛన్ పదాతయః

నివృత్తా వనవాసాద్వై స్వరాష్ట్రం ప్రేప్సవ స్తదా ౨
వసంతో గిరిదుర్గేషు వనదుర్గేషు ధన్వినః
విధ్యంతో మృగజాతాని మహేష్వాసా మహాబలాః ౩
ఉత్తరేణ దశార్ణాం స్తే పంచాలాన్ దక్షిణేనచ
అంతరేణ యకృల్లోమాన్ శూరసేనాంశ్చ పాండవాః ౪
లుబ్ధా బ్రువాణా మత్స్యస్య విషయం ప్రావిశన్ వనాత్
ధన్వినో బద్ధనిస్త్రింశా వివర్ణాః శ్మశ్రుధారిణః ౫
తతో జనపదం ప్రాప్య కృష్ణా రాజాన మబ్రవీత్
పశ్యైకపద్యో దృశ్యంతే క్షేత్రాణి వివిధానిచ ౬
వ్యక్తం దూరే విరాటస్య రాజధానీ భవిష్యతి
వసామే హాపరాం రాత్రిం బలవాన్ మే పరిశ్రమః ౭

యుధిష్ఠిరః

ధనంజయ సముద్యమ్య పాంచాలీం వహ భారత
రాజధాన్యాం నివత్స్యామో విముక్తాశ్చ వనాదితః ౮

వైశంపాయనః

తా మాదా యార్జున స్తూర్ణం ద్రౌపదీం గజరాడివ
సంప్రాప్య నగరాభ్యాశ మవాతారయ దర్జునః

విరాటనగరమున నెట్లు ప్రవర్తింపవలెనో యది మీరలు చెప్పిన కార్యవచనములు తగియున్నవి. విధివశమున నాకును ఉచితమేయని తోచుచున్నది అని ధర్మజుడు తమ్ములతోను, ద్రౌపదితోను పలికి మఱియు నిట్లనెను. మనపురోహితుడు మన యగ్నిహోత్రములను గాపాడవలసినది. సూతపౌరోగవులతో గూడ ద్రుపదపురమున నుండవలయును. ఇంద్రసేనముఖులగు

వారందఱు కేవలము రథములను గొని శీఘ్రముగా ద్వారకా నగరమునకు బోవలయునని నా యభిప్రాయము. ద్రౌపది యొక్క స్త్రీలు, పరిచారకు లందఱు సూతపౌరోగవులతోగూడ పంచాలదేశమునకు బోవలయును. 'మాకు పాండవులవిషయము దెలియదు, వారు ద్వైతవనమునుండి మమ్ములను విడిచి వెడలి పోయిరి' అని యెల్లరు వచింప వలయును. ధర్మజు డన్ని యేర్పాట్ల నిట్లు పలుకగా నపుడు ధౌమ్యుడు రాజసేవావిధానమును ప్రవచించిపలికెను- ధౌమ్యుడు పలికినదానికి ధర్మజుడు కృతజ్ఞతను పలికెను, ధౌమ్యు డపు డగ్నిహోత్ర మొనరి మంత్రాహుతి గావించి ప్రస్థానమంగళ మాచరించెను. సమృద్ధి వృద్ధిలాభమునకును. పృథివీవిజయముకొఱకును పాండవులు తపోధనులగు బ్రాహ్మణులకు నమస్కరించి ద్రౌపదిని పురస్కరించుకొని యాఱుగురు బయలువెడలిరి. వారు వెడలిపోయిన పిమ్మట దౌమ్యు డగ్నిహోత్రములను గొని పాంచాలదేశమునకు బోయెను, ఇంద్రసేనముఖులగువారు రథములు గుఱ్ఱములును గొనిపోయి యాదవులనుజేరి సుఖముండిరి. ఆ వీరులు పాండవు లాయుధములు ధరించి బద్ధగోదాంగుళిత్రాణులై కాళిందీనది కభిముఖముగా బోయిరి. వనవాసమునుండి మరలి స్వరాష్ట్రమును బొందగోరిన పాండవులు పాదచారులై యానదికి దక్షిణముగా బోయిరి. ధనుస్సులు ధరించి గిరిదుర్గములందు, వనదుర్గములందు బోవుచుండిరి అడవిమృగములను గొట్టుచు మార్గ మేర్పఱచుకొనుచు దశార్ణవదేశమున కుత్తరముగా బాంచాలదేశమునకు దక్షిణముగా అకృల్లోమ శూర

సేనదేశములకు మధ్యగా పోవుచు వనమునుండి పైకివచ్చి వత్స
దేశమును చేరికొనిరి. విషణ్ణులై శ్మశ్రుధారులై పాండవులీ
తీరున వనములనుదాటి జనపదమును బొందిరి. అపుడు ద్రౌపది
ధర్మజునితో మార్గక్షేత్రములు వివిధములుగా గానవచ్చుచున్నవి.
విరాటరాజధాని దూరమున్నదని వ్యక్తమగుచున్నది ఈ
యపరాత్ర మిట నిలువుదము. నా పరిశ్రమ మిక్కిలి కష్టముగా
నున్నది. అని పలికెను. 'ధనంజయుడా! పాంచాలిని మోచి
తెమ్ము ఈ వనమునుదాటి రాజధానియందు ప్రవేశింతము' అని
ధర్మజుడనెను. అర్జునుడు తత్‌క్షణము గజేంద్రునిమాడ్కి
ద్రౌపదిని గొని నగరసమీపమునకు జేర్చెను.

బాహ్యాభ్యంతరపరివారమునంతయు బంపివేసి పాండవులు
ద్రౌపది పిరాజుగురుమాత్రమే బయలుదేరి కాలినడక నడవు
లందు సంచరించిరి. గిరిదుర్గములు, వనదుర్గములందు వర్తించుచు
నపుడు బహుభంగులగు మార్గములు ద్రొక్కుచు పాండవులు
ప్రచ్ఛన్నసంచారు లగుచుండిరి. అదియు నాటవికులు నడుచు
మార్గమున గాక మృగజాతములను గొట్టుకొనుచు మార్గ
మేర్పఱచుకొనుచుండిరి. ఇట్లడవులంబడిన పాండవులు వత్స
దేశము వచ్చువఱకు నిట్లే ప్రవర్తించిరి. వివర్ణులు, శ్మశ్రుధారు
లైరి. విరాటరాజధానిని జేరుకొనుటకు ముందటిరాత్రి యపర
రాత్రమువఱకు వారడవులందే యుండుట గమనింపదగినది.
మరల స్వరాజ్యమును బడయుటకై యింతటి శ్రమను పాండవు
లొందిరి. అజ్ఞాతవాసములో ప్రవేశించుట కింతటి ప్రయత్నములు
సాగించిరి, ద్రౌపది యెంతటిమార్గమో యిట్లు కష్టతరమగు

ద్రోవలందుబడి పాదచారిణియై వచ్చినది ఇట్లయిననుగూడ కౌరవదూతలు పాండవులను వెదకుటలో బహుజాగరూకులు గానే ప్రవర్తించిరి. కౌరవచారులు పాండవులను వెదకుచు పద న్యాసములను గనుగొనిరి. రథికులను, సూతులను గనుగొనిరి, పాండవు లంతకన్న జాగరూకులై యజ్ఞాత వాసప్రవేశమొన రించిరి.

అజ్ఞాతవాసకాలమున పాండవుల యగ్నికార్యములను పురోహితుడు ధౌమ్యుడు గావించెను. పాండవుల ధర్మప్రవర్తన మిందు విశేషించి గలదు, అజ్ఞాతవాసమున పాండవులు ద్రౌపది యూఱుగురుమాత్రమే విరాటనగరమున వర్తించిరి. ద్వైత వనము నుండే పాండవులు పరివారమునంతయు బంపివేసిరి, ఆపరివారమును వెన్నాడిన కౌరవదూతలు పాండవులజాడను మాత్ర మెఱుంగజాలరైరి. పాండవులిట్లు కడు మెలకువగా విరాటనగరము ప్రవేశించి ప్రవర్తించుచుండగా కౌరవదూతలు పాండవులను గాంచలేక వారు నశించియుందురని తలంచికొని దుర్యోధనునితో నిట్లుగా బ్రసంగించి మఱియు నిట్లనిరి.

సర్వథా విప్రనష్టాస్తే నమస్తే భరతవర్షభ
నహి విద్మో గతిం తేషాం వాసం వాపి
మహాత్మనామ్ ౨౫ ౧౭

పాండవానాం ప్రవృత్తించ విద్మః కర్మాపివా కృతం
స న శ్నాధి మనుష్యేంద్ర అత ఊర్ధ్వం విశాంపతే ౧౮
అన్వేషణే పాండవానాం భూయః కిం కరవామహే
ఇమాంచ నః ప్రియాం వీర వాచం భద్రవతీం శృణు ౧౯

యేన త్రిగర్తా నిహతా బలేన మహతా నృప
సూతేన రాజ్ఞో మత్స్యస్య కీచకేన పునః పునః ౨౦
స హతః పతిత శ్శేతే గంధర్వైర్నిశి భారత
అదృశ్యమానై ర్దుష్టాత్మా భ్రాతృభి స్సహసోదరైః ౨౧
ప్రియ మేత దుపశ్రుత్య శత్రూణాంచ పరాభవం
కృతకృత్యంచ కౌరవ్య విధత్స్వ యదనంతరమ్ ౨౨

(అన్ని విధముల పాండవులు నశించిపోయియేయుందురు నీకు నమస్కరించెదను, వారిగతిగాని, వారియునికిగాని మేము తెలియజాలకుంటిమి. వారి ప్రవృత్తిగాని, వారి వ్యాపారము గాని తెలియలేదు, మనుష్యేంద్ర! మమ్ము శాసింపవలసినది. మే మింకను పాండవాన్వేషణమందు విశేషించి యేమిగావింపవల యును. వీనుడా! మనకు ప్రియమైన భద్రవచన మిది యాల కింపుము. విరాటసూతుండగు కీచకునిచే త్రిగర్తులు పలుమారు హింసింపబడి యున్నవా రా కీచకుడిపుడు సోదరులతోకూడ రాత్రికాలమం దదృశ్యమానులగు గంధర్వులచే హతుడై పడి నాడు, కౌరవ్యా! ప్రియమగు దీనిని - శత్రువులపరాభవమును విని కృతకృత్యుడవై తదనంతరకార్యమును చింతింపుము.)

దుర్యోధనచారు లెట్లు కృతకృత్యులై వర్తించిరో యట్లే యీ వార్తవినిన దుర్యోధనుడును నట్టి కృతకృత్యతే పొందు వాడగుట యిందు వలన నేర్పడుచున్నది. 'కృతకృత్యా భవి ష్యంతి గంధర్వా స్తే న సంశయః' అని గంధర్వులగురించియు నీ సందర్భముగ జెప్పబడియున్నది. కృతకృత్యతగురించి యీ ఘట్టమున వ్యాసు డిట్లు రచించుట విచిత్రముగా నున్నది.

* చారుఁమాట విని దుర్యోధనుఁడు చిరకాల మంతర్మ నస్కుఁడై యాలోచించి సభాసదులనుగూర్చి యిట్లు పలికెను. 'కార్యగతి నెఱుంగుట మిక్కిలి కష్టము. కావున నంద ఱిందు విషయమై నరయుఁడు, అల్పావశిష్టమైన యీకాల మీవత్సర శేషము గడచినచో పాండవులు పాముల మాడ్కి కౌరవుల విషయమై సంరబ్ధులై దుఃఖకారణు లగుదురు. అట్లుకాకుండ వారిజాడ నరయుచో నాజితక్రోధు లట్లే మరల వనము చేరు కొందురు. రాజ్యము నిర్ద్వంద్వము. అవ్యగ్రము. నిస్సపత్న ముగా జిరకాల మగునటుల నాపద్ధతి నరయుఁడు, అని పలికెను. కర్ణుఁడు మిగుల నేర్పరులగు నంతకన్న సమర్థులగు దూతలను బంపి పాండవులను పుణ్యభూము లం దన్వేషింపవలె ననినాఁడు. 'ధనము విశేషముగా నిపుడే యిచ్చి సమర్థులను బంపిన పాండవు లవశ్యము బయల్పడగలరు,

---

* అథ దుర్యోధనో రాజా జ్ఞాత్వా తేషాం వచ స్తథా
చిర మంతర్మనా భూత్వా ప్రత్యువాచ సభాసదః ౨౬-౧

సుదుఃఖా ఖలు కార్యాణాం గతి ర్విజ్ఞాతు మంతతః
తస్మా త్సర్వే నిరీక్షధ్వం క్వను తే పాండవా గతాః ౨

అల్పావశిష్టం కాలస్య గతభూయిష్ఠ మంతతః
తేషా మజ్ఞాతచర్యాణా మస్మి న్వర్షే త్రయోదశే
అస్య వర్షస్య శేషం చేత్ వ్యతీయు రిహ పాండవాః
నివృత్తసమయా స్తేహి సత్యవ్రతపరాయణాః ౪

క్షరంత ఇవ నాగేంద్రా స్సర్వే హ్యాశీవిషోపమాః
దుఃఖా భవేయు స్సరంబ్ధాః కౌరవాన్ ప్రతి తే ధ్రువమ్ ౫

అత్యంతము నిగూఢమై చరించు శూరమానులగు పాండవులు వ్యాళములచే భక్షింపబడియుందురు లేక గొప్పదేశమును పొంది శాశ్వతముగ నశించియుందురు. మనసు కుదుటపడును

సర్వే కాలస్య వేత్తారః కృచ్ఛ్రరూపధరాః స్థితాః
ప్రవిశేయు ర్జితక్రోధా స్తావ దేవ పురం స్వకమ్ ౬
తస్మాత్ క్షిప్రం బుభూషధ్వం యథా తేఽత్యంత మప్యయం
రాజ్యం నిర్ద్వంద్వ మవ్యగ్రం నిస్సపత్నం చిరం భవేత్ ౭
అథాఽబ్రవీ త్తతః కర్ణః క్షిప్రం గచ్ఛంతు భారత
అన్యే ధూర్తా నరా దక్షా నిభృతా స్సాధుకారిణః ౮
చరంతు దేశాన్ సంవీతాః స్ఫీతాన్ జనపదాఽఽకులాన్
తత్ర గోష్ఠీషు రమ్యాసు సిద్ధప్రవ్రజితేషు చ ౯
పరిచారేషు తీర్థేషు వివిధే ష్వాకరేషుచ
విజ్ఞాతవ్యా మనుష్యై స్తై స్తర్కయా స వినీతయా ౧౦
వివిధై స్తత్పరై స్సమ్యక తజ్జ్ఞైర్నిపుణసంవృతైః
అన్వేష్టవ్యా స్సునిపుణైః పాండవా శ్ఛన్నవాసినః ౧౧
నదీకుంజేషు తీర్థేషు గ్రామేషు నగరేషుచ
ఆశ్రమేషుచ రమ్యేషు పర్వతేషు గుహాసుచ ౧౨
అథాగ్రజానంతరజః పాపభావానురాగవాన్
జ్యేష్ఠం దుశ్శాసన స్తత్ర భ్రాతా భ్రాతర మబ్రవీత్ ౧౩
యేషు నః ప్రత్యయో రాజం శ్చారేషు మనుజాధిప
తే యాంతు దత్తదేయా వై భూయ స్తాన్ పరిమార్గితుమ్ ౧౪
ఏతచ్చ కర్ణో యత్ ప్రాహ సర్వ మీహామహే తథా
యథోద్దిష్టం చరా స్సర్వే మృగయంతు తత స్తతః ౧౫

కొని మహోత్సాహమున గార్యము గావింపుము అని దుశ్శా
సనుడు పలికెను, తత్త్వార్థదర్శియగు ద్రోణు డిట్లు పలికెను.
అటువంటివారు నశింపరు. పరాభవమొందరు. గుణసంశోభితులు
వారు, అన్ననను సరించు తమ్ములు, తమ్ములననుసరించు నన్నయు
నగు పాండవులు నశించువారు కారు. నీతిమంతుడగు పార్థుడేల
వారికి శ్రేయము కల్గింపకుండును, సర్వార్థములందు ధృతాత్ము

ఏతే చాన్యేచ భూయాంసో దేశా ద్దేశం యథావిధి
నతు తేషాం గతి ర్వ్యాసః ప్రవృత్తి శ్చోపలభ్యతే ౧౬
అత్యంతం వా నిగూఢా స్తే పారం వోర్మిమతో గతాః
వ్యాళై శ్చాపి మహాఽరణ్యే భక్షితా శ్శూరమానినః ౧౭
అథవా విషమం ప్రాప్య వినష్టా శ్శాశ్వతీ స్సమాః
తస్మా న్మానస మవ్యగ్రం కృత్వా త్వం కురునందన ౧౮
కురు కార్యం మహోత్సాహం మన్యసే యన్నరాధిప ౧౯
అథా బ్రవీ న్మహావీర్యో ద్రోణ స్తత్త్వార్థ దర్శివాన్
న తాదృశా వినశ్యంతి న ప్రయాంతి పరాభవమ్ ౧౭-౧
శూరాశ్చ కృతవిద్యాశ్చ బుద్ధిమంతో జితేంద్రియాః
ధర్మజ్ఞాశ్చ కృతజ్ఞాశ్చ ధర్మరాజ మనువ్రతాః ౨
నీతిధర్మార్థతత్వజ్ఞం పితృవచ్చ సమాహితాః
ధర్మేస్థితిం సత్యధృతిం జ్యేష్ఠం జేష్ఠానుయాయినః ౩
అనువ్రతా మహాత్మానం భ్రాతరోభ్రాతరం నృప
అజాతశత్రుం శ్రీమంతం సర్వభ్రాతౄ ననువ్రతమ్ ౪
తేషాం తథా విధేయానాం నిభృతానాం మహాత్మనామ్
కి మర్థం నీతిమాన్ పార్థః శ్రేయోనై షాం కరిష్యతి ౫

లును తపోధనులునగు పాండవులు దుర్జ్ఞేయులు. శుద్ధాత్ముడు. గుణవంతుడు, శుభచారిత్రుడగు పార్థుడు దృష్టిమాత్రముననే సకలము గ్రహించువాడు. అందువలన నింకను పెద్దప్రయత్నమున వారిని వెదకుదుము. బ్రాహ్మణులు, అట్టి వారి నిందు నియోగింప వలసినది, అని పలికెను. పిమ్మట భీష్ము డిట్లు పలికెను, సర్వ లక్షణ సంపన్నులు, సాధువ్రత సమన్వితులు, శ్రుతవ్రతోపసంపన్నులు, నానాశ్రుతి సమన్వితులు, వృద్ధానుశాసనయుక్తులు. సత్యవ్రతపరాయణులు, సమయపరిపాలకులు, శుచివ్రతులు, నిత్యక్షత్ర ధర్మరతులు నగు పాండవులు క్లేశ

---

తస్మా ద్యత్నాత్ ప్రతీక్షంతే కాల స్యోదయ మాగతం
నహి తే నాశ మృచ్ఛేయు రితి పశ్యా మ్యహం ధియా ౬
సాంప్రతం చైవ యత్కార్యం తచ్చ క్షిప్ర మకాలికం
క్రియతాం సాధు సంచిత్య వాస శ్చైషాం ప్రచింత్యతామ్ ౭
యథావ త్పాండుపుత్రాణాం సర్వార్థేషు ధృతాత్మనాం
దుర్ జ్ఞేయాః ఖలు శూరా స్తే దురాపా స్తపసావృతాః ౮
శుద్ధాత్మా గుణవాన్ పార్థ స్సత్యవా న్నీతిమాన్ శుచిః
తేజోరాశి రసంఖ్యేయో గృహ్ణీయా దపి చక్షుషా ౯
విజ్ఞాయ క్రియతాం తస్మా ద్భూయశ్చ మృగయామహే
బ్రాహ్మణై శ్చారకై స్సిద్ధై ర్యేచాన్యే తద్విదో జనాః ౧౦
తత శ్శాంతనవో భీష్మో భరతానాం పితామహః
శ్రుతవాన్ దేశకాలజ్ఞ స్తత్వజ్ఞ స్సర్వధర్మ విత్ ౧౮-౧
ఆచార్యవాక్యోపరమే తద్వాక్య మభిసందధత్
హితార్థం సమువా చేమాం భారతీం భరతాన్ ప్రతి ౨

మొందినవా రయ్యు నా ప్రవీర పురుషులు, మహాత్ములు, మహాబలులు, సన్మార్గ ప్రవర్తకులు నశించువారు కాజాలరు. ఆ పాండవులు ధర్మముచేతనే రక్షింపబడువారు సువీర్యముననే రక్షింపబడునారు. అట్టివారు నశింపరని నాయభిప్రాయము, ఇచ్చట పాండవులను గూర్చిన నిశ్చయము తెల్పెదను. సునీతుడైన వాని మార్గము పరులచే నన్వేషింపబడజాలదు. పరులెట్లును

యుధిష్ఠిరే సమాసక్తాం ధర్మజ్ఞే ధర్మసంవృతాం
అసత్సు దుర్లభాం నిత్యం సతాం చాభిమతాం సదా 3
భీష్మ స్సమవద త్తత్ర గిరం సాధుభి రర్చితాం
యథైవ బ్రాహ్మణః ప్రాహ ద్రోణ స్సర్వార్థతత్త్వవిత్ 4
సర్వలక్షణసంపన్నా స్సాధువ్రతసమన్వితాః
శ్రుతవ్రతోపపన్నాశ్చ నానాశ్రుతిసమన్వితాః 5
వృద్ధానుశాసనే యుక్తా సత్యవ్రతపరాయణాః
సమయం సమయజ్ఞాస్తే పాలయంత శ్శుచివ్రతాః 6
క్షత్రధర్మరతా నిత్యం కేశవానుగతా స్సదా
ప్రవీరపురుషా స్తేవై మహాత్మానో మహాబలాః 7
నావసీదితు మర్హంతి ఉద్వహంత స్సతాం ధురం
ధర్మతశ్చైవ గుప్తాస్తే సువీర్యేణచ పాండవాః 8
న నాశ మధిగచ్ఛేయు రితి మే ధీయతే మతిః

తత్ర బుద్ధిం ప్రవక్ష్యామి పాండవాన్ ప్రతి భారత 9
నతు నీతి స్సునీతస్య శక్యతే న్వేషితుం పరైః

యత్తు శక్య మిహాస్మాభి స్తాన్వై సంచింత్య పాండవాన్ 10

నన్వేషింపగాని యాతెఱుంగును గూర్చినమాట సాధువక్తవ్య మైనది. మావంటివారమట్లే పలుకదగును. సభామధ్యమున సర్వథా ధర్మలిప్సగల్గి యథార్థమే పలుకదగును. ఈ పదమూ డగునేడు ధర్మజునివాసమునుగూర్చి యితరజనులట్లు నేను తలంపను. యుధిష్ఠిరుడున్న దేశమందలి రాజులకు-ఆ పురమందు, జనపదమందు, హాని కలుగదు. (న సాంప్రతం) దానశీలుడు వదాన్యుడు, నిభృతుడు, హ్రీనిషేవకుడుగా నచ్చట ప్రతి జనుడు నుండును, ప్రియవాది, సదాదాంతుడు. సత్యపరుడు, హృష్టుడు, పుష్టిగలవాడు, శుచి, దక్షుడు నగు ప్రజ లచ్చట నుండెదరు,

బుద్ధ్యా ప్రయుక్తం న ద్రోహాత్ ప్రవక్ష్యామి నిబోధతత్
న త్వియం మాదృశై ర్నీతి స్తస్య వాచ్యా కదాచన ౧౧
సాత్వియం సాధువక్తవ్యా న త్వ నీతిః కథంచన
వృద్ధానుశాసనే తాత తిష్ఠతా సత్యశీలినా ౧౨
అవశ్యం త్విహ ధీరేణ సభామధ్యే వివక్షతా
యథార్థ మిహ వక్తవ్యం సర్వదా ధర్మలిప్సయా ౧౩
తత్ర నాహం తథా మన్యే తథాఽ య మితరో జనః
నివాసం ధర్మరాజస్య వర్షే ఽ స్మిన్ వై త్రయోదశే ౧౪
తత్ర తాత న తేషాం హి రాజ్ఞాం భావ్య మసాంప్రతం
పురే జనపదే చాపి యత్ర రాజా యుధిష్ఠిరః ౧౫
దానశీలో వదాన్యశ్చ నిభృతో హ్రీనిషేవకః
జనో జనపదే భావ్యో యత్ర రాజా యుధిష్ఠిరః ౧౬
ప్రియవాదీ సదా దాంతో భావ్య స్సత్యపరో జనః
హృష్టః పుష్ట శ్శుచి ర్దక్షో యత్ర రాజా యుధిష్ఠిరః ౧౭

అసూయ, ఈర్ష, అభిమానము, మాత్సర్యము నచ్చట జనులి కుండవు. అచ్చటి జనము స్వాయము ధర్మ మన సరించునదియై యుండును. బ్రహ్మఘోషలు, పూర్ణాహుతులు, భూరి దక్షిణలు గల గొప్పక్రతువులును అచ్చట జరుగగలవు. పర్జన్యుడు సదా సమ్యగ్వర్షిగా నుండగలడు. సంపన్న సస్యమై నిరాతంకమై మహియుండును. ధాన్యములు ఫలవంతమై యుండును. ఫలములు రసవంతమై యుండును, మాల్యములు గంధవంతమై యుండును. భారతి శుభశబ్దమై యుండును, సుఖస్పర్శమగు వాయువచ్చట నుండును. అచ్చట జనులాస్తికు లుగా నుందురు. (నిష్ప్రతీపంచ దర్శనం) మఱి యు నచ్చోట భయము దరిజేరదు. గోవులు పుష్టి పాడి గల్గి

నా సూయకో న చా పీర్షు ర్నాభిమానీ న మత్సరీ
భవిష్యతి జన స్తత్ర స్వయం ధర్మ మనువ్రతః ౧౭

బ్రహ్మఘోషాశ్చ భూయాంసః పూర్ణాహుత్యస్త థైవచ
క్రతవశ్చ భవిష్యంతి భూయాంసో భూరిదక్షిణాః ౧౮

సదాచ తత్ర పర్జన్య స్సమ్యగ్వర్షీ న సంశయః
సంపన్న సస్యాచ మహీ నిరాతంకా భవిష్యతి ౨౦

ఫలవంతిచ ధాన్యాని రసవంతి ఫలానిచ
గంధవంతిచ మాల్యాని శుభశబ్దాచ భారతీ ౨౧

వాయుశ్చ సుఖసంస్పర్శో నిష్ప్రతీపంచ దర్శనం
భయం నాభ్యావిశేత్తత్ర యత్ర రాజా యుధిష్ఠిరః ౨౨

గావశ్చ బహుళా స్తత్ర న కృశా నచ దుర్బలాః
పయాంసి దధి సర్పీంషి రసవంతి హితానిచ ౨౩

బహుళముగానుండును. పాలు, పెరుగు, నెయ్యి, రసవంత ములుగను, హితకరములుగను నుండును. పేయములు గుణ వంతముగను, భోజ్యములు రసవంతముగను నుండును. రసములు, స్పర్శములు, గంధములు, శబ్దములు గుణాన్వితమై యుండును. ప్రసన్నదృశ్యము లచ్చట నుండును. ద్విజాతులు ధర్మమును సేవించెదరు. అన్నివర్ణములవారు స్వస్వగుణసంయుక్తులై యుండెదరు. పాండవుడున్న దేశమున జనుడు సంప్రీతుడు, సంతుష్టుడు, శుచి, అవ్యయుడు నగును. దేవతాతిథిపూజయందు సర్వభావానురాగము గలవాడు, ఇష్టదానుడు, మహోత్సా హుడు, స్వస్వధర్మపరాయణుడు, అశుభద్వేషుడు శుభప్రేప్సు డునై జను డుండును. త్యక్తవాక్యానృతుడు శుభకళ్యాణ మంగళుడు, శుభార్థేప్సుడు, శుభమతి, (ఇష్టవ్రతప్రియుడునై నిత్యము జనముండును, జనులుండెదరు. ధర్మాత్ములగు ద్విజా

గుణవంతిచ పేయాని భోజ్యాని రసవంతిచ
తత్ర దేశే భవిష్యంతి యత్ర రాజా యుధిష్ఠిరః ౨౪
రసాః స్పర్శాశ్చ గంధాశ్చ శబ్దాశ్చాపి గుణాన్వితాః
దృశ్యానిచ ప్రసన్నాని యత్ర రాజా యుధిష్ఠిరః ౨౫
ధర్మాశ్చ తత్ర సర్వైస్తు సేవితాశ్చ ద్విజాతిభిః
స్వైస్వైర్గుణైశ్చ సంయుక్తా అస్మిన్వర్షే త్రయోదశే ౨౬
దేశే తస్మిన్ భవిష్యంతి తాత పాండవసంయుతే
సంప్రీతిమాన్ జనస్తత్ర సంతుష్టశ్శుచి రవ్యయః ౨౭
దేవతాతిథిపూజాసు సర్వభావానురాగవాన్
ఇష్టదానో మహోత్సాహ స్స్వస్వ ధర్మపరాయణః ౨౮

తులవలన గూడ పాండవు లెఱుకపడరు. ఇంక ప్రాకృతులెల్లె ఱుంగ నగును. సత్యము, ధృతి, దానము, శాంతి, క్షేమము హ్రీ, శ్రీ, కీర్తి, తేజము, ఆనృశంస్యము, ఆర్జవము నున్నచోట ధర్మజుని నివాసమని, అచ్చట ఛన్నముగా నాత డున్నాడని యెఱుంగదగును. ఇంతకన్న నింక పలుకజాలను. దీనినంతయు చింతించి యేమిగావించిన హితమని తలంతువో యది నా మాట యందు శ్రద్ధగల్గియుండినచో గావింపుము అని పలికెను. అపుడు కృపు డిట్లు పలికెను. 'పాండవులు సత్రప్రవిష్టులై గూఢభావమున

---

అశుభద్విట్ శుభ ప్రేప్సు ర్నిత్యయజ్ఞ శ్శుభవ్రతః
భవిష్యతి జన స్తత్ర యత్ర రాజా యుధిష్ఠిరః ౨౯
త్యక్త వాక్యా నృత స్తాత శుభకల్యానమంగళః
శుభార్థేప్సు శ్శుభమతి ర్యత్ర రాజాయుధిష్ఠిరః ౩౦
భవిష్యతి జన స్తత్ర నిత్యం చేష్టప్రియవ్రతః
ధర్మాత్మా శక్యతే జ్ఞాతుం నాపి తాత ద్విజాతిభిః ౩౧
కిం పునః ప్రాకృతై స్తాత పార్థో విజ్ఞాయతే క్వచిత్
యస్మిన్ సత్యం ధృతి ర్దానం పరా శాంతి ర్ధ్రువా క్షమా ౩౨
హ్రీః శ్రీః కీర్తిః పరం తేజ ఆనృశంస్య మథా ఽర్జవం
తస్మా త్తత్ర నివాసంతు ఛన్నం యత్నేన ధీమతః ౩౩
గతించ పరమాం తత్ర నోత్సహే వక్తు మన్యథా
ఏవ మేతత్తు సంచింత్య యత్కృత్యం మన్యసేహితమ్ ౩౪
తత్ క్షిప్రం కురు కౌరవ్య యద్యేవం శ్రద్ధధాసి మే
కృపః
తస్మా త్సత్రం ప్రవిష్టేషు పాండవేషు మహాత్మసు
గూఢభావేషు ఛన్నేషు కాలే చోదయ మాగతే ౨౮-౫

మున్నపుడే యీకాలోదయమున స్వరాష్ట్ర పరరాష్ట్రములందు
జనబలమును గుర్తెఱుగవగును. నివృత్తసమయులగు
పాండవులు మహోత్సాహులు కాగలరు ఉచ్చావచబలమును,
మధ్యస్థమగు దాని నెఱిఁగి ప్రహృష్టమో యప్రహృష్టమో
యిట్లు పరుల నెదుర్కొనవచ్చును. సామాద్యుపాయముల
బహుప్రకారముల ప్రయత్నము లిపుడే సాగించి
కోశబలసంవృద్ధిసిద్ధి నొందగలవు బలవద్విరోధులైన నపు డెది
రింపగలవు. బలవాహనహీనులగు వారైనట్టి పాండవుల నెది
రింప గలవు, దీనినంతయు నిశ్చయించి ప్రవర్తించుచో చిరసుఖ
మొందగలవాడవగుదువు' అని పలికెను. ఆ ప్రాప్తకాలమున
సుశర్మ త్వరితుడై 'మత్స్యసాల్వులచే నేను బంధువులతోకూడ
బాధింపబడియున్నవాడను. కీచకునివలన నిది మరల మరల

---

స్వరాష్ట్రే పరరాష్ట్రేచ జ్ఞాతవ్యం బల మాత్మనః
ఉదయః పాండవానాంచ ప్రాప్తే కాలే న సంశయః ౭
నివృత్తసమయాః పార్థా మహోత్సాహో మహాబలాః
మహోత్సాహా భవిష్యంతి పాండవా హ్యమితౌజసః ౮

ఉచ్చావచం బలం జ్ఞాత్వా మధ్యస్థం చాపి భారత
ప్రహృష్ట మప్రహృష్టంచ సందధామ స్తథాపరైః ౧౦

సుకోశబలసంవృద్ధ స్సమ్యక్సిద్ధి మవాపస్స్యసి ౧౨
యోత్స్యసే చాపి బలిభి రరిభిః ప్రత్యుపస్థితైః
అన్యై స్త్వం పాండవై ర్వాపి హీనైశ్చ బలవాహనైః ౧౩

జరిగినది' అని పలికి మఱియు నిట్లనెను. 'మత్స్యరాజుచే నా రా
ష్ట్రము బాధింపబడినది, పూర్వము బలవంతుడు కీచకు డక్క
డుండెను. ఆ దుష్టాత్ముడు, భువి ప్రఖ్యాతవిక్రము డిప్పుడు
గంధర్వులచే నిహతుడైనాడు. అందువలన విరటుడు హత
దర్పుడై నిరుత్సాహు డగునని నా యభిప్రాయము. బహు
ధాన్య సమాకులమగు నా రాష్ట్రముపై దండెత్తుట తగిన కార్య
మిప్పుడు. కౌరవులకు. కర్ణున కిది సమ్మతమగుచో నట్లొనర్చుట
కర్తవ్యము. రత్నములు, వసువులు, గ్రామములు, రాష్ట్రములు,
గోవులు, పురము నరికట్టి తెచ్చుకొందము. సంవిభాగమున
వెడలి విరాటుని పౌరుషము నరికట్టుట దగును, న్యాయముగా

సుశర్మా :—

అసకృన్మత్స్యరాజ్ఞా మే రాష్ట్రం బాధిత మోజసా
ప్రణేతా కీచక స్తస్య బలవా నభవ త్పురా   ౩౦ ౪

తస్మిన్ వినిహతే రాజా హతదర్పో నిరాశ్రయః
భవిష్యతి నిరుత్సాహో విరాట ఇతి మే మతిః   ౬

.... .... .... .... ... ....

రాష్ట్రం తస్యాభియాస్యామో బహుధాన్య సమాకులమ్   ౭
ఆదదామో౽స్య రత్నాని వివిధాని వసూనిచ
గ్రామాన్ రాష్ట్రాణి వా తస్య హరిష్యామో విభాగశః   ౮
అథవా గోసహస్రాణి శుభానిచ బహూనిచ
వివిధాని హరిష్యామః ప్రతిపీడ్య పురం బలాత్   ౧౦

.... .... .... .... ....

నతని వశ్యముగావించికొని మనము సుఖముందము సీ కిది బల
వృద్ధియు నగును. నిస్సంశయము.' 'ఆ మాట విని కర్ణుడు
దుర్యోధనునితో నిట్లనెను.' సుశర్మ చెప్పిన దిపుడు తగియున్నది.
మన కది హితమైనది. అందువలన సేనలను విభాగించికొని నీవు
తలంచినటుల వేగము వెడలుదుము. ప్రాజ్ఞుడు కురువృద్ధుడు
మనకందఱకు పితామహుడు భీష్ముడు, ఆచార్యులగు ద్రోణుడు.
కృపుడు-వీరలు తలంచినప్రకారము యాత్ర విధింపబడుగాక,
ఆలోచించి వేగముగా సాధనార్థము బయలువెడలుదము
హీనార్థబలపౌరుషముగల పాండవులతో మన కేమి గానున్నది.
వారత్యంతము ప్రనష్టమై యుందురు, యమక్షయమునకైన

సంవిభాగేన కృత్వాతు నిబధ్నిమో ఽ స్య పౌరుషం
హత్వాచాస్య చమూం కృత్స్నాం వశ మే
వానయామహే ౧౨
తం వశే న్యాయతః కృత్వా సుఖం వత్స్యామహే వయం
భవతో బలవృద్ధిశ్చ భ వ్యతి న సంశయః ౧౩
తచ్ఛ్రుత్వా వచనం తస్య కర్ణో రాజాన మబ్రవీత్
సూక్తం సుశర్మణా వాక్యం ప్రాప్తకాలం హితంచ నః ౧౪
తస్మాత్ క్షిప్రం వినిర్యామో యోజయిత్వా వరూథినీం
విభజ్య చా ప్యనీకాని యథా వా మన్యసేనఘ ౧౫
ప్రాజ్ఞో వా కురువృద్ధో ఽ యం సర్వేషాం నః పితామహః
ఆచార్యశ్చ యథా ద్రోణః కృప శ్శారద్వత స్తథా ౧౬
మన్యంతే తే యథా సర్వే తథా యాత్రా విధీయతాం
సంమంత్ర్య చాశు నిర్యామః సాధనార్థం మహీపతే ౧౭

పోయియుందురు. రాజా ! నిరుద్విగ్నులమై మనము విరాటనగ
రమునకు వెడలుదము. వాని గోవులను, వివిధములగు వస్తువు
లను గైకొందము' అని పలికెను. దుర్యోధనుడు కర్ణుని మాట
పాటించి శాసనమందు నిత్యసంయుక్తుడగు దుశ్శాసనునితో
వెంబడి నిట్లు పలికెను 'వృద్ధులతో సంప్రదించి మనమొకవైపు,
సుశర్మ యొకవైపు వెడలుదము. సుశర్మ వెళ్ళిన మఱునాడు
మనము పోవుదము, ఇట్లు ద్విధా యేర్పడి మనము విరాటుని

కించనః పాండవైః కార్యం హీనార్థబల పౌరుషైః
అత్యంతం వా ప్రనష్టాస్తే ప్రాప్తావాపి యమక్షయమ్ ౧౮
యామో రాజన్నిరుద్విగ్నా విరాటనగరం వయం
ఆదాస్యామోహి గాస్తస్య వివిధాని వసూనిచ ౧౯
తతో దుర్యోధనో రాజా వాక్యమాదాయ తస్య తత్
వైకర్తనస్య కర్ణస్య క్షిప్రమాజ్ఞాపయత్స్వయమ్ ౩౦-౨౦
శాసనే నిత్యసంయుక్తం దుశ్శాసన మనంతరం
సహ వృద్ధైస్తు సంమంత్ర్య క్షిప్రం యోజయ వాహినీమ్ ౨౧
యథోద్దేశేచ గచ్ఛామః సహితాస్తత్ర కౌరవైః
సుశర్మాచ యథోద్దిష్టం దేశం యాతు మహారథః ౨౨
త్రిగర్తైస్సహితో రాజా సమగ్రబలవాహనః
ప్రాగేవహి సుసంవీతో మత్స్యస్య విషయం ప్రతి ౨౩
జఘన్యతో వయం తత్ర యాస్యామో దివసాంతరే
విషయం మత్స్యరాజస్య సుసమృద్ధం సుసంహతాః ౨౪
తే యాంతు సహితాస్తత్ర విరాటనగరం ప్రతి
క్షిప్రం గోపాన్ సమాసాద్య గృహ్ణంతు విపులం ధనమ్ ౨౫

ధనములను-గోవులను బట్టుదము' అని పలికెను. ఒకానొక సప్తమి నాడు సుశర్మ గోవులను దక్షిణదిక్కున బట్టుటకు, మఱునా డష్టమినాడు కౌరవు లుత్తరదిక్కున గోవులనుపట్టుటకు తిథులు వారు నిర్ణయించిరి.

ఆకాలమున బలవద్వరిష్ఠులు పెక్కుమంది భూలోకమున నున్నందున పాండవులే కీచకులను సంహరించిరని నిర్ధారణగా నూహించుటకు రానేరదు. ఘోషయాత్రయందు గంధర్వుల పరాక్రమమును చవిచూచిన కౌరవులకు గంధర్వులచేత కీచకుడు మడసినాడను ప్రచారము వినదగినదై యున్నది. సైరంధ్రి

గవాం శతసహస్రాణి శ్రీమంతి గుణవంతి చ
వయ మప్యనుగృహ్ణీమో ద్విధా కృత్వా వసూధినీమ్ ౨౬
తేస్మ గత్వా యథోద్దిష్టాం దిశం వహ్నే ర్మహీపతే
సన్నద్ధా రథిన స్సర్వే సపదాతా బలోత్కటాః ౨౭
ప్రతివైరం చికీర్షంతో గోషు గృద్ధా మహాబలాః
ఆదాతుం గాః సుశర్మా ఽథ కృష్ణపక్షస్య సప్తమీమ్ ౨౮
అపరే దివసే సర్వే రాజన్ సంభూయ కౌరవాః
అష్టమ్యాంతే న్యగృహ్ణంత గోకులాని సహస్రశః ౨౯

ధర్మప్రభునివలన పంచభూతము లెట్లు ప్రశాంతిగా నుండ గలవో. వానిఫలితము, ధర్మబుద్ధి, పశుధాన్య సంపదభివృద్ధి-తత్ప్రదేశమున నుండగలదని భీష్ముడు బహుదూరము ప్రపంచించి యున్నాడు. వనవాసాజ్ఞాతవాసవ్రతదీక్షాంత మొందనున్న ధర్మజునందలి విశిష్టత నంతయు నిది వివరించుచున్నది.

గంధర్వులు తనపతులని పలుకుట [*] యీ ప్రచారము దుర్యోధనునియం దిట్టితలంపును గల్గించినది. సౌందర్యవిషయముగా నీమాట విరాటనగరమందు బనిచేయుచున్నది పరిస్థితి యిట్టిదై యుండగా పాండవులజాడ గనుగొనుటకై ప్రవర్తించిన కౌరవ మంత్రాంగము వక్రమార్గమును పట్టినది. కర్ణుడు దుశ్శాసనుడు పలికినదివిని ద్రోణుడు, భీష్ముడు, కృపుడు కార్యగతిని బురస్కరించుకొని పలికిరి. సుశర్మవచనమున నంతయు దాఱుమాఱయి నది. కర్ణుడు దుర్యోధనుడు కార్యవచనముల నాదరింపక వమ్ము గావించిరి.

తత్ర తాత న తేషాంహి రాజ్ఞాం భావ్య మసాంప్రతం
పురే జనపదే చాపి యత్ర రాజా యుధిష్ఠిరః ౨౮-౧౫

ధర్మజుడున్న దేశప్రభువునకు హానికలుగబోదని భీష్ముడు తన ప్రసంగ మారంభించినాడు. కౌరవు లీమాట వినినవారే కాని పాటించువారు కాజాలక పోయిరి భీష్మవచనవిశేషము నిట్లుగా వ్యాసుడు రచించినాడు.

యుధిష్ఠిరే సమాసక్తాం ధర్మజ్ఞే ధర్మసంవృతాం
అసత్సు దుర్లభాం నిత్యం సతాం చాభిమతాం సదా ౨౮-౩
భీష్మ స్సమవదత్తత్ర గిరం సాధుభి రర్చితామ్ ౪

---

ద్విజాతిభిః ప్రాకృతైః [౨౮-౨౧] అని పలికి భీష్ముడు పాండవులఘనతను వ్యక్తీకరించినాడు, దానికి జవాబుగా రోష స్వరూపుడగు కర్ణుడు 'హీనార్థ బల పౌరుషైః' [౩౦-౧౮] అని పలికి పాండవుల విషయమై అలక్ష్యమును దేల్చినాడు.

[*] భీముడే కీచకులను సంహరించినాడని దుర్యోధనుడూహించి నట్లు కొన్ని భారతప్రతులందు గలదు. అది సరికాదు. అది ప్రక్షిప్తమే.

(ధర్మజుడగు యుధిష్ఠిరునందు సమాసక్తమైనదియు, ధర్మజ్ఞులందు ధర్మసంవృతమైనదియు, అసత్పురుషులందు దుర్లభమైనదియు, సదా సత్పురుషుల కభిమతమైనదియు నగు సాధువులచే నర్చింపబడు మాట నపుడు భీష్ముడు వచించెను.)

యుధిష్ఠిరుడు ధర్మసంవృతుడు కావుననే భీష్మప్రసంగమంతయు యుధిష్ఠిరునందుసమాసక్త మగుచు ధర్మజ్ఞులందు ధర్మసంవృతమున నొప్పినది. సదా సత్పురుషుల కభిమతమగు ప్రసంగము భీష్ముడు గావింపగా నసత్పురుషులగు కౌరవులు దానిభావమును గుర్తింపజాలకపోయిరి, సద్భావము సత్ప్రవృత్తి లేని కౌరవులపుడు ధర్మజుడున్న దేశప్రభువుపైననే దండెత్తి వెడల నుద్రేకించిరి.

శుద్ధాత్మా గుణవాన్ పార్థస్సత్యవా న్నీతిమాన్ శుచిః
తేజోరాశి రసంఖ్యేయో గృహ్ణీయా దపి చక్షుసా ౨౭-౯

(శుద్ధాత్ముడు, గుణవంతుడునగు పార్థుడు సత్యవంతుడు నీతిమంతుడు, శుచియైనవాడు, అసంఖ్యతేజోరాశి, చూపు మాత్రముననే సకలము గ్రహింపగలవాడు-అని ద్రోణుడు వచించియున్నాడు.

కౌరవమంత్రాంగములో నిట్టి ప్రసంగము వచ్చునని గుర్తించి యుండిన పాండవులు మొదటనే జాగ్రత్తపడిరి. ధర్మజుడజ్ఞాతవాసనివాసప్రదేశమునుగూర్చి యర్జునునితో నాలోచింపగా నాత డిట్లు పలికెను.

కింతు వాసాయ రాష్ట్రాణి కీర్తయిష్యామి కానిచిత్
రమణీయాని గుప్తాని తేషాం కించిత్స్మ రోచయ ౧-౧౧

సంతి రమ్యా జనపదాః బహ్వన్నాః పరితః కురూన్
పాంచాలా శ్చేది మత్స్యాశ్చ శూరసేనాః పటచ్చరాః ౧౨
దశార్ణా నవరాష్ట్రాశ్చ మల్లా స్సాల్వాయుగంధరాః
కుంతీరాష్ట్రంచ విపులం సురాష్ట్రావంతయ స్తథా ౧౩

ఆ కాలములో ధన ధాన్య పశుసమృద్ధి గల్గి సుభిక్షముగా నుండినదేశములు కురుపరిసరమందు పదమూడు గలవు. భీష్ముడు నిర్దేశించిన లక్షణము లీ దేశములందు గలవు. కావున కౌరవులిపు డీ పదుమూడుదేశములు వెదుకవలసియున్నది. భీష్ము డింత మాత్రము చెప్పగల్గినాడు. ఈపదుమూడుదేశములందు ధర్మ రాజు విరాటరాజ్యము నెన్నుకొనినాడు. విరాటనగరము శుభ లక్షణములు గలది. విరాటదంపతు లుత్తములు నిదానము గల్గిన వారు. ధర్మజుడు విరాటుని గూర్చి యిట్లు పేర్కొనినాడు.

మత్స్యో విరాటో బలవా నభిరక్తో ౽ థ పాండవాన్
ధర్మశీలో వదాన్యశ్చ వృద్ధశ్చ సతతం ప్రియః ౧-౧౩

(రమణీయంబును, శివప్రదంబును, సౌఖ్యదాయియునైన దేశమున నుండవలయును మత్స్యదేశాధీశుండైన విరాటుండు బలవంతుడు. పాండవులం దభిరక్తుడు, ధర్మశీలుడు, వదాన్యుడు. వృద్ధుడు, సదాప్రియుడు. ఆ విరాటనగరమున మన ముండము- అని ధర్మజుడు పలికెను.)

ధర్మజుడు దేశము యొక్క రక్ష ముందుగా పేర్కొని పిమ్మట తత్పరిపాలకుని యుత్తమత్వమును పేర్కొనినాడు, విరాటుడు పాండవులందభిరక్తుడై యున్నాడు. "అభిరక్తో ౽ థ పాండవాన్' అని ధర్మజుడు పలికినాడు' 'అథ' అను పదము

విచిత్రమైనది. కీచకుల నిరోధము తొలంగిన నాడు ధర్మాత్ముడగు విరాటుడు పాండవులందభిరక్తిని బ్రకటింపగలడని యిది విచిత్రముగా సమర్థించుచున్నది. ఇందు పాండవులమైన మనయందు విరాటుడభిరక్తుడని పలుకక పాండవులందభిరక్తుడని ధర్మజుడు వచించుట గమనింపదగినది. విరాటుని యుచితప్రవృత్తిని-దర్మచింత నిది సమర్థించుచున్నది. పాండవులందే సదా యభిరక్తుడై విరాటుడుండునని యిది నిర్ధారించుచున్నది. ధర్మశీలుడు. వదాన్యుడు, వృద్ధుడు, ప్రియుడు (సతతంప్రియః) అనునవి విరాటునింట నజ్ఞాతవాసమొనర్చుటయందలి సకలార్హతలను వ్యక్తీకరించుచున్నవి

విరాటస్యతు కైకేయీ భార్యా పరమసమ్మతా
ఆలోకయంతీ దదృశే ప్రాసాదా ద్ద్రుపదాత్మజామ్ ౮-౭

ఈ పుణ్యదంపతులకు బనులుగావించుచు బాండవు లజ్ఞాతవాసము గావించిరి. కీచకోపకీచకుల సంరంభము గల్గిన దాదేశమగుటచే తనయం దల్పమతిని వర్తించుచువానిని బరోక్షముగా దనభర్తలచే దుదముట్టించు కట్టడిని యేర్పఱచుకొని ద్రౌపది విరాటు నంతఃపురమున వర్తింపజొచ్చినది. కీచకుడట్లే ద్రౌపదిని బాధింపజొచ్చినాడు. వానిని వధింపవలసినదని ద్రౌపది భీమునితో దెల్పగా బంధువులతోగూడ కీచకుని దుదముట్టింతునని యాతడు పలికినాడు. కీచకుని వధించినపిమ్మట వాని తమ్ములు కీచకులు కీచకశవముతోడ సైరంధ్రిని సహదాహ మొనర్పనిశ్చయించి విరాటుననుమతిని గోరిరి.

పరాక్రమంతు సూతానాం మత్వా రాజా ఽ న్వమోదత
సైరంధ్ర్యా స్సూతపుత్రేణ సహదాహం విశాంపతిః ౨౩-౮

కీచకుల పరాక్రమమును దలంచి విరాటుడు కీచకునితో సైరంధ్రిని సహదాహ మొనరించుట కంగీకరించెను. (అన్వమోదత)

కీచకు లున్నంతవరకు విరాటు డిట్టి అసహాయపరిస్థితి యందుండెను. కీచకుడు ద్రౌపదితో నిట్లు పలికియున్నాడు.

ప్రవాదే నేహ మత్స్యానాం రాజా నామ్నాఽయ ముచ్యతే
అహ మేవహి మత్స్యానాం రాజా వై వాహినీపతిః ౨౨-౮

విరాటుడు పేరునకుమాత్రమే రాజు కీచకుడే రాజనుగ వర్తించువాడై యుండెను. పాండవులు విరాటు నిట్టి సంకటము నుండి యుద్ధరించిరి. ధనధాన్య బలసంశోభితమైన విరాటరాజ్యమందు కౌరవులకు కన్నుగల్గినది పాండవులు ముందుగనే యిది తేల్చి విరాటుని తమ పక్షమున నిల్పుకొనువారైరి. అజ్ఞాతవాసము తీర్చుట, విరాటుని దమయందు వర్తింప జేసికొనుట యను రెండుద్దేశముల నిట్లు పాండవులు సాధించుకొనిరి. కౌరవులు చెడుబుద్ధి గల్గి విరాటునిపై దండెత్త నిశ్చయించిరి. యుద్ధయాత్ర నిర్ణయించినది సుశర్మ. దానికి సమ్మతించినవాడు కర్ణుడు. పాండవులు విరాటనగరమందే యుందురను నిర్ణయము కానందున భీష్మాదు లాదండయాత్రను వలదని చెప్పజాలకపోయిరి. విరాటు నరికట్టుట నీకు బలసమృద్ధి యని సుశర్మ పలికినమాట కౌరవుల కత్యాశను కల్గించినది.

తత స్తేషాం మహారాజా తత్రైవామితతేజసాం
ఛద్మలింగప్రవిష్టానాం పాండవానాం మహాత్మనామ్ ౩౧-౧
వ్యతీతసమయ స్సమ్యక్ వసతాంవై పురోత్తమే
కుర్వతాం తస్య కర్మాణి విరాటస్య మహీపతేః ౨

కీచకేతు హతే రాజా విరాటః పరవీరహా
పరాం సంభావనాం చక్రే కుంతీపుత్రేషు వీర్యవాన్ ౩
తత స్త్రయోదశస్యాంతే తస్య వర్షస్య భారత
సుశర్మణా గృహీతం తద్గోధనం తరసా బహు ౪

ఛద్మలింగప్రవిష్టులగు పాండవులు - అమితతేజస్కులగు మహాత్ములు వ్యతీతసమయులైరి, విరాటునకు బనులు గావించుట పాండవు లజ్ఞాతవాసము ముగించిరి, కీచకుడు హతుడు కాగా పరవీరహంతయగు విరాటుడు కుంతీపుత్రులందు పరమమైన సంభావనము గావించెను. ఇట్లుకాగా సుశర్మ యా పదమూడవవత్సరాంతమున విరాటుని గోవులను హరించెను.

పాండవు లక్కడే యున్నారని విరాటు డెఱుంగడు, ధర్మాత్ములు, సార్వభౌములునగు పాండవులందు విరాటుప కభిప్రాయ మేర్పడినది. పాండవుల విరాటనగరనివాస మొక విషయము, విరాటుడు పాండవులందు సంభావనాతత్పరుడగుట మఱొక్క విషయము - పాండవుల కిట్లు రెండువిధములగు సంబంధములు విరాటునం దేర్పడియుండగా వినాశాలోచన మేర్పఱచిన సుశర్మ ముందుగా దానే విరాటుని గోవులను బట్టుకొనెను,

ప్రథమం తైర్గృహీతవ్యం మత్స్యానాం గోధనం మహత్
సప్తమ్యా మపరాహ్ణేవై తథా నస్తైః సమాహితమ్ ౪౭-౧౧
అష్టమ్యాం పున రస్మాభి రాదిత్య స్యోదయం ప్రతి
ఇమా గావో గృహీతవ్యా గతే మత్స్యే గవాం పదమ్ ౧౨

కీచకునివధించిన గంధర్వునితలంపు, పాండవులతలంపు - ఈ రెండుతలంపులు గల్గినకౌరవులు విరాటునిపురమును ద్విధా సరికట్టి సమకట్టిరి. సుశర్మ ముందురోజున గోవులనుబట్టి పట్టణమునకు దూరముకాగా విరాటుడు ససైన్యుడై సుశర్మతోడ యుద్ధమునకు దూరము పోగలడు. అప్పుడు పట్టణము శూన్యముగా నుండగలదు, గంధర్వుడున్నను, [*] పాండవులున్నను సైన్యములేని వారినెదిరింపవచ్చును. పాండవులే యెదిరింపవచ్చిన సమయభంగ మొందినవారిని మరలనడవులకు బంపవచ్చును, ఇట్లని కార్యనిశ్చయముగావించి సుశర్మ, కౌరవులు విరాటుని దక్షిణోత్తర దిశలందలి గోవులను బట్టవచ్చిరి. గంధర్వుని తలంపు గల్గిన కౌరవులిపుడు భీష్మాదులనుగూడ తీసుకొనివచ్చిరి. బలవాహనహీనులుగ వచ్చువారెవ్వరైన చిక్కుపడగలరని కౌరవుల యాశయము.

గోపుడు పరుగునవచ్చి యోధులు, పాండవులతో గూడి యున్న విరాటునకీవార్తదెల్పెను, సబాంధవముగా మమ్ముల బరాభవించి త్రిగర్తులు లక్షగోవులను గొనిపోవుచున్నారు. రాజేంద్ర! గోవులను రక్షింపుము. (తాన్ పరీప్సస్వ రాజేంద్ర మానేశుః పశవస్తవ ౩౧-౮) అని గోపు డుచితముగాబలికెను. విరాటుని సత్ప్రవర్తనమునిది యెంతయేని పోషించుచు నుచిత పరివారశోభితు డతడని తెల్పుచున్నది. విరాటుడు వెంటనే

[*] య ద్యేష రాజా మత్స్యానాం యది బీభత్సురాగతః
సర్వైర్యోద్ధవ్య మస్మాభి రితి నః సమయః కృతః ౪౭-౧౭

చతురంగసైన్యము నాయిత్తము గావించెను. [*] ఇక్కడ వర్ణన మాయా రథికుల నామములకు, విషయములకు జక్కని పోలికలను గూర్చుచు నందగించుచున్నది, చతురంగసైన్యము నాయిత్తమొనరించి విరాటుడు తన తమ్మునకు శతానీకునితో నిట్లనెను.

కంక వల్లవ గోపాలా దామగ్రంథిశ్చ వీర్యవాన్
యుధ్యేయు రితి మే బుద్ధి ర్వర్తతే నాత్ర సంశయః ౩౦-౨౧
వీరాంగరూపాః పురుషా నాగరాజకరోపమాః
నే మే జాతు న యుధ్యేయు రితి మే ధీయతే మతిః ౨౩
శతానీక స్తు పార్థేభ్యో రథాన్ రాజన్ సమాదిశత్
సహదేవాయ రాజ్ఞేచ భీమాయ నకులాయచ ౨౫

(కంకుడు, వల్లవుడు, గోపాలకుడు, దామగ్రంథి యుద్ధము గావించువారని నా బుద్ధికి దోచుచున్నది, ఇందుకు సంశయము లేదు వారికి రథాదిపరికరముల నీయవలసినది.

---

[*] స వజ్రా యసగర్భంతు కవచం తత్ర కాంచనం
విరాటస్య ప్రియో భ్రాతా శతానీకో ఽ భ్యహారయత్ ౧౧
సర్వపారసవం వర్మ కళ్యాణపటలం దృఢం
శతానీకా దవరజో మదిరాక్షో ఽ భ్యహారయత్ ౧౨
అభేద్యకల్పం మత్స్యానాం రాజా కవచ మాహరత్
ఉత్సేధేయస్య పద్మాని శతం సౌగంధికానిచ ౧౩
సువర్ణపృష్ఠం సూర్యాభం సూర్యదత్తోఽభ్యహారయత్
దృఢమాయసగర్భంచ శ్వేతం వర్మ శతాక్షిమత్ ౧౪
విరాటస్య సుతో జ్యేష్ఠో వీరశ్శంఖోఽభ్యహారయత్ ౧౫

కీ రాం గ రూపముగల్గి నాగరాజు కరోపములగు వీరు యుద్ధము చేయరు అని నాకుదోచలేదు విరాటుని యీ మాట విని శతానీకుడు త్వరితమానసుడై సహదేవుడు, రాజు. భీముడు, నకులుడు వీరికి రథాదుల నొసంగెను )

[*] పాండవుల ప్రవర్తనము, వారి రూపరేఖలు విరాటున కిట్టి యభిప్రాయమును గల్గించినవి, పాండవుల యునికియే విరాటున కింతటి యుత్సాహమును గల్గించినపుడు పాండవ విషయకమగు నుచితభావ మేల విరాటునకు కల్గకుండును. శతానీకుడు వాహనాదుల నిచ్చుటలో సహదేవునకు ముందుగా నిచ్చినట్లు గలదు. గోసంబంధమగు యుద్ధమదిగాన అతనికిముందుగా వాహనాదుల నిచ్చిరని యభిప్రాయము. ఇక్కడ సహదేవుని గూర్చి తంత్రీపాలుడని యుల్లేఖింపబడక-గోపాలా సహదేవాయ అనియుండుట గమనింపదగినది. ఈ యుద్ధమున పాండవులు విరాటుని రక్షించిరను పర్యవసానము గల్గుచున్నది గాన పాండవనామములే యచ్చోట పేర్కొనబడినవి. గోవులను మాత్రమే కాక విరాటుని విడిపించుటయను కార్యమును జగదేక

[*] ఆహరిష్యామి దారూణాం నిచయా న్మహ ౭ తోపిచ
విరా ౨-౩

యత్ ప్రేక్ష్య విపులం కర్మ రాజా సంయోక్ష్య తే సమాం
అమానుషాణి కుర్వాణ స్తాని కర్మాణి భారత ౪

(పెద్ద పెద్దదారువులనుదెచ్చెదను, ఏవిపులమగుకర్మ చూచి రాజు నన్నమానుషకార్యముల గావింపజేయునో యట్లు గావించెదను. అని భీముడు ధర్మరాజుతో పలికియున్నాడు)

సార్వభౌముడు ధర్మరాజు గావించుట యనునదే యిచ్చోట సంభవించినది. కావున ధర్మజుని గూర్చి 'రాజ్ఞేచ' అని చెప్పబడుట మఱియు రసవంతముగా నున్నది. త్వరితమనస్కుడై కార్యాతురత గల శతానీకుడు పాండవులకు వాహనాదుల నొసంగెను. [*] ఎనుబదివేల పదాతులు, వేయిగజములు, అఱువదివేల గుఱ్ఱములుగల విరాటునిసైన్యము యుద్ధమునకు వెడలినది.

సూర్యుడు పరిణతుడగుసరికి విరాటసైన్యము త్రిగర్తులను జేరి యుద్ధమునకు దలపడినది సాయంకాలమగుసరికి యుద్ధము తుములముగను రోమహర్షణముగను జరిగినది. ఆ ఘోరసంగ్రామములో శూరులు శూరులను పరాఙ్ముఖులుగా జేయజాలకుండిరి. యుద్ధభూమి కశ్మలముగను, నిర్మర్యాదగనునైనది త్రిగర్త సైన్యములో ప్రవేశించిన శతానీకుడు నూఱు, విశాలాక్షుడు నాలుగునూఱులు రథికులను సంహరించిరి. అగ్రభాగమున సూర్యదత్తుడు, పృష్ఠభాగమున మదిరాక్షుడు యుద్ధము గావించిరి ఆ గొప్పసంగ్రామములో విరాటు డయిదువందల రథికులను, ఎనిమిదివందల గుఱ్ఱములను, అయిదుగురు మహారథులను సంహరించెను. అపుడు విరాటునకు సుశర్మకు యుద్ధము ప్రారంభమాయెను. అంధకార మల్లుట చేతను. ధూళిచేతను యుద్ధము విరామమొందినది. చంద్రోదయానంతరము మరల ఘోరసంగ్రామ మారంభమైనది. సుశర్మ తన తమ్మునితోగూడ విరాట సైన్యములో ప్రవేశించి విజృంభించెను. విరథుడైన విరాటుని జీవముతో బట్టుటకు సుశర్మ యత్నించెను.

---

[*] అష్టౌ శత సహస్రాని దశనాగ శతానిచ
షష్టిశ్చా శ్వసహస్రాణి మత్స్యానా మభినిర్యయుః ३౧-३४

త మున్మథ్య సుశర్మాథ యువతీ మిగ కాముకః
స్యందనం స్వం సమారోప్య ప్రయయౌ శీఘ్రవాహనః ౩౩-౮

(కాముకుడగువాడు జవరాలినివలె సుశర్మ విరాటు నెత్తికొని రథము నెక్కించుకొని శీఘ్రవాహనుడై వెచ్చెర పోజొచ్చెను.)

విరాటుని సైన్యము చెల్లాచెదరగుచుండెను. యుధిష్ఠిరు దరిందముడగు భీమసేనునితో "సుశర్మచేత విరాటుడు పట్టుబడి నాడు. శత్రువశముగాకుండ నతనిని విడిపింపుము. సర్వకామ ముల చేత పూజితులమగుచు మనమందఱు మతనియొద్ద సుఖ ముంటిమి. భీమసేనా తద్వాసనిష్కృతినిపుడు గావింపుము' అనిపలికెను. భీము డిట్లు పలికెను.

అహమేనం పరిత్రాస్యే శాసనాత్తవ పార్థివ
పశ్య మే సుమహత్కర్మ యుధ్యత స్సహశత్రుభిః ౧౪
స్వబాహుబల మాశ్రిత్య తిష్ఠ త్వం భ్రాతృభి స్సహ
ఏకాంత మాశ్రితో రాజన్ పశ్య మేఽద్యపరాక్రమమ్ ౧౫
సస్కంధో ఽ యం మహావృక్షో గదారూప ఇవస్థితః
అహమేనమహారుజ్య ద్రావయిష్యామి శాత్రవాన్ ౧౬

వైశంపాయనః—

తం మత్త మివ మాతంగం వీక్షమాణం వనస్పతిం
అబ్రవీ ద్భ్రాతరం వీరం ధర్మరాజో యధిష్ఠిరః ౧౭
మా భీమ సాహసం కార్షీ స్తిష్ఠ త్వేవ వనస్పతిః
మా త్వాం వృక్షేణ కర్మాణి కుర్వాణ మతిమానుషమ్ ౧౮
జనా స్సమవబుద్ధ్యేరన్ భీమోఽయ మితి భారత

అన్య దే వాయుధం కించిత్ ప్రతిపద్యస్వ మానుషమ్ ౧౯
చాపంవా యదివా శక్తిం నిస్త్రింశంవా పరశ్వథం
యదేవ మానుషం భీమ భవే దస్య రలక్షితమ్ ౨౦
తదేవాయుధ మాదాయ మోక్షయాశు మహీపతిం
యమౌచ చక్రరక్షా తే భవితారో మహాబలా ౨౧
సహితా స్సమరే తత్ర మత్స్యరాజం పరీప్సత ౨౨

('సింహాసనమున నేను రాజును గాపాడెదను. శత్రువులతో బోరాడు నా మహత్కర్మను దిలకింపుము. తమ్ములతో గూడి స్వబాహుబలమాశ్రయించి నిలువుము. నాపరాక్రమము నిపుడు గాంచుము. సస్కంధమగు నీమహావృక్షము గదవలెనే యున్నది. దీనిని పెకలించి శత్రువులను దరిమెదను.' అని భీముడు పలికెను. మదించిన యేనుగువలెనే చెట్టును జూచుచున్న తమ్మునితో ధర్మరాజు యుధిష్ఠిరు డిట్లనెను. భీమ ! సాహసము వలదు. ఆ చెట్టు ఉండనిమ్ము వృక్షముమ గొని యతిమానుషకృత్యమునకు గడంగినచో జనులు భీముడని కనుగొందురు. మానుషసంబంధ మగు నాయుధము చాపమో, శక్తియో. నిస్త్రింశమో, పరశువో ఓభీమ ! ఇతరుల కెఱుకపడకుండునట్లు మానుషాయుధ మునేకొని వేగముగా మహీపతిని విడిపింపుము. మహాబలులు యములు (నకుల సహదేవులు) చక్రరక్షకులు కాగా మత్స్య రాజును విడిపింపుము - అని ధర్మజుడు పలికెను )

విరాటనగరములో సంకటపరిస్థితియందు జెట్టు వైపు భీముడు గనుకొనుట యిది రెండవపట్టు. కీచకుడు ద్రౌపదిని

బరాభవించినప్పుడు భీముడు వృక్షమును దిలకించినాడు ఆసంద
ర్భముతో నిట్లుగలదు.

హ స్తేన మమృదే చైవ లలాటం పరవీరహా
భూయశ్చ త్వరితః క్రుద్ధ స్సహసోత్థాతు మైచ్ఛత  ౧౬-౧౭
అథా వమృద్నా దంగుష్ఠేన యుధిష్ఠిరః
ప్రబోధన భయా ద్రాజా భీమం తం ప్రత్యషేధయత్  ౧౮
తం మ త్త మివ మాతంగం వీక్షమాణం వనస్పతిం
సత మావారయామాస భీమసేనం యుధిష్ఠిరః  ౧౯

ఆలోకయసి కిం వృక్షం సూద దారుకృతేరవై
యది తే దారుభిః కృత్యం బహిర్వృక్షా న్నిగృహ్యతామ్ ౨౦

శత్రుహంతయగు భీముడు నొసటిచెమటను చేతితో
దుడిచికొని, మిగుల త్వరగల్గి క్రుద్ధుడై తటాలున నెగురుట కిచ్ఛ
యించెను. యుధిష్ఠిరు డంగుష్ఠము నంగుష్టముతో గీచి తెలియ
బఱుదుమను భీతిని భీముని నివారించినాడు. మదించిన యేనుగు
వలెనే చెట్టును దిలకించుచున్న భీమసేనుని యుధిష్ఠిరుడు నివర్తించు
వానిగా జేసినాడు. "చెట్టును జూచుచుంటివేల" సూదుడా!
దారువులతోడ కృత్యమున్నచో బైనున్న వృక్షములను బెక
లింపుము, అని ధర్మరాజు పలికినాడు.

పై రెండుసందర్భములను పరికించిన నందు గొప్పయద్భు
తము ద్యోత్యము కాగలదు. ఈ రెండుసందర్భములందును భీము
డుగ్రుడై వృక్షమును దిలకించినాడు. "ఈ చెట్టుతో శత్రువులను
బాఱదోలెదను" అని మాటపలుకునంత యించుక సావకాశ మీ
రెండవపర్యాయము భీముని విషయమైగలదు. (కల్పింపబడినది)

కీచకుడు ద్రౌపదిని పరాభవించినపుడు భీమసంరంభమందు సావకాశమేమియు లేదు, తటాలున నెగిరిపోవనెంచినాడు కీచక సంరంభ సందర్భముగ ధర్మజు డుగ్రుడగు భీముని వారించుటలో చప్పున రెండు ప్రయత్నములు గావింపవలసివచ్చినది. అంగుష్ఠమును ముందుగా రాసినాడు. మాటపలుకుటకు తడవులేదు, భీముని వేగిరపా టంతటి తీవ్రపరిస్థితి నుండునది. అందువలన ధర్మజుడు మొదట కృత్యమునే యాచరించినాడు, ఆ పిమ్మట మాట పలికినాడు. భీముడు విరాటునీ విడిపించు నీ రెండవ సందర్భమందు ధర్మరాజు మాటపలుకుటమాత్రమే కావించినాడు, ఇది పరిస్థితిలోని తేడాను వ్యక్తీకరించుచున్నది.

"ప్రబోధన భయా ద్రాజా" అని మొదటివిషయమందు గలదు. అజ్ఞాతవాసభయమున ధర్మజు డప్పు డట్లు పలికినాడని అభిప్రాయము. ఈ రెండవవిషయ మట్టిదిగాదు, అజ్ఞాతవాసభయ మనుమాట స్ఫురింపకుండునట్లుగా నిచ్చోటనుండుట గమనింప దగినది. "జనా స్సమవ బుద్ధ్యేరన్ భీమోఽయ మితిభారత" (జనులు భీముడని తెలిసికొందురు.) అను ప్రయోజనాంతరమగు భావమున ధర్మజు డీమాటలు పలికినాడు

"సత మావారయామాస భీమసేనం యుధిష్ఠిరః" అని కీచక సంరంభమున గలదు.

"అబ్రవీ ద్భ్రాతరం వీరం ధర్మరాజో యుధిష్ఠిరః" అని సుశర్మ సంరంభమున గలదు.

వంటవానిని బలుకరించినట్లు మొదటిమారు, తమ్మని బలుకరించినట్లు రెండవమారు చెప్పబడుట సాభిప్రాయముగా నున్నది.

ఆలోకయసి కిం వృక్షం సూద దారుకృతేనవై - అని కీచక సంరంభమున గలదు. మా భీమ సాహసం కార్షీ స్త్వ ద్వేష వనస్పతిః-అని సుశర్మసంరంభమునఁ గలదు. మొదటిదానిలో భీముని 'సూద' అని ధర్మజుడు సంబోధించినట్లు గలదు; రెండవ దానిలో "భీమ" అని సంబోధించినట్లు గలదు. భీమ, భీమోఽయం, భీమ యమౌ (నకులసహదేవులు) అను పదములను ధర్మజు డీసందర్భములో బహిరంగముగ నుచ్చరించుట పరిస్థితియందలి తేడాను-అజ్ఞాతవాసము, అజ్ఞాతవాసముఁగడచుట యను తేడాను చక్కగా నిరూపించుచున్నది.

సుశర్మ గోవులనుబట్టినరోజు అజ్ఞాతవాసవత్సరము యొక్క తుదిదినమై యున్నది. అది కృష్ణపక్షముఁసప్తమి. ఆ రోజున చంద్రోదయము పదునాల్గు ఘడియలరాత్రి కగును. చీకటియందు నిలిచిపోయిన యుద్ధము మరలనపుడు విజృంభించెను. అప్పుడు విరాటుడు యుద్ధములో బట్టుబడెను. [*] రాత్రిభాగములో రెండువంతులభాగ మప్పటికి దాటినది. చివరభాగ మపుడు వచ్చినందున (అజ్ఞాతవాసకాలము తీరినందున) పాండవులపుడు విజృంభించిరి. ఇది విషయముఁగావున ధర్మజుడు "భీమ" అని సంబోధింపగల్గినాడు, యములు (నకుల సహదేవులు) చక్రరక్షకు

---

[*] రాత్రికాలము మూడువంతులు వేయగా రెండు వంతులకాల మారోజుక్రింద లెక్క కువచ్చును, మూడవవంతు కాలము మఱునాటిక్రింద లెక్కకువచ్చును. అందువలన నజ్ఞాత వాసకాల మప్పటికి దాటిపోయినది. పాండవులపుడు యుద్ధ మున విజృంభించి విరాటుని విడిపించిరి.

లగునని యు సూచింపగల్గినాడు. సుశర్మ యీ సమయమున కోటమిలోబడినాడు. శృంగభంగమైనది. విరాటుడు పట్టుపడిన సందర్భముగాన రాజులేని విరాటసైన్యము చెల్లాచెదరైనది. ఈ గందరగోళములో కంకుడు వల్లవునితో నేమనునది యెవ్వరికి పట్టుదలగలదు (గురికాదు) ధర్మజుని యీచమత్కారవాక్యములచే నీ ఘట్టమున కొక యపూర్వఘనత యేర్పడినది. అర్జునుడు. ద్రౌపది విరాటనగరమున నుండినందున ధర్మజాదు లపుడు తాము వ్యక్తమగుట కిచ్చయించలేదు.

నిమేషాంతరకాలములో భీముడు విజృంభించి గొప్ప యుద్ధము గావించెను. అదిచూచి యుత్సహించి విరాటుని పెద్దకుమారుడు శంఖుడు యుద్ధమందు విజృంభించెను. అప్పుడు యుధిష్ఠిరుడు వేయి, భీము డేడువేలు. నకులు డేడువందలు, సహదేవుడు మూడువందలుగా త్రిగర్తులను యమలోకమున కంపిరి. భీము డపుడు సుశర్మపై విజృంభించెను, త్రిగర్తసైన్యమును సంహరింపుచు యుధిష్ఠిరుడు త్వరగలవాడై సుశర్మపై బాణములు ప్రయోగించెను. భీముడు సుశర్మ గుఱ్ఱములను గొట్టి పృష్ఠగోపులను సంహరించెను సారథిని రథమునుండి క్రిందపడవేసెను. మదిరాక్షు డాసమయములో సుశర్మను జక్కగా మోదెను. సుశర్మరథమందున్న విరాటు డపు డారథమునుండి దుమికి, సుశర్మ రథమందున్న గదను గ్రహించి యాసుశర్మను గొట్టెను. వృద్ధుడైనను గదాపాణియై తరుణుడువలెనే విరాటు డపుడు యుద్ధభూమిలో సంచరించెను. పాండవు లీతీరున

మత్స్యావాపరిస్థితిని గల్పింపగా మాత్స్యులు విజృంభించిరి, విరా
టుడు తనంత తానే విడబడినపరిస్థితి యిట్లేర్పడినది.

తం భీమసేనో ధావంత మ భ్యధావత వీర్యవాన్
త్రిగర్తరాజమాదాతుం సింహః క్షుద్రమృగం యథా ౩౩-౪౮
అభిద్రుత్య సుశర్మాణం కేశపక్షే పరామృశత్
సముద్యమ్యతు రోషా త్తం నిష్పి పేష మహీతలే ౪౯

(పలాయమానుడగు సుశర్మను వెంటాడి భీముడు సింహము క్షుద్రమృగమునట్లు వానిని కేశపక్షమున బట్టికొని భూమిపై బడవేసి నలిపివేసెను.)

ద్రౌపది కేశపక్షమునుబట్టియున్నట్టి కౌరవులనిమిత్తమగు నీయుద్ధమున సుశర్మ కేశగ్రహణమొంది పరాభవమొందెను.

నివర్త్య గా స్తతః సర్వాః పాండుపుత్రా మహారథాః
అవజిత్యసుశర్మాణం ధనం చాదాయ సర్వశః
సబాహుబలసంపన్నా హ్రీనిషేవాయతవ్రతాః
విరాటస్య మహాత్మానః పరిక్లేశవినాశనాః ౫౪
స్థితా స్సమక్షం తే సర్వే త్వథ భీమోఽభ్యభాషత
జీవితుం చేచ్ఛ సే మూఢ హేతుం మే గదతః శృణు ౬౦
దాసోఽస్మీతి త్వయా వాచ్యం సంపత్సుచ సభాసుచ
ఏవం తే జీవితం దద్యా మేష యుద్ధజితో విధిః ౬౧
త ము వాచ తతో జ్యేష్ఠో భ్రాతా సప్రణయం వచః
ముంచ ముంచాధమాచారం ప్రమాణం యది తేవయమ్ ౬౨
దాసభావం గతో హ్యేష విరాటస్య మహీపతేః
అదాసో గచ్ఛ ముక్తోఽసి మైవం కార్షీః కదాచన

(మహారథులగు పాండుపుత్రులు గోవులనుమరలించిరి. సుశర్మను నిర్జించిరి. బాహుబలసంపన్నులు. హ్రీనిషేవాయత్త వ్రతులు నగు పాండుపుత్రులు విరాటుని యొక్క పరిక్లేశమును బోగొట్టి యాతనిసమక్షమున నిలిచిరి........అప్పుడు భీము డిట్లనెను. జీవింపదలంచుచో మూఢుడా! యీ హేతువు వినుము. దాసుడనని నీవు పలుకవలయును. యుద్ధజితుడు గావించువిధి యిదియగును-అని పలికెను. ధర్మజుడపుడు ప్రణయవచన మిట్లు పలికెను. "అధమాచారుని విడిచివేయుము. మేము ప్రమాణ మగుచో నిట్లు గావింపుము. విరాటున కితడు దాసభావ మొందినవాడే. సుశర్మ నుద్దేశించి అదాసుడవైతివి. ఎప్పుడు నిట్లు గావింపకుము. విముక్తుడవైతివి. వెడలిపొమ్ము" అని పలికెను.)

పాండవులను దాసులగావింప బ్రయత్నించిన కౌరవుల పనుపున వచ్చిన సుశర్మ దాసభావమొందినవాడై విరాటునకు బ్రణామ మొనరించి యధోముఖుడై వెడలిపోయెను. పాండవులు గావించినమేలునకు విరాటుడు కృతజ్ఞతనుదెల్పగా యుధిష్ఠిర పురోగములగు పాండవు లుపచారవచనములు పలికిరి.

యుష్మాకం విక్రమా దద్య ముక్తోఽహం స్వస్తిమా నిహ
తస్మా ద్భవంతో మత్స్యానా మీశ్వరా స్సర్వ ఏవహి 38-2
ప్రతినందామ తే వాక్యం సర్వం చైవ విశాంపతే
ఏతే నైవ ప్రతీతాః స్మ య త్త్వం ముక్తోఽద్య శత్రుభిః 3

('మీ పరాక్రమమున నేను ముక్తుడనై స్వస్తుడనైతిని, కావున మీరలే మత్స్యదేశాధీశ్వరు లగుదురు-అని విరాటుడనగా

పాండవు లామాటనుమన్నించి నీవు శత్రువులనుండి విముక్తుడ వైతివి. దీనివలననే మేము ప్రతీతులమైతిమి' అని బదులుపలికిరి.)

అపుడు విరాటుడు ధర్మజునితో ప్రత్యేక మిట్లు పలికెను.

ఏహి త్వామభిషేక్ష్యామి మత్స్యరాజస్తు నో భవాన్ ३४-౧౦
మనస శ్చా స్యభిప్రేతం యథేష్టం భువి దుర్లభం
తత్తేహం సంప్రదాస్యామి సర్వ మర్హతి నో భవాన్ ౧౧

(ఏతెమ్ము, నిన్నభిషేకించెదను. నీవు మత్స్యరాజు వగుదువు. లోకదుర్లభమగు మనోభిలషితమెల్ల నొసంగెదను. సర్వమునకు నీ వర్హుండవు. అని విరాటుడు పలికెను. ధర్మజు డావాక్యమున కుచితప్రతివచనము పలికి నగరమందు విజయవార్త ప్రకటింప ప్రోత్సహించెను.)

## ఉత్తర గోహరణము

త్రిగర్తులు విరాటుని గోవులను దక్షిణదిక్కున పట్టిన మఱునాడు దుర్యోధనుడు సహామాత్యుడై వచ్చి యుత్తరదిక్కున నున్న గోవులను పట్టుకొనెను. గోపాధ్యక్షుడు వేవేగ నగరము లోనికి వచ్చి. భూమింజయుడను పేరుగల విరాటపుత్రునితో నిట్లుపలికెను.

షష్టిం గవాం సహస్రాణి కురవః కాలయంతి తే
తద్విజేతుం సముత్తిష్ఠ గోధనం రాష్ట్రవర్ధన ३५-౧౦
రాజపుత్ర హితప్రేప్సుః క్షిప్రం నిర్యాహిచ స్వయం
త్వాంహి మత్స్యో మహీపాలః శూన్యపాల మిహాకరోత్ ౧౧

ఆవర్తయ కురూన్ జిత్వా పశూన్ పశుమతాంవర
నిర్దహైషా మనీకాని భీమేన శర తేజసా ౧౪

పాశోపధానాం జ్యాతంత్రీం చాపదండాం మహాస్వనాం
శరవర్ణాం ధనుర్వీణాం శత్రుమధ్యే ప్రవాదయ ౧౫

శ్వేతా రజతసంకాశా రథే యుజ్యంతు తే హయాః
ధ్వజంచ సింహసౌవర్ణ ముచ్ఛ్రయంతు తవ ప్రభో ౧౬

రణే జిత్వా కురూన్ సర్వాన్ వజ్రపాణి రివాసురాన్
యశో మహ దవాప్య త్వం ప్రవిశేదం పురం పునః ౧౭

త్వంహి రాష్ట్రస్య పరమాగతి ర్మత్స్యపతేః సుతః
యథాహి పాండుపుత్రాణా మర్జునో జయతాం వరః ౨౦

---

ఏవ మేవ గతి ర్న్యానం భవాన్ విషయవాసినాం
గతిమంతో భనం త్వస్య సర్వే విషయవాసినః ౨౧

(కౌరవు లఱువదివేల గోవులను గొనిపోవుచున్నారు. రాష్ట్రవర్ధన వారల జయింప వేగలెమ్ము. రాజపుత్రుడా హిత మెఱిగి వేగము స్వయమేగుము. ఆమహీపాలుడు నిన్ను శూన్య పాలుడుగా గావించియున్నాడు. నిన్నుగూర్చి యాతడు పరిషత్తునందు బ్రశంసించియున్నాడు. ఆ మనుష్యేంద్రుని భాషితము సత్యమగుగాక కౌరవులను జయించి పశుమతాంవర! పశువులను మరలింపుము. భయంకరశర తేజమున వారిసైన్యమును గాల్చివేయుము, పాశోపధానయు జ్యాతంత్రియు, చాపదండయు, మహాస్వనయు, శవర్ణయునగు ధనుర్వీజను శత్రుమధ్యమున వాయింపుము. రజతసంకాశము లగు నీ తెల్లని గుఱ్ఱములు, సౌవర్ణసింహధ్వజము రథమందు గట్టినియోగింపుము.

వజ్రపాణి యసుర లనువలెనే కౌరవులనందఱను జయించి గొప్ప యశమునొంది మరలిపురమును ప్రవేశింపుము. పాండవులలో నర్జునునట్లు నీవిపుడు రాష్ట్రమునకు పరమగతివై యున్నావు. ఈ విషయ వాసులందఱు నిపుడు గతిమంతులగుదురుగాక, అని గోపాధ్యక్షు డుత్తరునిగూర్చి పలికినాడు.)

గోపాధ్యక్షు డుత్తరునిగూర్చి పలికిన యీ మాటలు దైవవశమున నర్జునుని యుద్ధమునకు బురికొల్పినవిగా బరిణమించినవి. ఇందు 'కౌరవులను జయింపుము' అనుమాట [*] ముమ్మాఱుగా గోపాధ్యక్షుని నోట వెలువడుట యమోఘముగా నున్నది. "కౌరవులను జంపుట" అనునది కాని పలుకు గోపాధ్యక్షునినోటవచ్చుట యర్జునునకుగొప్ప ప్రోత్సాహామగుచున్నది.. కౌరవులనుజంపకయే పశువులమరలించుట యేర్పడునను గొప్పసూచన యిందు ధ్వనించుచున్నది. ధనస్సును వీణతో సరిపోల్చినపలుకు గోపాధ్యక్షునినోట వెలువడుట మఱియు నమోఘ హేతువుగా నర్జుననందు బ్రతిఫలించుచున్నది. ఇంత వఱకు వాయించుచున్నది. వీణ (విరాటు నంతఃపురమందు) ఇపుడు వాయింపదగునది ధనుర్వీణ (యుద్ధరంగమందు, అని యర్జునుని విచిత్రముగా నిది పురికొల్పినట్లయినది. "భీమేన శరతేజసా" అనునదియు విచిత్రముగా గాండీవమును ధ్వనింపజేయుచున్నది. ఉత్తరుని రథమునకుగూడ తెల్లని గుఱ్ఱములే యుండుట శ్వేతవాహనుడగు నర్జునుని యుద్ధానుకూలమును

[*] తద్విజేతుం సముత్తిష్ఠ, కురూన్ జిత్వా పశూన్, రణే జిత్వా పశూన్ ౧౧, ౧౪, ౧౯,

మఱియు సూచించుచున్నది. సుశర్మతోడి యుద్ధమునకందఱు నగరమును విడిచిపోయిన యాసమయమున మహారథుడగు నుత్తరకుమారుడు నగరరక్షకుడుగా (శూన్యపాలుడుగా) నుంచ బడియున్నాడు దైవవశమున పాండవులందర్జును డొక్కడు నల్లే నగరమందున్న వాడయినాడు, "అర్జునునివలెనే నీవు రాష్ట్రమునకు పరమగతివై యున్నావు" అని గోసాధ్యక్షుడు ఉత్తరునిగూర్చి చివరగా బలుకుట గమనింపదగినదై యున్నది. స్త్రీలమధ్యలో నిట్లుగాబలుకబడిన నావిరాటపుత్రు డుత్తరు డంతఃపురములో శ్లాఘ్యమానుడై యిట్లు పలికెను.

అధ్యాహ మనుగచ్ఛేయం దృఢధన్వా గవాంపదం
యది మే సారథిః కశ్చి ద్భవే దశ్వేషు కోవిదః 38-1
తం త్వహం నావగచ్ఛామి యో మే యంతా భవే న్నరః
పశ్యధ్వం సారథిం క్షిప్రం మమ యుక్తం ప్రయాస్యతః 2
అష్టావింశతిరాత్రంవా మాసంవా నూన మంతతః
యత్తదాసీ న్మహద్యుద్ధం తత్ర మే సారథి ర్హతః 3
స లభేయం యదా త్వన్యం హయయానవిదం నరం
త్వరావా నద్య యాత్వాహం సముచ్ఛ్రిత మహాధ్వజమ్ 4
విగాహ్య తత్పరానీకం గజవాజిరథాకులం
శస్త్ర ప్రతాప నిర్వీర్యాన్ కురూన్ జిత్వానయే పశూన్ 5

(అశ్వకోవిదుడగు సారథి యేర్పడుచో నిపుడే గోపద మును గూర్చి దృఢధన్వుడనై వెనుదగులుదును నాకు సారథి కాదగువాని గాన నైతిని (యో మే యంతా భవే న్నరః) (యుద్ధరంగమునకు) బ్రయాణమొనర్చుచున్న నాకు సారథి

నొక్కని కనుగొనుడు. ఇరువదియెనిమిది రాత్రులయినదో, మాసమయినదో యపుడుజరిగిన మహాద్యుద్ధములో నాసారథి హతుడై నాడు. హయయానవిదుడగునరుడు లభింపగనే సము చ్ఛ్రితమహాధ్వజుడనై త్వరగావెడలెదను, గజవాజిరథాకులమైన యా సేనలో జొరబడి కౌరవులను శస్త్రప్రతాప నిర్వీర్యుల గావించి జయించి పశువులను మరలించి తెచ్చెదను )

'సారథిలేడు నేనిపుడు చేయునదేమి' అనులాగున నుత్తరుడు పలుకలేదు. వేగ సూతునరయుడు యుద్ధమున కిపుడే పోవలయును' అనులాగున నుత్తరుడు పలికినాడు "పశ్యధ్వం సారథిం క్షిప్రం మనుయుక్తం ప్రయాస్యతః' అనునది యుత్తరుని యుద్ధదీక్షను వ్యక్తీకరించుచున్నది. "ప్రయాస్యతః' అను పద మాతని యుద్ధయాత్రను ప్రస్ఫుటము గావించుచున్నది. తాను యుద్ధసన్నద్ధుడగులోపున నశ్వకోవిదుడగు సారథిని గను గొని తేవలసినదని యుత్తరు నాశయమైయున్నది. "యంతా హయయానవిదం నరం' అని యుత్తరునిచోట మాటవెడలుట యర్జున ప్రోత్సాహమగు పరిస్థితి యగుచున్నది, "ఇరువది యెనిమిది దినములో నెలరోజులో యైనది, అపుడు నా సారథి హతుడయినాడు' అని యుత్తరునినోట నిపుడు మాటవెలువడు టయు పరిస్థితినెల్ల ప్రస్ఫుట మొనర్చుచున్నది. అధికమాసదినము లను జిత్రముగా లెక్కించియున్న యజ్ఞాతవాస నిష్కర్ష నిది యెంతయేని స్ఫురింపజేయుచున్నది. మొత్తమున నుత్తరుని మాటలు, గోపాధ్యక్షునిమాటలుసమయసూచకములై యర్జునుని

యుద్ధయాత్రను నిర్ధారించునవియై యేర్పడినవి. వారిద్దఱినోళ్ల నుండి "కౌరవులను జయించుట" యనుమాటయే వచ్చినది. కౌరవులను చంపుటయను ప్రసక్తి యేర్పడలేదు "శస్త్రప్రతాప నిర్వీర్యాన్ కురూన్ జిత్వా ... యేపశూన్" అనినాడు త్తరుడు. అపుడు పాండవులం దర్జునుడొక్కడే పురముందున్న వాడయి నాడు. ఆ యర్జునుని బాధ్యతను బురస్కరించుకొని వెలువడిన మాటయై యీ ప్రసంగ మేర్పడినది

దుర్యోధనం శాంతనవం కర్ణం వైకర్తనం కృపం
ద్రోణంచ సహపుత్రేణ మహేష్వాసాన్ సమాగతాన్ ౬
వితాసయిత్వా సంగ్రామే దానవా నివ వజ్రభృత్
అనేనైవ ముహూర్తేన పునః ప్రత్యానయే పశూన్ ౭
శూన్య మాసాద్య కురవః ప్రయాంత్యాదాయ గోధనం
కిన్ను శక్యం మయా కర్తుం యదహం తత్ర నాభవమ్ ౮
పశ్యేయు రద్య మే వీర్యం కురవ స్తే సమాగతాః
కిన్ను పార్థో ౽ ర్జునః సాక్షా దయ మస్మాన్ ప్రబాధతే ౯

(దుర్యోధనుని, శాంతనవుని, కర్ణుని, కృపుని గొట్టెదను. అశ్వత్థామతోగూడ ద్రోణునిగొట్టెదను. సమాగతమహేష్వాసు లందఱ జెండాడెదను. దేవేంద్రుడు దానవులను బారదోలి నట్లందఱ బారదోలెదను ఇదే ముహూర్తములో పశువులను మరలించి తెచ్చెదను. శూన్యమని తలంచి కౌరవులు గోధనమును హరించిరి. నేనక్కడ లేకపోయితి నేమిచేయుదును, సమాగతు లగు కౌరవులిపుడు సాక్షాదర్జునుడేవచ్చి మనలబాధించు

చున్నాడా యేమీ యని నాపరాక్రమమును గాంచగలరు అని యుత్తరు డంతఃపురమున బలికెను.)

ఉత్తరుడు దుర్యోధనుని పేరునే మొదటగా బేర్కొనుట వాని యెుఱుకును వెల్లడించుచున్నది. మొదటిపాదమందు కౌరవముఖ్యుల నుత్తరుడు పేర్కొనినాడు, రెండవపాదమున ద్రోణాశ్వత్థామలను, సమాగతమహేష్వాసులనెల్ల బేర్కొని నాడు. మూడవపాదమున విజృంభణ విశేషమును వెల్లడించి నాడు. మెఱుపువలె యుద్ధమొనరించి గోవ్రలను తత్ క్షణము మరలించెదనంచు నాల్గవపాదమున బేర్కొనివాడు. ఇట్లుగా మాటలతో క్రమముగావిజృంభించుచున్న యుత్తరుడు చివరగా నర్జునోపమానమును బలికినాడు, ఇది యర్జునుని ప్రోత్సహించుట యందు దలమానికముగా నొప్పియున్నది. కొలది సేపుమాత్రమే యుద్ధముజరుగుటను, పశువులు సులువుగా బట్టుబడుట నిది వ్యక్తీకరించుచున్నది. ముహూర్తములో బశువులు బట్టుపడగల వను సూచన నిది గావించుచున్నది.

శ్రుత్వా తదర్జునో వాక్యం రాజ్ఞః పుత్రస్య భాషతః
అతీతసమయే కాలే ప్రియాం భార్యా మనిందితామ్ ౧౦
ద్రుపదస్యసుతాం తన్వీం పాంచాలీం పావకాత్మజాం
సత్యార్జవగుణోపేతాం భర్తుః ప్రియహితే రతామ్ ౧౧
ఉవాచ రహసి ప్రీతః కృష్ణాం సర్వార్థకోవిదః ౧౨

(రాజపుత్రునిమాటలు విని సర్వార్థకోవిదుడగు నర్జును డతీతసమయమగు నాకాలమునుగుఱించి ప్రీతుడై ద్రౌపదితో రహస్యమున నిట్లనెను.)

అజ్ఞాతవాససమయము తీరిపోయియున్న యా సమయమం దిట్టి యుద్ధప్రోత్సాహమొందిన యర్జునుడు ప్రీతుడై నాడు. రహస్యమున ద్రౌపదితో కార్యవచనము పలికెను, ద్రౌపదినిగూర్చి యెన్నియో మేల్మి వచనము లిచ్చటగలవు. "నా మాటగా నుత్తరునితో దెల్పుము. ఆతడు యంత కాగలడు అని పలుకుము" అనినాడు.

తస్య తద్వచనం స్త్రీషు భాషతశ్చ పునః పునః
న సా మర్షత పాంచాలీ బీభత్సోః పరికీర్తనమ్ ౧౪

గ్రంభీరహృదయయగు ద్రౌపది జగద్విఖ్యాతుడగు బీభత్సుని పరికీర్తన మచ్చోటగావించుట కిచ్చయించినదిగాదు. అయినను భర్తపను పదియగుటచే. నది మహత్తర ప్రయోజనమగుటచే దుద కా తపస్విని సిగ్గువడుచు మెల్లగా నుత్తరునితో నిట్లనెను.

యో ఽ సౌ బృహద్వారణాభో యువా సుప్రియదర్శనః
బృహన్నళేతి విఖ్యాతః పార్థస్యాసీ త్స సారథిః ౧౬
ధను ష్యనవరష్చసీ త్త స్య శిష్యో మహాత్మనః
దృష్టపూర్వో మయా వీర చరంత్యా పాండవాన్ ప్రతి ౧౭
యదా తత్పావకో దావ మదహ త్ఖాండవం వనం
అర్జునస్య తదానేన సంగృహీతా హయోత్తమాః ౧౮
తేన సారథినా పార్థః సర్వభూతాని సర్వశః
అజయత్ ఖాండవప్రస్థే నహి యంతాస్తి తాదృశః ౨౦

(ఆతడు బృహద్వారణాభుడు, జవ్వనుడు, సుప్రియదర్శనుడు, బృహన్నలయని విఖ్యాతుడు పార్థున కతడు సారథి

ధనుష్మన తక్కువవాఁడు కాఁడు. ఆ మహాత్ముని యొక్క శిష్యుఁడు. పాండవుల యొద్ద చరించినపు డాతని జూచియుంటిని. (దృష్ట పూర్వుఁ డయినాఁడు) అగ్నిహోత్రుఁడు ఖాండవవనమును దహించినపు డర్జునునిగుఱ్ఱము లీతనిచేతనే గ్రహింపబడినవి ఈ సారథి తోడ నా పార్థుఁడు సర్వభూతములను ఖాండవప్రస్థమందు జయించి యున్నాఁడు, తత్సదృశుఁడగు యంత మఱి లేఁడు )

'యో్యా సౌ బృహద్వారణాభో యువా సుప్రియదర్శనః' అని ద్రౌపది పలికినది. ఇందు ప్రతిమాటయు ద్రౌపదియొక్క యంతరంగమును బహిర్గతమొనర్చుచున్నది. 'బృహన్న లేతి విఖ్యాతః' అనునది యామె హృదయమును వ్యక్తీకరించుచున్న. "విఖ్యాతః" అని పుంస్త్వముగా బలుకుట గమనింపదగినది. ధనుష్యనవర చ్చాసీత్ తస్య శిష్యో మహాత్మనః" అనునదియు ద్రౌపదియొక్క హృదయసారమును వ్యక్తీకరించుచున్నది. బృహన్నల యర్జునశిష్యుఁడను నర్థమును గల్గించుచు ద్రోణుని శిష్యుఁ డాతఁడను ద్రౌపదిహృదయము నీమాట వ్యక్తీకరించుచున్నది. ద్రౌపది బృహన్నల యర్జునునకు సారథిగా ఖాండవ వనమున నున్నాఁడని సూచనగా బలికినది. అపు డర్జునుని గుఱ్ఱములనితఁడే గ్రహించియున్నాఁడని చిత్రముగా బలికినది. అర్జునుఁడిపు డుత్తరుని గుఱ్ఱములను బట్టువాఁడేకాని సారథిమాత్రము కాఁడనుమాచన యిందుచిత్రముగా ధ్వనించుచున్నది. బృహన్నల నీకు సారథ్యమొనరించునని స్పష్టముపలుకక ద్రౌపది "యట్టిసారథి లేఁడు' అని మాత్రము పలికినది. "నహి యంతాస్తి తాదృశః" అని గంభీరహృదయయై ద్రౌపది మాటవచించినది.

విషయము వ్యక్తమొనరించినదేకాని తన నోటమాత్ర మా గంభీరహృదయురాలు బృహన్నల నీకు సారథ్యము చేయునని' పలుకనేలేదు. ఇచ్చోట 'యంత' అనుమాట తలమానికముగా నున్నది. ఉత్తరునినడిపించువాడతడను నర్థమిందు ద్యోత్యమగు చున్నది. 'నపుంసకుడుకాడేని యట్లేకావచ్చును. నేనై స్వయము 'బృహన్నలా నాగుఱ్ఱములవ దోలుమని యెట్లుచెప్పగలవాడను'అని యుత్తరుడుబదులుపలికినాడు. తనకామాట చిన్న పరిస్థితి యనునట్లుత్తరుడు వచించుటనుజూచి ద్రౌపది 'నీచెల్లెలే యీవీరవచనము గావింపగలదు' అని పలికినది.

యది వై సారథిః సస్యాత్కురూన్ సర్వాన్న సంశయః
జిత్వా గాశ్చ సమాదాయ ధ్రువ మాగమనం భవేత్ ౨౨

(అతడు సారథియగుచో గౌరవులందఱను నిస్సంశయము జయించిగోవులను మరలించి ధ్రువము తిరిగిరావడ మగును అని ద్రౌపది పలికినది.)

"సస్యాత్" (అతడు సారథియగుచో) అని ద్రౌపది చమత్కారముగా నెత్తికొనినది. "కౌరవులనందఱను' అని పలికి ద్రౌపది యావిషయ మంతటితో విడిచినది. "నిస్సంశయము జయించి గోవులను మరలించుట ఆగమనము నగును' అని పిమ్మట పలికినది. ఈపని నెఱవేర్చువారెవరో యిందు ద్రౌపది స్పష్టపఱచలేదు. విషయగాంభీర్య మంతర్భూత మొనరింపబడినది. ఇట్లుగా ద్రౌపది విషయమునుమాత్ర మెఱిగించి భర్త పనుపును నెఱవేర్చినది. అర్జునుని యొక్కయు తన

యొక్కయు గాంభీర్యమును గాపాడుకొనునది ఈశ్లోకము పూర్వార్థమందలి పదములన్నియు పొడుచుకొనిపోవునవిగా నమరియున్నవి. సంగ్రామప్రదేశమున గానున్న మార్పును చమత్కారముగా నుత్తరార్థము సూచించుచున్నది ప్రచ్ఛన్న చారుడై యున్న యర్జునునియొద్దకు వచ్చి [*] యుత్తర చనవును ప్రకటించుచు నిట్లుపలికినది.

ఆర్జునస్య కిలాసీ స్త్వం సారథి ర్దయితః పురా
త్వయాజయ త్సహాయేన పృథివీం పాండవర్షభః 32-12

సా సారథ్యం మమ భ్రాతుః కురు సాధు బృహన్నళే
దూరా ద్దూరతరం గావో హ్రియంతే కురుభిర్నః 13

అథైత ద్వచనం మేఽద్య నియుక్తా న కరిష్యసి
ప్రణయా దుచ్యమానా త్వం పరిత్యక్ష్యామి జీవితమ్ 14

(మున్నర్జునునకు మెచ్చు సారధివై యుంటివనియు, నీ తోడ్పాటున బుడమినెల్ల నాయర్జునుడు జయించెననియు సైరంధ్రి యెఱిగించినది. బృహన్నలా! ఆసారథ్యము మాయన్న విషయమై గావింపుము, కౌరవులు మా గోవులను దూరము

[*] సా ప్రాద్రవ త్కాంచన మాల్యధారిణీ
జ్యేష్ఠేన భ్రాత్రా ప్రహితా యశస్వినీ
సుదక్షిణా వేది విలగ్న మధ్యా
సా పద్మపత్త్రాభనిభా శిఖండినీ 32-1
తన్వీ శుభాంగీ మణిచిత్ర మేఖలా
మత్స్యస్య రాజ్ఞో దుహితా శ్రియా వృతా

నుండి దూరమునకు గొనిపోవుచున్నారు. నాచే నియోగింపబడి నీవు నావచనము గావింపనిచో జీవితమును పరిత్యజించెదను" అనిపలికెను.

"సా సారథ్యం" అనియుత్తరనోటమాట వెలువడుట చమత్కారముగా నున్నది ఖాండవవనమున గావించినవనియే యాతడిపుడు గావింపదగునను ప్రోత్సాహవచనముగా నీమాట పరిణమించుచున్నది. ఉత్తరచనవును ప్రకటించుచు వీరవచనము పలికినది అపుడమితౌజస్కుడగు నర్జునుడేమియు బదులు పలుక

---

తన్నర్తనాగార మరంశపణ్ణా
శతహ్రదా మేఘ మివా భ్యపద్యత ౨
సా హస్తి హస్తోపమ సంహతోరూః
స్వనిందతా చారుదతీ సుమధ్యమా
ఆసాద్య తంవై వరమాల్య ధారిణీ
పార్థం శుభా నాగవధూ రివ ద్విపమ్
సా రత్నభూతా మనసః ప్రియార్చితా
సుతా విరాటస్య యథేంద్రలక్ష్మీః
సుదర్శనీయా ప్రముఖే యశస్వినీ
ప్రత్యబ్రవీ దర్జున మాయతేక్షణా ౪
సుసంహతోరుం కనకోజ్జ్వల త్వచం
పార్థః కుమారీం స తదా భ్యభాషత ౫

ఇంద్రలక్ష్మినిబోలు ఉత్తర యర్జునునిసమీపించిన శోభ యిట్లుగా వర్ణింపబడినది.

లేదు. ఉత్తరమాట విని యర్జునుడు రాజపుత్రుని యొద్దకు వెడలెను. (ఏవముక్తః.........పరంతపః జగామ రాజపుత్రస్య సకాశ మమితౌజసః ౧౫)

దూరమునుండియే యుత్తరుడు బృహన్నలనుజూచి "సారథ్యము చేయవలసినది. అర్జునునకు సారథ్యము చేసియుంటి వని సైరంధ్రి తెల్పినది." అని పలికినాడు బృహన్నల యిట్లు పలికెను.

కా శక్తి ర్మమ సారథ్యం కర్తుం సంగ్రామమూర్ధని ౧౭
గీతంవా యదివా నృత్యం వాదిత్రంవా పృథగ్విధం
తత్కరిష్యామి భద్రం తే సారథ్యంతు కుతో మమ ౨౭

(సంగ్రామమూర్ధమున సారథ్యమునకు నాకు శక్తి యేమి, గీతమో, నృత్యమో, వాదిత్రమో వేఱువిధమోయది చేయుదును. నీకు మంగళమగును. నాకు సారథ్య మేమి.)

'కాశక్తిః...........సంగ్రామమూర్ధని..........పృథగ్విధం' అనుమాట లర్థగాంభీర్యమును గల్గించుచున్నవి. గృహమందు గీతము, నృత్యము, వాద్యము, సంగ్రామమందు యుద్ధ మొనర్చుట తన కృత్యమగునని బృహన్నల వచించిన ట్లామాటలు తెల్ల మొనర్చుచున్నవి. ఇంట బైట సారథ్యవిషయము తనయందు కాదని యాతడు విచిత్రము పలికినాడవి పర్యవసానము.

బృహన్నళే గాయనోవా నర్తనోవా పునర్భవ
క్షిప్రం మే రథ మాస్థాయ నిగృహ్ణీష్వ హయోత్తమాన్ ౨౩

'నీవు గాయకుడవో, నర్తకుడవో, మఱి యేమగుదువో వేగరథమెక్కి హయోత్తములను బట్టుము' అని యుత్తరు డనెను)

"పృథగ్విదం' అనుమాట యెంతటి యర్థమును గల్గించు చున్నదో "పునర్భవ" అనుమాటయు నట్లేర్పడియున్నది. సారథిగా గుఱ్ఱములనుబట్టి వచ్చి సంగ్రామ శిరః ప్రదేశమున రథికుడు కానున్న యర్జునుని పరిస్థితి కీమాట లొప్పియున్నవి. అన్నివిషయము లెఱింగిన వాడయ్యు నర్జును డపుడు నవ్వువచ్చుపనులు పెక్కుగావించినాడు. నర్మకృత్యము లాతడనేకము లొనర్చియున్నను కావ్యమందు గవచ మడ్డదిడ్డముగా దొడగుటయను నదొక్కచే యశ్లేషింపబడినది ఇదిచూచి పృథులోచనలగు కుమారికలు ప్రహసించిరి. 'ప్రాహసన్ పృథులోచనాః' అని యిచ్చట గలదు ఆ కన్నుల నవ్వుదేఱుట యందలిసొగసు నిది పుష్టీకరించుచున్నది. సారథికృత్యము నిపుడే యుత్తరునిచే గావించువాడై యర్జునడీ నర్మవిశేష మాచరించినాడు. ఉత్తరు డపుడు త్వరగలవాడై యర్జునునకు గవచము దొడిగి తానుకవచ ధారియై యుద్ధసన్నద్ధుడైనాడు. ప్రయాణసమయమున నుత్తరయు గన్యలును 'బృహన్నలా! రుచిరములగు గౌరవుల వస్త్రములను పాంచాలికార్థము గొనితెమ్ము' అనిపలుకగా నర్జునుడు 'ఉత్తరుడు జయించినప్పుడు తెచ్చెదను' అని నవ్వుచు బదులు పలికెను. కన్యలందీపనుపు వేడుకయగుచు నుత్తర విషయమై

వీరవచన మగుచున్నది. [*] కోడలు కానున్న యుత్తర కన్యకు డావస్త్రములను స్వయ మొసంగియున్నా డను పర్యవసాన మిందు గలదు ప్రయాణసమయమున స్త్రీలు, కన్యలు, ద్విజులు ప్రదక్షిణ మాచరించిరి. అపు డంగన లిట్లు పలికిరి.

యదర్జున స్యర్షభతుల్యగామినః
పురా భవ త్ఖాండవదాహ మంగళం
కురూన్ సమాసాద్య రణే బృహన్నళే
సహోత్త రేణా ద్య తదస్తు మంగళమ్ ३॥

(అర్జునునకు పూర్వము ఖాండవదాహమంగళ మేదియైనదో కౌరవులను జేరి రణమందు బృహన్నలా! సహోత్తరుండవగు నీ కట్టిమంగళ మిపుడేర్పడుంగాక. అని పలికిరి)

ఇది యర్జునయుద్ధ జయమంగళమునే తెల్పుచున్నది. అర్జునునకు జయమిప్పించినసారథి బృహన్నలయని యపుడు రూపమేర్పడియున్నది. అందువలన 'బృహన్నళే సహోత్తరేణాऽద్య తదస్తు మంగళం' అను మంగళవచనము బృహన్నలను బ్రశంసించునదిగా నగుచు నుత్తరునకు మంగళవచన మగుచున్నది.

ఉత్తరుడు రాజధానిని దాటి నిర్భయుడై కౌరవుల కడకు బోవుమని సూతునితో బలికెను. 'కౌరవులను జయించి వారుపట్టిన గోవులను మరలించి పురము ప్రవేశించెదను' అని పలికెను. నరసింహుడగు పాండునందనుడు కాంచనమాలాశ్వములను బోలగా నవి వాతరంహసమున నాకసమునొరయుచు

[*] ప్రదదౌ తాని వాసాంసి విరాటదుహితుః స్వయం

౩౦-౧౬

బోయినవి. నాతిదూరముపోయి మత్స్యపుత్ర ధనంజయులు బలాతిబలమగు గౌరవులబలమును గాంచిరి. శ్మశానసమీపము నకుబోయి కౌరవులనుగాంచిరి. శమీవృక్షమును సమీపించి కౌరవ వ్యూహమును గాంచిరి. పాండవు లాయుధము లుంచిన స్థానమునకు— గాండీవమున్న చోటునకు గౌరవులువచ్చుట వారి తలవ్రాత. విజయసాధకుండగు నర్జునుసామంతము నిది వ్యక్తీకరించుచున్నది. మహద్వీరరక్షితమై గజాశ్వరథసంకులమగు గౌరవసైన్యమునుగాంచి యుత్తరుడు హృష్టరోముడు, భయోద్విగ్నుడై యిట్లనెను.

నోత్సహే కురుభి ర్యోద్ధుం రోమహర్షంహి పశ్య మే ३౮-౧౦
బహుప్రవీర మత్యుగ్రం దేవైరపి దురాసదం
ప్రతియోద్ధుం న శక్ష్యామి కురు సైన్య మనంతకం ౧౧
నాశంసే భారతీం సేనాం ప్రవేష్టుం భీమకార్ముకాం

.... .... .... . . . ... ... .... ... .... .... .... .... .... ... .... ....

యత్ర ద్రోణశ్చ భీష్మశ్చ కృపః కర్ణో వివింశతిః ౧౩
అశ్వత్థామా వికర్ణశ్చ సోమదత్తశ్చ బాహ్లికః
దుర్యోధన స్తదా వీరో రాజాచ రథినాం వరః ౧౪
ద్యుతిమంతో మహేష్వాసాః సర్వే యుద్ధవిశారదాః ౧౫

(కౌరవులతో యుద్ధ మొనర్ప నుత్సహింపను, రోమాంచమగుచున్నది. నన్ను జూడుము. బహుప్రవీరము. అత్యుగ్రము దేవతలకును దురాసదమునగు ననంతమైన కౌరవసైన్యముతో ప్రతియుద్ధమొనర్ప శక్తుడనుగాను, భీమకార్ముకమగు భారత

సేనను ప్రవేశింపజాలను. యుద్ధభూమియందు బరులను గాంచుట తోడనే నా మనస్సు ప్రవ్యథితమగుచున్నది. ఇందు ద్రోణుడు, భీష్ముడు, కృపుడు, కర్ణుడు, వివింశతి, అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తుడు, బాహ్లికుడు, రథినాంవరుండగు దుర్యోధనమహారాజు గానవచ్చుచున్నారు. వీరలందఱు ద్యుతిమంతులు, గొప్ప ధనుస్సులుగలవారు, యుద్ధవిశారదులు-అని యుత్తరుడు పలికెను,)

అంతవఱకు నుత్సాహ ముత్తరునందు బనిచేసినది. ఇపుడాయుత్సాహ ముత్తరునకు లేకపోయినది. ఈ సంఘటన ఉత్తరునందు యోగ్యమగుచు నర్జునవిజయహేతువుగా బరిణమించునదగుచున్నది వీరులే కాదు ప్రవీరులున్నారు ఇంకను బహు ప్రవీరమైన దా కౌరవబలము. ఉగ్రమే కాదు అత్యుగ్రమైనది మఱియు దేవతలకును దురాసదమైనది. వారివి భీమకార్ముకములు. ఇట్టి జగద్వీరరక్షితమగు ననంతమైన కౌరవబలము నా చతురంగసైన్యమును గాంచి యుత్తరుడు నిజపరిస్థితిని గుర్తించి యథార్థము పలికినాడు.

అంతఃపురమున 'దుర్యోధనం శాంతనవం' అని బీరవచనములు పలికియున్న యుత్తరుడిపుడు దుర్యోధనుని చివరగా బేర్కొని మాట పలుకుట గమనింపదగినది ఉత్తరుడు గ్రహించిన నిజపరిస్థితినెల్ల నిదివ్యక్తీకరించుచున్నది. 'జయముమాట దేవుడెఱుంగును నేను ప్రతి యుద్ధమే చేయజాల, నన లాసైన్యమందు బ్రవేశింపనే చాలను' అని యుత్తరుడు నిజముపలికినాడు. కౌరవవ్యూహమును చూడగనే రోమాంచమై

నా మనసు కశ్మల మగుచున్నదని పలికినాడు (హృషితాని చ రోమాణి కశ్మలం చాగతం మమ

వై శం పా య నః :

అవిజాతో ఽజాతస్య మహోక్ష్య ధ్భూరస్య పశ్యతః
పరిదేవయతే మందః సకాశే సవ్యసాచినః ౧౭

త్రిగర్తా న్మే పితా యాతః శూన్యే సంప్రణిధాయ మాం
సర్వాం సేనా ముపాదాయ న మే సంతీహ సైనికాః ౧౮

సో ఽ హ మేకో బహూన్ బాలః కృతాస్త్రా నకృత శ్రమః
ప్రతియోద్ధుం న శక్ష్యామి నివర్తస్వ బృహన్నలే ౧౯

(సవ్యసాచిసకాశములో మందుడైన యుత్తరుడు పరిదేవన మొనర్చుచు నిట్లనెను "శూన్యమున నన్నుంచి నా తండ్రి సైన్య మెల్ల గొని త్రిగర్తుల తోడియుద్ధమునకు బోయియున్నాడు నాకిక్కడ సైనికులు లేరు. ఒనే నొక్కడను. కృతాస్త్రులు వారు పెక్కెండ్రు, అకృతశ్రముడను నేను, వారితోడ ప్రతియుద్ధ మొనర్ప శక్తుడను గాను. బృహన్నలా! మరలుము' అని పలికెను.

భయ మొందిన మందుడగు నుత్తరుడు సవ్యసాచిసన్నిధి మున సబబుచాలనిమాట పలికినాడు 'ఇక్కడ నాకు సైనికులు లేరు' అనినాడు. అకృతశ్రము డుత్తరు డేకాకి కాగా కృతా స్త్రులు బహుప్రవీరులు చుట్టుముట్టనున్న ప్రమాదము నాతడు బహువుగా జెప్పికొనినాడు.

"బహూన్ బాలః కృతాస్త్రాన్" అన నవి దీనినంతయు వ్యక్తీకరించుచున్నది. "బాలుడను మధ్యను మాడిపోవుకంటె

కాగలదేమి" అని యుత్తరుడనివాడు, సైన్యములేక యొంటరి యగుదన్ను కృతాస్త్రిలనేకులు చుట్టుముట్టనున్న ప్రమాదమును, భయమును నుత్తరుడు పలికినాడు.

శ్లో ౭ హం? మేకః .... అకృతశ్రమః-ఇది యుత్తరుని యెల్ల. ఏకోబహూన్ కృతాస్త్రానకృతశ్రమః-ఇది యాదలియంతరము బహూన్ బాలః కృతాస్త్రాన్-ఇది చుట్టుముట్టబడు నుత్తరుని పరిస్థితి. ఉత్తరు డిట్లు భయవచనములు పలుకగా బృహన్నల యిట్లనెను,

భయేన దీన రూపో ऽ సి ద్విషతాం హర్ష వర్ధనః ౧౯
నచ తావత్ కృతం కర్మ పరైః కించిత్ రణాజిరే
స్వయ మేవచ మా మాత్థ వహ మాం కౌరవాన్ ప్రతి ౨౦
సోऽహం త్వాం తత్ర నేష్యామి యత్రైతే బహులా ధ్వజాః
మధ్య మామిష గృధ్రాణాం కురూణా మతతాయినామ్ ౨౧
నేష్యామి త్వాం మహాబాహో పృథివ్యా మపి యుధ్యతాం
తథా స్త్రీషు ప్రతిశ్రుత్య పౌరుషం పురు షేషుచ ౨౨
కత్థమానోऽభినిర్యాయ కిమర్థం న యుయుత్ససే
న చే ద్విజిత్య గా స్తా స్త్వం గృహాన్వై ప్రతి యాస్యసి ౨౩
ప్రహసిష్యంతి వీరా స్త్వాం నరా నార్యశ్చ సంగతాః
అహ మప్యత్ర సైరంధ్ర్యా ऽऽ ఖ్యాతః సారథ్యకర్మణి ౨౪
నచ శక్ష్యా మ్యనిర్జిత్య గాః ప్రయాతుం పురం ప్రతి
స్తోత్రేణ చైవ సైరంధ్ర్యా స్తవ వాక్యేన తేన చ ౨౫
కథం న యుధ్యేయ మహం కురూన్ సర్వాన్ స్థిరో భవ ౨౬

(భయమున దీనరూపుడవయితివి. శత్రువులకు హర్షవర్ధను డవు (కాకూడనివాడవు కాదా నీవు) ఇప్పటికి పరులు రణా జీయం దేమియు గావింపలేదే. కౌరవులనుగూర్చి నన్నుగొని పొమ్మని నీవు స్వయము పలికియుంటివికదా. అనే నా బహుళ ధ్వజము ఉన్నయెడకు నిన్ను గొనిపోయెదను. ఆతతాయి లగు నా కౌరవులున్న యెడకు నిన్ను గొనిపోయెదను. ప్రపంచ మెత్తివచ్చినను యుద్ధము గావింపవలసినదే. అట్లుగా స్త్రీలందు, పురుషులందు పౌరుషము వెళ్ళడించి వెడలివచ్చి యుద్ధముచేయకుందువేల నీవు. గోవులను జయింపనిది గృహ మునకు మరలిపోయినచో వీరులు ప్రహసింతురుకదా. నేను గూడ సారథ్యకర్మయందు సైరంధ్రిచే బలుకబడియున్న వాడను కదా. గోవులను జయించనిది పురమునుగూర్చి పోవుటకు శక్తు డను గాను, (వచశక్యా మ్యనిర్జిత్య గాః ప్రయాతుం పురం ప్రతి), సైరంధ్రీస్తోత్రముననుు, నీ వాక్యముననుు గూడ నేనెట్లు కౌరవులతో యుద్ధముచేయకుండువాడ నగుదును. నీవు స్థిరుడవు కమ్ము-అని పలికెను.)

"భయేన దీనరూపోపి' అనుమాట మొదట నుండుటయు 'ద్విషతాం హర్ష వర్ధన' అని వెంబడినే యుండుటయు నిందు గమనింపదగినది. 'ద్విషదాం హర్ష వర్ధన' అనునది "శత్రువులకు హర్షము కల్గించుచున్నావు" అని క్రియాపదముగా గాక "శత్రు హర్షవర్ధనుడా" అని సంబోధనముగా గాక "హర్ష వర్ధనః" అని ప్రథమావిభక్తిగా నుండుట గమనంపదగినది. "భయేన దీన రూపోసి" అని మొదట యుత్తరుని నిజపరిస్థితిని వెల్లడించి

యర్జునుడా వెంటనే "ద్విషతాం హర్ష వర్ధనః" అనినాడు. శత్రువులకు హర్ష వర్ధనుడు కా కూడనివా డుత్తరుడను పరిస్థితిని నిరూపించునదిగా నిందర్థము స్ఫురించుచున్నది. 'హర్ష వర్ధనః' అనునది మఱియు సాభిప్రాయముగా నున్నది. ఉత్తరుని సరిదిద్దుట యందెంతయేని నిదానము నిది చూపుచున్నది.

'స్వయము కౌరవులపైకి నన్ను గొనిపొమ్మంచు పలికితివి కదా. శత్రువు లింతకు నేమియు జేయనే లేదుకదా ఇట్టి పరిస్థితిలోనే దీనరూపుడవగుచు శత్రువులు నవ్వుపరిస్థితిగా తయారుకావచ్చునా'-ఇట్లని వీని (ఈ శ్లోకముల) యభిప్రాయము కాదు. అట్లయిన నిందుత్తరుని విమర్శించినట్లగును. "నీవు దీనుడవయినను నిన్ను కౌరవులకడకు గొనిపోయెదను' అనునట్టి పర్యవసాన మిట గల్గింపకూడదు. అది యోగ్యము కానేరదు, బృహన్నల ప్రయోజన మదికాదని గుర్తింపవలెను. ఉత్తరుని క్రమముగా ధీరునిగావించుటయే యర్జునని ప్రయోజన మిపుడగును. అందెంతయో యుచితత్వమున్నది

'పరులు యుద్ధరంగమున నేమియు జేయనే లేదోయి' అనిపలికి బృహన్నల తత్కాలపరిస్థితిని నెదుటనుంచినాడు. పిమ్మట యుత్తరుని యోగ్యతను దడవుచు "స్వయము నీవే కౌరవులుండుతావునకు గొనిపొమ్మని పలికితివే' అనినాడు పిమ్మట "సోహం' అని ఎత్తికొనినాడు ఇందుత్తరని యోగ్యత బృహన్నలబాధ్యత యిమిడియున్నవి. "అనేను బహుళధ్వజములున్న చోటునకు నిన్నుగొనిపోయెదను' అని సమయపోషణముగా బలికినాడు. అంతఃపురమందుత్తరుడు పలికిన బింకములను

స్మరింపజేయుచు "స్త్రీపురుషులం దట్లు పౌరుషముపలికి వెడలి వచ్చి యుద్ధము చేయనందువేల. గోవులను జయించక గృహము నకు బోయినచో వీరులు ప్రహసింతురు. పురుషులుస్త్రీలుచేరి ప్రహసింతురు అనివాడు, ఇది యుత్తరునిబింకమును స్మరింప జేయు మాటయే కాని యెకసెక్కెముచేయు మాట కాదు, అర్జునుడిపుడు నిదానము జూపుచున్నాడు. నేను గోవులను జయించెదను, యుద్ధమొనరించెదను" అని స్పష్టము వలుకువాడు కాక గోవులను జయించనిది పురమునకుబోగూడని పరిస్థితినే యర్జునుడు వెల్లడించినాడు "నచే ద్విజిత్య గా స్త్వం గృహే నై ప్రతియాన్యసి" అనునది చక్కనిమాట ఆ పని గావించువారెవ్వరో స్పష్టము గావింపనివిధముగా ప్రసంగించుట యం దెంతయో సమీచీనత్వమున్నది

బృహన్నల సారథ్యమొనరించినందున ఖాండవవనంమం దర్జునుడు సర్వభూతములను జయించినాడను రూపము పురమం దేర్పడినది. ఈ సంగతిని వెల్లడించినట్టిది సైరంధ్రి కావుననే గోవులను జయించనిది పురమునకు బోగూడనపరిస్థితి తనయందు నిల్పియున్నదని బృహన్నల స్పష్టము పలుకుచున్నాడు "న చే ద్విజిత్య" అనుమాట యుత్తరుని పరిస్థియందు. "నచ శక్యామ్య నిర్జిత్య" అనుమాట బృహన్న పరిస్థితియందు వర్తించుట గమ నింపదగినది. ఇట్లుభయబాధ్యతలు వ్యక్తీకరించి బృహన్నల కార్యమును దనయందు వర్తింపజేసికొనుచున్నాడు.

"సైరంధ్రి గావించిన స్తోత్రమున, నీ వాక్యమున గూడ నేనెట్లు కౌరవులతో యుద్ధము గావించువాడ గాకుందును.

నీవు స్థిరముగా నుండుము' అనినాడు ఇందు చిత్రముగా యుద్ధవిషయమును దనయందు వెల్లడించుచు సారథ్యవిషయము నంతర్భూతమొనర్చుచు, జిత్రముగా నీవు స్థిరుడవై యుండుము అని పలికినాడు, ఉత్తరుడు బృహన్నలతో 'సైరంధ్రీ త్వాం సమాచష్టే సాహి జానాతి పాండవాన్ అని ఘనముగా బలికి యున్నాడు (౩౭-౧౮) నేనే కౌరవులతో యుద్ధమొనర్చెదను అని స్పష్టము గావింపకుండ ఎట్లుగా యుద్ధ మొనర్పకుండు వాడను (కథం నయుధ్యేయ మహం) అనిపలుకుట మఱియు నిదానమై యొప్పియున్నది. బృహన్నల యిట్లుభయబాధ్యత లను బురస్కరించిన మాటలు పలుకగా నుత్తరుడిట్లు పలికెను.

కామం హరంతు మత్స్యానాం భూయాంసః కురవో ధనం
ప్రహసంతుచ మాం నార్యో నరావాపి బృహన్నళే ౨౭
సంగ్రామే నచ కార్యం మేగావో గచ్ఛంతు చాపి మే
శూన్యం మే నగరం చాపి పితుశ్చైవ బిభేమ్యహమ్ ౨౮
ఇత్యుక్త్వా ప్రాద్రవ ద్భీతో రథాత్ ప్రస్కంద్య కుండలీ
త్యక్త్వా మానంచ దర్పంచ విసృజ్య సశరం ధనుః ౨౯

(కౌరవులు మాత్స్యుల ధనమును గొనిపోనిమ్ము బృహన్నలా! స్త్రీపురుషులు ప్రహసించనిమ్ము. నాకు యుద్ధముతో పనికాదు. మా గోధనము పోయినను పోనిమ్ము. (ఇంకొక దానికి భయమగుచున్నది) నగర మిపుడు శూన్యమైయున్నది కావున పితాజ్ఞనుపురస్కరించుకొని భయమొందుచున్నాను. ఇట్లనుచు నుత్తరుడు మానము దర్పము త్యజించి, ధనుర్బాణములను విసర్జించి యుఱికి పాఱజొచ్చెను.)

'భయేన దీనరూపోసి' అనునది బృహన్నలావచనము 'శూన్యం మే నగరం చాపి పితుశ్చైవ బిభే మ్యహం' అనునది యుత్తరవచనమును. పోవనిమ్ము గోవులు పోయిన నేనిప్పుడు నగరమందే యుండదగును. నగరపాలనమంతయు - బాధ్యత నంతయు నాతలపై నాతండ్రియుంచి వెడలినాడు, నా తండ్రి యాజ్ఞ కిపుడు భయపడుచున్నాను-ఇట్లనుచు నుత్తరుడు పాఱ జొచ్చినాడు. విడిచిన ధనుర్బాణములు మరల చేతికి రాగలవు గాని త్యజించిన మానదర్పములు మఱివచ్చునవి కావు కావున నిచ్చోటత్యక్త్వా మానంచ దర్పంచ విసృజ్య సశరం ధనుః అని చెప్పబడినది. మానము దర్పము త్యజించినందుననే యుత్తరుడు సశరధనుస్సును విసర్జించి పాఱజొచ్చినాడను మాట యేర్పడి నది.

"ఇది శూరధర్మముకాదు క్షత్రియులు పలాయనము గావింపదగదు భీతునకు యుద్ధమందు మరణమే శ్రేయము, పలాయనముకాదు అంచు బృహన్నల పలికెను. ఇట్లుపలుకుచు నర్జునుడు రథముడిగి యుత్తరుని వెంటాడెను. పొడుగుజడ వీపున వేలాడుచుండ, తెల్లనిచీరకట్టియున్న బృహన్నల యుత్త రుని వెంట పరుగెత్తెను. జడ వ్రేలాడుచుండగా బరుగెత్తు చున్నావా డర్జునుడని తెలియని సైనికులు నవ్వజొచ్చిరి. శీఘ్ర గతిని బరుగిడుచున్న యర్జునుని గాంచి కౌరవులు వేష సంఛ న్నుడితడెవండు నివురుఁగప్పిన నిప్పువలె నున్నవాడు కొంత వఱకు పురుషుడుగను, కొంతవఱకు స్త్రీగను నున్నవాడు.

ఈతనియం దర్జునసారూప్యము గానవచ్చుచున్నది. క్లోబరూ
పుడై యితడున్నాడు. ఆ శిరము. మెడ, పరిఘబాహువులు.
ఆ విక్రాంతము చూడగా నిత డర్జునుడే కాని వేఱొకడై
యుండడు. అమరులందు దేవేంద్రుడు, మనుజులందు ధనంజ
యుడు గాక మనపై నోటిగా దలపడు వాడెవ్వడున్నాడు.
శూన్యపురమందున్న యుత్తరుడొక్కడు బాలభావమున,
పౌరుషమునగాదు. సత్రరూపమున చన్నముగానున్న పార్థు
నర్జునుని సారథిగా జేసికొని నగరమునుండి పైకి వచ్చినాడు
మనల జూడగనే భీతుడై పలాయమానుడగుచున్నాడు నిశ్చ
యము వానినిబట్టి వెంటాడుచున్నవాడు ధనంజయుడు అని
పలుకుచు కౌరవులు వేఱువేఱుగా విమర్శించుకొనుచుండిరి.
మాఱువేషముననున్న పాండవునిజూచి వారేమియు నిశ్చ
యము గావింపలేకుండిరి. అర్జునుని యీ ప్రవృత్తి (చేనము)
కౌరవులందు, కౌరవసైన్యమందు నిట్టిపంచలనము కలిగించినది
కౌరవులిట్లు తన్నుగాంచి నజ్జుగుజ్జు వడుచుండగా నర్జునుడు
నూఱడుగులుపోయి యుత్తరుని కేశపక్షమున బట్టుకొనెను.
అర్జునునిచే బట్టుబడగనే యుత్తరుడు బహుళ కృపనుడాయెను.

శృణుయా స్త్వంహి కళ్యాణి బృహన్నళే సుమధ్యా మే
నివర్తయ రథం క్షిప్రం జీవన్ భద్రాణి పశ్యతి ౪౪

(కళ్యాణి బృహన్నళా! రథమును వేగ మరలింపుము
బ్రతికియుండిన మంగళములు చూడవచ్చును. శాంతకుంభ
నిష్కము, అష్టమణులు, అలంకృతరథము. పదిమదగజములు
నిచ్చుకొందును. నన్ను విడిచి వేయుము-ఇట్లు పలుకుచున్న

యచేతనుడై యున్న యుత్తరునిజూచి యర్జునుడు నవ్వి రథ సమీపమునకు గొనివచ్చెను.

అథైన మబ్రవీ త్పార్థో భయార్తం నష్టచేతనం
యది నోత్సహసే యోద్ధుం శత్రుభిః శత్రుకర్షణ ౪౮
ఏహి మే త్వం హయాన్ యచ్ఛ యుధ్యమానస్య శత్రుభిః
ప్రయాహ్యేత ద్రథానీకం మద్బాహుబలరక్షితః ౪౯
అప్రధృష్యతమం ఘోరం గుప్తం వీరై ర్మహారథైః
మాభై స్త్వం రాజపుత్రాగ్ర్య క్షత్రియోఽసి పరంతప ౫౦
కథం పురుషశార్దూల శత్రుమధ్యే విషీదసి
అహంవై కురుభి ర్యోత్స్యే విజేష్యామిచ తే పశూన్ ౫౧
ప్రవిశ్యైత ద్రథానీక మప్రధృష్యం దురాసదం
యత్తో భవ నరశ్రేష్ఠ యోత్స్యేఽహంకురుభి స్సహ ౫౨

---

ఏవం బ్రువాణో బీభత్సు ర్వైరాటి మపరాజితః
సమాశ్వాస్య ముహూర్తం త ముత్తరం భరతర్షభ ౫౩
తత ఏనం విచేష్టంత మకామం భయపీడితం
రథ మారోపయామాస పార్థః ప్రహరతాంవరః ౫౪

(పిమ్మట భయార్తుడు, నష్టచేతస్కుడునగు నుత్తరుని గాంచి యర్జునుడిట్లనెను. శత్రుకర్షణ నీవు శత్రువులతో యుద్ధముచేయ నుత్సహింపనిచో శత్రువులతోబోరాడు నాకు నీవు గుఱ్ఱములను బట్టుము. మద్బాహుబలరక్షితుండవగుచు నీ రథానీకమును ప్రవేశింపుము. ఈ సైన్యము అప్రధృష్యమైనది ఘోరమైనది. మహారథులగు వీరులచే గుప్తమైనది, కానిమ్ము

రాజపుత్రాగ్ర్యుడా పరంతపుడా। క్షత్రియుడవు, భయపడకుము. పురుషశార్దూల। శత్రుమధ్యమం దెట్లుగా విషాద మొందెదవు. నేనే కౌరవులతో బోరాడెదను. నీ పశువులను జయించెదను. అప్రధృష్యము, దురాసదమునగు నీ రథానీకమును నీవు ప్రవేశింపుము, నీవు యత్నపరుడవగుము. కౌరవులతో నేను యుద్ధమొనరించెదను. అర్జును డిట్లు పలుకుచు నుత్తరుని ముహూర్తకాల మోదార్చెను. విచేష్టుడు, అకాముడు, భయపీడితుడునై యున్న యుత్తరుని ప్రహరతాంపరుడగు నర్జునుడు రథమెక్కించెను.)

"నోత్సహే కురుభి ర్యోద్ధుం' అని యుత్తరుడు పలికి యున్నాడు. ఆమాటనే యర్జునుడును పలికి యుత్తరుని సరి చేయుచున్నాడు. 'యది నోత్సహాసే యోద్ధుం' అనినాడు. "శత్రుభిః శత్రుకర్షణ' అనుమాటలు సాభిప్రాయముగానున్నవి. "శత్రువులను చెండాడువాడా రమ్మ' అనినాడు.

"ఏహి మే త్వం హయాన్ యచ్ఛ యుధ్యమానస్య శత్రుభిః" అని చిత్రముగా నర్జునుడనినాడు 'నేను యుద్ధము చేయుదును నీవు సారథ్యము చేయుము. అనుటకంటె శత్రువులతో బోరాడు నాతోడవచ్చి గుఱ్ఱములను పట్టుము' అనుట సొగసైనవచనము. అంతకన్న రసముగా ప్రయాహ్యేత ద్రథానీకం మద్బాహుబలరక్షితః అనినాడు "నాబాహుబలముచే నిన్ను రక్షించెదను. ఈ రథానీకమును ప్రవేశింపుము" అనుటకంటె మద్బాహుబలరక్షితుడవై రథానీకమందు బ్రవేశింపుము

అని పలుకుట యుదారమైనది. ఉత్తరునిచౌరవము నిందుమిళితమై యుండగలదు.

"అప్రధృష్యతమం ఘోరం గుప్తం వీరై ర్మహారథైః" ఈ పాదము గంభీరార్థయుక్తమైనది "ప్రయాహ్యేత ద్రథానీకం మద్బాహుబలరక్షితః "అను ముందుపాదముతో జేరి కర్తవ్య విశిష్టతను వ్యక్తీకరించుచున్నది. "మాభై స్త్వం రాజపుత్రాగ్ర్య క్షత్రియోసి పరంతప," అను తరువాయి పాదముతో జేరి ఆ కర్తవ్యమును వ్యక్తీకరించుచున్నది. "భయ మొందకుము, రాజపుత్రాగ్రగణ్యాంత నీవు క్షత్రియుండవు. పరంతపుడవు' అని యుత్తరుని బ్రశంసించిపలికినా డర్జునుడు. చౌరశక్యముకాని ఘోరసైన్య మదియయ్యు మద్బాహుబలరక్షితుడవై యందు బ్రవేశింపుము. నీవు పిరుండవు, వీరవంశజాతుండవు అని యర్జునుడు పలికినట్లయినది. · "నీవు విషాద మొందవచ్చునా-విషాద మొంద కూడదు' ఇట్లుపలుకుట గాంభీర్యవచనము కాదు.

"కథం పురుషశార్దూల శత్రుమధ్యే విషీదసి (శత్రువుల మధ్యలో నెట్లు విషాదమొందువాడ వగుదువు, నీవంటివాడు) అనినాడు. "కథం" అను పద మాదియందుండుట గమనింపదగినది. అట్లుకాకూడనివా డుత్తరుడని మర్యాదను పోషించు వచనముగానిది నిలుచుచున్నది.

"నేనే కౌరవులతో యుద్ధము చేయుదును. నీ పశువులను జయించెదను" అనినా డర్జునుడు "విజేష్యామిచ తే పశూన్" అని యర్జునుడు జయ ముత్తరసంబంధముగా బలుకుట

యోగ్యముగానున్నది "యుద్ధముచేయుటకు నీకు శక్తిలేనిచో మానివేయుము, నాతో నీవు రమ్ము. నేనే యుద్ధముచేయుదును. గోవులను జయించెదను. నా వెంటనుండుము' అని యర్జునుడు పలుకలేదు. ఇది అల్పప్రసంగ మగును 'మద్బాహుబల రక్షితుడవై కురుసైన్యమును ప్రవేశింపుము. నేను యుద్ధమొనరించెదను. నీ పశువులను జయించెదను" అని యర్జునుడు పలుకుట గమనార్హమైనది, అర్జునునితోబాటుత్తరునకు నందు దగుపాలు కల్గించియర్జునుడు పలికినాడని యభిప్రాయము.

"బహుప్రవీర మత్యుగ్రం దేవైరపి దురాసదం" అని యుత్తరుడు పలికినాడు. "అప్రధృష్యతమం ఘోరం గుప్తం వీరైర్మహారథైః' అని యర్జునుడు పలికినాడు. ఉత్తరుడు నర్జునుడు కౌరవసైన్యమును గూర్చి యిట్లు పలికియున్నారు. కౌరవసైన్యమిట్టిదేయైనను సాహసించి యందు బ్రవేశింపదగును. ప్రవేశింప సాధ్యమని, యది యవసరమని, యర్జునుడిప్పుడు పలుకుచున్నాడు.

"ప్రవిశ్యైత ద్రథానీక మప్రధృష్యం దురాసదం' అని యర్జునుడు పలికినాడు. ఉత్తరుని మాటయందున్న 'దే వైరపి దురాసదం' అనుదానిలోని 'దేవైరపి' అనునది యర్జునుడు మినహాయించినాడు, మఱియు దనమాటయందున్న 'అప్రధృష్యతమం' అను దానిలోని 'తమం' అనునది మినహాయించినాడు. ఇట్లు పలికి యర్జునుడు తమకా కౌరవసైన్యము జొరదగునదేయని పటిష్ఠముగా బలికినాడు. ఉత్తరునకును నందు దగు ప్రవృత్తి యుండనేయున్నదని యర్జునుడు మాటనేర్పఱచినాడు. 'యత్తో

భవ సర్వశ్రేష్ఠ యోత్స్యేహం కురభి స్సహ' అని పలికినాడు. అర్జును డిటుపలుకుచు నుత్తరుని ముహూర్తకాల మోదార్చెను. పిమ్మట విచేష్టుడు, అకాముడు, భయపీడితుడునగు నుత్తరు నర్జునుడు రథ మెక్కించెను.

తం దృష్ట్వా క్లీబవేషేణ రథస్థం నరపుంగవం
శమీకాభిముఖం యాంతం రథ మారోప్య చోత్తరమ్ ౩౯-౧
భీష్మద్రోణముఖా స్తత్ర కురవో రథిసత్తమాః
విత్రస్తమనస స్సర్వే ధన ంజయకృతా ద్భయాత్ ౨
తా నవేక్ష్య హతోత్సాహా నుత్పాతానపి చాద్భుతాన్
గురుః శస్త్రభృతాం శ్రేష్ఠో భారద్వాజో ఽ భ్యభాషత
చండాశ్చ వాతాః సంవాంతి రూక్షాః శర్కర వర్షిణః
భస్మవర్ణ ప్రకాశేన తమసా సంభృతం నభః ౪
యాదృశా న్యత్ర రూపాణి సందృశ్యంతే బహూనిచ
యత్తా భవంత స్తిష్ఠంతు సాధ్వసం సముపస్థితమ్ ౫
రక్షధ్వ మపి చాత్మానం వ్యూహధ్వం వాహినీ మపి
వైశసంచ ప్రతీక్షధ్వం రక్షధ్వం చాపి గోధనమ్ ౬
ఏష వీరో మహేష్వాస స్సర్వశస్త్రభృతాంవరః
ఆగతః క్లీబవేషణ పార్థో నా స్త్యత్రసంశయః ౯
[*] నదీజ లంకేశ వనారికేతు ర్నాగాహ్వయో నామ నగారిసూనుః
ఏషోంగనా వేషధరః కిరీటీ జిత్వా వయం నేష్యతి చాద్య గా వః ౧౦

---

[*] "లంకేశ వనారి కేతుః" లంకేశుడగు రావణుని వన మశోకవనము ఆ యశోకవనమును ధ్వంసముగావించిన వాడు

స ఏష పార్థో విక్రాంత స్సవ్యసాచీ పరంతపః
నాయుద్ధేన నివర్తేత సర్వైరపి సురాసురైః ౧౧
క్లేశితశ్చ వనే శూరో వాసవే నాపి శిక్షితః
అమర్ష వశమాపన్నో వాసవప్రతిమో యుధి ౧౨

నేహా౽స్య ప్రతియోద్ధార మహం పశ్యామి కౌరవాః ౧౩

మహాదేవోపి పార్థేన శ్రూయతే యుధి తోషితః
కిరాతవేషప్రచ్ఛన్నో గిరౌ హిమవతి ప్రభుః ౧౪

(క్లీబవేషమున రథస్థుడగు నరపుంగవు నర్జునుని కౌరవులు గాంచిరి. ఉత్తరుని రథమెక్కించి శమీకాభిముఖముగా బోవుచున్న యా యర్జునునిజూచి భీష్మద్రోణముఖులగు కౌరవులు-వారందఱు ధనంజయకృత భయమున విత్రస్తమనస్కు-

హానుమంతుడు, ఆ హనుమంతుడు ధ్వజముగాగలవా డర్జునుడు ద్రోణుడిట్లు భీష్మునితో బలుకుటయం దొకవిశేషము సువ్యక్తమగుచున్నది. రామాయణభారత యుద్ధములందు జాల్గొనిన వాడు హనుమంతుడు లంకలో హనుమంతుడు ప్రవేశింపగా రావణాదుల వినాశ మారంభమైనది. గోహరణరంగమున హనుమంతుడు ప్రవేశింపగా గౌరవవినాశ మారంభమైనది, అట్టి విజయధ్వజుండు విజయుండను విశేష మిందు ధ్వనించుచున్నది. విధానములోను, కూర్పులోను, అనేకవిషయములలో ననేక విధములుగా రామాయణ భారతములకు బెక్కుసాదృశ్యవిశేషములు గలవు. వానిని గమనించి రెండు గ్రంథములు పఠించిన కొలంది మఱియు మఱియు విశేషములు, రసములు వెల్లివిరియుచుండును.

లై రి. హాతోత్సాహులై యున్న వారలను. అద్భుతములగు నుత్పాతములను గాంచి శస్త్రభృహ శ్రేష్ఠుడగు ద్రోణుడిట్ల నెను. సుడిగాడ్పులు వచ్చుచున్నవి, రాలవాన గురియుచున్నది. భస్మవర్ణ ప్రకాశమై యాకాశము తమస్సుచేవృత్తమైయున్నది. మేఘములు రూక్షవర్ణములై యద్భుతదర్శనములుగా నున్నవి. కోశములనుండి విశిధశస్త్రములు జాఱుచున్నవి. నక్కలు దిక్కులం దఱచుచున్నవి గుఱ్ఱములు కన్నీరు గార్చుచున్నవి. ధ్వజములు కంపించుచున్నవి. ఇట్టి దృశ్యములు బహువుగా గానవచ్చుచున్నవి యత్నపరులై యెల్లవారు నుండదగును. సాధ్వసము సముపస్థితమైయున్నది ఆత్మరక్షణ మొనర్చు కొనుడు వాహినీవ్యూహ మొనరింపుడు వైశసమును (హానిని) బ్రతీక్షింపుడు. గోధనమును రక్షింపుడు, ఈ వచ్చియున్నవీరుడు సర్వశస్త్రవ్వరుడైన యర్జునుడే, క్లీబవేషమున వచ్చియున్నా డితడు, నిస్సంశయము. నదీజః లంకేశవరారి కేతువు హనుమ ద్ధ్వజుడు) వచ్చియున్నాడు. నగారిసూను డితం డంగనా వేషమున వచ్చినవాడు. కిరీటియే యితండు విజమంది గోవులను మరలించి గొనిపోగలడు, సురాసురులందఱు నెత్తి వచ్చినను యుద్ధముగావించికాని మరలువాడుకా డీసవ్యసాచి, క్లేశమొందించబడిన యీశూరుండు వాసవశిక్షితుండై యున్నాడు అమర్ష వశమైనవా డీతండు యుద్ధరంగమున వాసవప్రతిముడు. కౌరవులారా! ఇతనితో ప్రతియుద్ధమొనర్చువారిని చూడ జాలకున్నాను. మహాదేవుడు కూడ కిరాతవేషప్రచ్ఛన్నుడై

హిమవత్తమం దీతనితోడి యుద్ధమున సంతోషింపజేయబడినాడని వినవచ్చుచున్నది.)

పరాజయమెఱుంగనివారు భీష్మద్రోణులు, ధనంజయ కృత భయమున నట్టివారును విత్రస్తమనస్కు లగుచుండిరి. భయపడియున్న యుత్తరుని ధీరునిగావించుకొనుచున్న యర్జునుని జూడగనే కౌరవులందఱు హతోత్సాహులయిరి కౌరవ సైన్యమును గాంచి యుత్తరుడు భయమొందినది సరి, ధనంజయు నొక్కనిగాంచి కౌరవప్రవీరులందఱు భయమొందుచుండుట సామంతమైనది. జయముకన్న నిది యర్జునునకు కీర్తికరమైనది. అర్జును డిపు డుత్తరున కుత్సాహము కల్గింపగలుగుచున్నాడు. అ యర్జునుని జూడగనే కౌరవవీరులు హతోత్సాహులైరి. వారికపుడు మఱియుత్సాహము చేకూరదని యభిప్రాయము. ఇప్పటికి భయ ము త్తరునకు గౌరవులకు గూడ గలదు. కాగా యుద్ధమం దుత్సాహము గల్గినవాడు పార్థు డొక్కడే యని యభిప్రాయము. అజ్ఞాతవాస పరిసమాప్తిదినమున పాండవు లాయుధములుంచిన చోటునకు గౌరవులు చేరుట విధికృతము అపుడు హతోత్సాహులై యున్న కౌరవులను నద్భుతముగా దోచుచున్న యుత్పాతములను గాంచి ద్రోణుడు 'అయత్తులై యుండుడు' (యత్తా భవంత స్తిష్ఠంతు) అని పలికినాడు. ఎల్లవా రాత్మరక్ష గావించుకొనుడంచు ద్రోణుండు వచించుట తెలియందగుమాట యగుచున్నది. దుర్యోధనుడు తనరక్ష తానే కాపించుకొనవలయునని యిందు సూచితమగుచున్నది.

ద్రోణు డిది మొదటి విషయముగా బలికి పిమ్మట వ్యూహమును చూడుడు, కీడునగానమనింపుడు, గోవులను గాపాడుడు, అని క్రమమును బలికినాడు, దుర్యోధనరక్ష (రాజరక్ష) మొదట. గోరక్షణము చివర ద్రోణుడు పలుకట గమనింపదగినది ప్రతి వానికి నెసరుగల్గునట్టి యుద్ధ మపుడేర్పడగలదని సూచించుచు ద్రోణుడు గోరక్షణభారమును దెలియజేసినాడు. అతడు కీడు విషయమును సూచించుచు గోరక్షణవిషయమును పలుకుట సాభిప్రాయమైయున్నది. "ప్రాణములను దక్కించుకొనిన నదియే కార్యము" అని ద్రోణుడు వచనపరిస్థితిని గల్గించినాడు.

ద్రోణు డర్జునునిగూర్చి వరుసగా నీ మాటలు పలికినాడు. అర్జును డెదుట నిలుచుట పలికినాడు. (సర్వశస్త్రభృతాంవరః) హనుమద్ధ్వజుడు. కిరీటియగు నగారిసూనుని యుద్ధజయమును పలికినాడు. ఎందఱెత్తివచ్చినను వెనుదీయక పోరాడు మొక్కవోని సవ్యసాచి విక్రాంతమును పలికినాడు. వనమందు క్లేశ మొందింపబడిన శూరుడు వాసవశిక్షితుడగుట తెల్పినాడు. అమర్షవశాపన్నుడై యున్న యర్జునుడు రణరంగమందు వాసవ ప్రతిముడని పలికినాడు.

ఇట్లుగా నర్జుననిగూర్చి విస్తారప్రసంగ మొనరించి ద్రోణుడు "నేహాస్య ప్రతియోద్ధార మహం పశ్యామి కౌరవాః" (కౌరవులారా! ఇతనితో బ్రతియుద్ధ మొనర్పగలవానిని నేను చూడలేదు.) అను నిదానవచనము పలికినాడు. "ఇతనితో బ్రతియుద్ధ మొనర్చువాడు లేడు"- ఇట్లనినచో కౌరవులను జిన్నపుచ్చినట్లగును. ద్రోణు డట్లుపలుకువాడు కాడు. ఇత

నితో ప్రతియుద్ధ మొనర్చువానిని నేను జూడలేదు' అని ద్రోణు డనినది తత్పరిస్థితిని తెల్పునది యగుచున్నది "కౌరవులారా మనకార్యము తెలిగిపుడు మన మరయదగినది' అని ద్రోణుని వచనగౌరవమగుచున్నది కౌరవులీమాట నట్లుగా గ్రహించు వారు కాలేదు. "మనలబిలిచి యవమానించుచున్నాడు. ద్రోణుడు, అర్జునపక్షపాతి యితడు" అని తలంచువారైరి. మంచిమాట చెడ్డమాట దగ్గఱదగ్గఱగా నుండును. ద్రోణుని యీ యథార్థకథనమును చెడ్డగా గ్రహించువారైరి కౌరవులు. విస్మరమైనను ద్రోణుడు నిజమాడి కార్యగతిని గల్గింపదలంచి నాడు.

"ప్రతి యోద్ధారశక్ష్యామి" అని యుత్తరు డనినాడు (౩౯-౧, "నేహాస్య ప్రతియోద్ధార మహం పశ్యామి కౌరవాః' అని ద్రోణుడు పలికినాడు. అర్జును డుత్తరుని ధీరునిగావించి కొని కౌరవులెదిరింపజాలని ఘోరసంగ్రామ మొనర్చువాడై విలసిల్లినాడు. అర్జునుని పరమసామంతము నిది యెంతయేని వెల్లడించుచున్నది. ఉత్తమసమ్మతుడు, ధర్మయుద్ధమొనర్చు వాడునగు నర్జునుని పరాక్రమవిశేషమును ద్రోణుడిట్లు తుదిగా ప్రశంసించినాడు "మహాదేవుడును నితనితోడియుద్ధమున సంతోషింప జేయబడినాడని వినవచ్చినది" అనినాడు (శ్రూయ తేహి మహాదేవో పార్థేన యుధి యోషితః) "అర్జునుడు మహాదేవుని జయించెను" అని కాని, "మహాదేవు డర్జునుని కోరెను అనిగాని-ఇట్టిమాట ద్రోణుడు పలుకువాడుకాడు,

గురుడగు ద్రోణుడర్జునపరాక్రమమునకు హర్షము వెల్లడించుచు నది కార్యావసరమందే (కార్యగతియందే) పర్యవసించి నాడు. "శ్రూయతే' అనుమాట యుచితస్థలమున నమరియుండి సత్త్వ భావమును వెల్లడించుచున్నది ఏర్పడిన పరిస్థితిని గమనించి ద్రోణుడర్జునుని గూర్చినమాట నిట్లు పలుకగా గర్ణుడిట్లనెను.

సదా భవాన్ ఫాల్గునస్య గుణై రస్మా న్వికత్థసే
న చార్జునః కళాంపూర్ణో మమ దుర్యోధనస్యచ ౧౫

(సదా మీరు ఫాల్గుణుని గుణములనే మమ్ములనుగూర్చి పలికెదరు. (వికత్థసే) నాకుగాని, దుర్యోధనునకుగాని యర్జునుడు కళాపూర్ణుడేకాడు, పదహారవవంతుకూడ సాటి కాడు. అనెను.)

ద్రోణుడర్జునుడెదురైనందున కల్గిన కార్యవచనము పలుకగా గర్ణుడది యర్జునప్రశంసగామాత్రమే గొని విపరీతము పలికినాడు. కర్ణుడు తన్ను, దుర్యోధనునిమాత్రమే (వారుభయులే ప్రధానులు, చేవగల్గిన వారని) ప్రశంసించి పలికినాడు ఇది రాజగౌరవము, రాజభక్తి పురస్కృతమగు మాటయని కర్ణుని భావము (కర్ణుని నైజము,) కాని మన్యువృతస్కంధుడన దగు కర్ణుడు ద్రోణ ప్రసంగమునంతయు ధృణీకారమొనర్చుచు బలికినాడు. యోధులనెల్ల నలక్ష్యమొనర్చువాడై ఈ మాట పలికినాడు. ద్రోణుడు వచించినదే రాజభక్తి పురస్కృతమగు మాటయగును మఱియు రాజరక్షణవిషయకమగు జాగ్రత్తనే యాతడాదిగా సూచించువాడయినాడు. ద్రోణుడర్జునప్రశంస

గావించువాడే యైనను కర్ణవచనము దుష్టవచనమే, అహం కార పూరిత వచనమే యది యగును,

యద్యేష పార్థో రాధేయ కృతం కార్యం భవేన్మమ
జ్ఞాతః పునశ్చరిష్యంతి ద్వాదశాబ్దాన్ విశాంపతే ౧౬
అథైష కశ్చిదేవాన్యః క్లీబవేషేణ మానవః
శరైరేవం సునిశితైః పాతయిష్యామి భూతలే ౧౭
తస్మిన్ బ్రువతి తద్వాక్యం ధార్తరాష్ట్రే పరంతప
భీష్మో ద్రోణః కృపో ద్రౌణిః పౌరుషం తదపూజయన్ ౧౮

(రాధేయ ! వచ్చినవాడర్జునుడేయగుచో నాకార్యమిపుడేయైనది. విశాంపతీ! తెలియబడినవారై (పాండవులు) మరలపండ్రెండువత్సరములు వనములగూర్చి పోవలసియున్నది, అట్లుగాక నీక్లీబవేషమనున్న వాడు వేఱొకఁడగుచో సునిశిత శరములచే భూతలమందు బడవేయుదును-అని దుర్యోధనుడు పలుకగా భీష్ముడు, ద్రోణుడు, కృపుడు. అశ్వత్థామ యాతని పౌరుష (వచనమును) గొనియాడిరి.)

పాండవుల కాయష్టమినాటికి వనవాసాజ్ఞాతవాసములు సంపూర్తియైనవని దుర్యోధనునికి దెలియలేదని యిందువలన దెల్లమగుచున్నది. సౌరమానముప్రకారమింకను ౫ నెలల ౧౨ రోజులు వ్యవధానము గల్గిన దాదినము. పాండవులు విచిత్రముగా నీ దినములను లెక్కించి వనవాసాజ్ఞాతవాసములు ముగించియున్నారు. అందువలన దుర్యోధనుడిట్లు తలంచు వాడయినాడు.

తాం శమీ ముపసంగమ్య పార్థో వైరాటి మబ్రవీత్
సుకుమారం సమాజ్ఞాయ సంగ్రామే నాతికోవిదమ్ ४०-౧
సమాదిష్టో మయాశీఘ్రం ధనూంష్యవహ రోత్తర
నేమానిహి త్వదీయాని సోఢుం శక్ష్యంతి మే బలమ్ ౨

భారం వాపి గురుం వోఢుం కుంజరాశ్వాన్ ప్రమర్దతః
మమవా బాహువిక్షేపం శత్రూ నిహ విజేష్యతః ౩
తస్మా ద్భూమింజయారోహ శమీ మేతాం పలాశనీం
అస్యాంహి పాండుపుత్రాణాం ధనూంషి నిహితా న్యుత ౪
యుధిష్ఠిరస్య భీమస్య బీభత్సో ర్యమయో స్తథా

ధ్వజా శ్శరాశ్చ శూరాణాం దివ్యాని కవచానిచ ౫

(శమీవృక్షమును సమీపించి యర్జునుడు సంగ్రామరంగమం దతికోవిదుండుకాని యుత్తరకుమారుని గాంచి యిట్లనెను. "ఈ వృక్షముపై పాండవుల ధనుస్సు లున్నవి యుధిష్ఠిరుడు. భీముడు. బీభత్సుడు, యములు-వీరిధనస్సు లున్నవి. ఈ నీసంబంధమగు ధనుస్సు నా బాహు విక్షేపమునకు సరివచ్చియుండదు. కుంజరాశ్వమర్దనమం దతిపటిష్ఠము కాదు. ఈ వృక్షమందు శూరులగు పాండవుల ధ్వజములు, కవచములున్నవి. కావున నీ చెట్టు నెక్కుము-అని పలికెను.)

"ఈ ధనుర్బాణములు నీ కొలదిపి' ఇట్లుపలికిన ఉత్తరని విమర్శించినట్లగును. (చిన్నబుచ్చినట్లగును) కౌరవుల భీమకార్ముకముల జూచి జంకియున్న యుత్తరున కిపుడు గాండీవము చూపించి సరిచేయుయత్న మర్జునుడు గావించు

చున్నాడు. ఆ యుత్తరునిధనస్సుతో నాఘోరసంగ్రామజయ మేర్పడునదికాదని యర్జునుడు వెల్లడించుటయే ఈ మాటలం దేర్పడియున్న నిదానము. కావున నర్జునుడు గాండీవము నిట్లు ప్రశంసించి పేర్కొనినాడు.

అత్ర చైత న్మహావీర్యం ధనుః పార్థస్య గాండివం
ఏకం శతసహస్రేణ సంమితం రాష్ట్రవర్ధనమ్ ౬
వ్యాయామసహ మత్యర్థం తృణరాజసమం మహత్
సర్వాయుధమహామాత్రం శత్రుసంబాధకారకమ్ ౭
సువర్ణవికృతం దివ్యం శ్లక్ష్ణ మాయత మవ్రణమ్
అలం భారం గురుం వోఢుం దారుణం చారుదర్శనమ్ ౮

(ఇందు మహావీర్యంబగు నర్జునుని గాండీవ మున్నది. లక్షధనుస్సుల కెనవచ్చునట్టి దది, రాష్ట్రవర్ధనమైనది. అత్యర్థ వ్యాయామము. తృణరాజసమమైన దది. సర్వాయుధ మహామాత్రము. శత్రుసంబాధకారకము నైనదది. సువర్ణవికృతము, దివ్యము, శ్లక్ష్ణము, ఆయతము, అవ్రణము నైనది యాగాండీవము. దారుణము, చారుదర్శనము నగు నాగాండీవమేనాకు ఘోరసంగ్రామమందు సరివచ్చునట్టిది. అని యర్జునుడు పలికెను.)

అర్జునుడు పాండవుల పేళ్ళు రెండుపర్యాయములు చెప్పినాడు. యుధిష్ఠిరస్య భీమస్య బీభత్సో ర్యమయో స్తథా' అని పాండవనామము లుచ్చరించుట గమనింపదగినది. 'ఈ వృక్షమందు శవము కట్టబడియున్నదని వినియుంటిని. రాజపుత్రుడ నగు నే నది యెట్లుతాకగలను, బృహన్నలా ! యీ వ్యవహార్య మెట్లు గావింపగలవాడను. అని యుత్తరుడు

పలుకగా బృహన్నల "రాజేంద్ర! ఈ వ్యవహార్యమున నీవు శుచిమం తుడవగుదువు. మనస్వులగు మత్స్యరాజుల దాయాదివగు నిన్ను నృపాత్మజ! నిందితకర్మ గావింప జేయుదునా' అని పలికెను. అపు డర్జునుని శాసనము ప్రకార ముత్తరుడు వృక్షాగ్రమునకు బోయి యాయాయుధములమూటను విప్పెను. గ్రహముల యుదయ మందలి కాంతివలె వెలుంగుచున్న గాండీవమును మఱినాల్గు ధనుస్సుల నుత్తరుడు దర్శించి హృష్టరోముడై, భయో ద్విగ్నుడై క్షణ మట్లుండిపోయెను, బృహద్భానుమంతములగు నా యాయుధములను స్పృశించుచు నుత్తరు డవి యెవ్వరెవ్వ రివని యడిగెను. [*] నన్ను మొదట నీవడిగినదే లోకవిశ్రుత మగు నర్జునుని పరమాయుధము గాండీవము. అని యర్జునుడు గాండివమహిమను ప్రపంచించెను. ఉత్తరుడడిగిన వరుసను భీమ యుధిష్ఠిర నకులసహదేవుల ధనుస్సులను వివరించెను, ఉత్తరుడు 'సువర్ణవికృతములగు నమ్మహాత్ముల యాయుధము లిచ్చట నున్నవి, అ యర్జునుం డేడి, యుధిష్ఠిరుండేడి, నకులసహదేవులు భీమసేనుడు నెచ్చట నున్నవారు. అందఱు మహాత్ములు, అమి త్రనాశకులు. రాజ్య మక్షమందు బోగొట్టుకొని వారలెచ్చోటనుం డునది తెలియవచ్చుట లేదు- స్త్రీరత్నమని విశ్రుతయైన పాంచాలి ద్రౌపది యెచ్చట నున్నది జూదమందోడిపోయిన పిమ్మట ద్రౌపది వారినే యనుసరించి యడవులకు బోయినది.' అనెను. అపుడర్జును డిట్లుపలికెను.

అహ మస్మ్యర్జునః పార్థః సభాస్తారో యుధిష్ఠిరః
వల్లవో భీమసేనస్తు పితు స్తే రసపాచకః ౪౪-౨

[*] యన్మాం పూర్వ మిహాపృచ్ఛః శత్రుసేనాపహారిణం
గాండీవ మేత త్పార్థస్య లోకేషు విదితం ధనుః ౪౩-౧

అశ్వ బంధో ఽ థ నకుల స్సహదేవస్తు గోకులే
సైరంధ్రీం ద్రౌపదీం విద్ధి యత్కృతే కీచకా హతాః ౨

---

యేన దేవాన్ మనుష్యాంశ్చ పార్థో విజయతే మృధే ౩
దేవదానవ గంధర్వైః పూజితం శాశ్వతీస్సమాః ౪
ఏత ద్వర్ష సహస్రంతు బ్రహ్మా పూర్వ మధారయత్
తతో ఽ నంతర మే వాథ ప్రజాపతి రథారయత్ ౫
త్రీణి పంచశతంచైవ శక్రో ఽ శీతించ పంచచ
సోమః పంచశతం రాజా తథైవ వరుణ శ్శతమ్ ౬
పార్థః పంచచషష్టించ వర్షాణి శ్వేతవాహనః
మహావీర్యం మహాదివ్య మేత ద్ధను రను త్తమమ్ ౭
ఏత త్పార్థ మనుప్రాప్తం వరుణా చ్చారుదర్శనం
పూజితం సురమర్త్యేషు బిభర్తి పరమం వపుః ౮
సుపార్శ్వం భీమసేనస్య జాతరూపగ్రహం ధనుః
యేన పార్థోఽజయత్కృత్స్నాం దిశం ప్రాచీం పరంతపః ౯
ఇంద్రగోపక చిత్రంచ యదేత చ్చారుదర్శనం
రాజ్ఞో యుధిష్ఠిర స్యైత ద్వైరాటే ధను రుత్తమమ్ ౧౦
సూర్యా యస్మింస్తు సౌవర్ణాః ప్రకాశంతే ప్రకాశినః
తేజసా ప్రజ్వలంతో వై నకుల స్యైత దాయుధమ్ ౧౧
శలభా యత్ర సౌవర్ణా స్తవనీయవిచిత్రితాః
ఏత న్మాద్రీసుత స్యాపి సహదేవస్య కార్ముకమ్ ౧౨

(నేనే యర్జునుడను, సభాస్తారుడే యుధిష్ఠిరుడు, నీ తండ్రికి రసపాచకుడు వల్లవుడే భీముడు, అశ్వబంధుడే నకులుడు,

గోకులమందున్నవాడే సహదేవుడు, సైరంధ్రియే ద్రౌపది ఆమెనిమిత్తముగనే కీచకులు హతులైయున్నారు' అని పలికెను.

గోపాథ్యతుడు "పాండవు లందర్జునునట్లు నీ విపు డీరాష్ట్రమునకు బరమగతివైయున్నావు" అని యుత్తరునితో బలికినాడు, ఉత్తరుడు "స్వయ మర్జును డే మనల బాధించుచున్నాడా యని నా పరాక్రమమును గౌరవు లివుడు చూచెదరు" అని బింకము పలికియున్నాడు. కావున నుత్తరున కర్జునునందు స్థిరమగు దొడ్డయభిప్రాయము గలదని తెల్లమగుచున్నది, భీష్మద్రోణాదుల ధనస్సులకంటె ఘనమైన యర్జునుని గాండీవ మిపు డుత్తరుని హస్తమందున్నది, మఱియు వంశగౌరవ మిపు డుత్తరుని మనమందు వర్తించియున్నది, ఉత్తరుడు ధీరుండగుట కది తగిన సమయముగా (అదునుగా) నపుడున్నది. అందువలన నర్జును డుత్తరునిగుండెలలోనికి దిగిపోవుమాట "నేనే యర్జునుడను" అని పలికినాడు. గాండీవ ముత్తరునిహస్తమందున్నది, గాండీవధన్వు డెదుటనున్నాడు. ఉత్తరుడు దిట్టయగుట కీసన్నివేశ మపూర్వమైనది. ఇది పరిస్థితి గావుననే యర్జునుడు ముందుగా దన్నే వ్యక్తీకరించుకొని పిమ్మట నన్నదమ్ములగుఱించి వ్యక్తమొనరించినాడు, మఱియు ద్రౌపది గుఱించి వ్యక్తీకరించుచు "ఆ సైరంధ్రి నిమిత్తముగా గీచకులు హతులైనారు' అని పలికినాడు. కీచకులు హతులైన విషయము భీముని యొద్దపలికిన నది సోత్కర్ష వచనము

కాగలదు అర్జునుడు సోత్కర్షను పలుకువాడు కాడు. ద్రౌపది యొద్ద నామాటపలికిన నది కార్యవచనము కా గ ల దు. "ద్రౌపది భీముని (ఒకభర్తను) ప్రోత్సహించుపంపి కీచకుల హతులగునటుల జేసినది అర్జునుని (మఱియొకభర్త నిపుడు) ప్రోత్సహించిపంపినది. ఇచ్చట గానున్న ఘోరాజిని గాంచుము' అను ధైర్యోత్సాహవచన మిది కాగలదు అర్జును డిట్లుచి తముగా దమ్మెఱిగించెను. "నీకు పదిపేళ్లు గల వని వింటిని, వానిని దెల్పుము" అని యుత్తరుడు తత్క్షణము పలుకగా నర్జునుడు తన పదిపేళ్లు దెల్పెను.

అర్జునః ఫాల్గునో జిష్ణుః కిరీటీ శ్వేతవాహనః
బీభత్సు ర్విజయః కృష్ణః సవ్యసాచీ ధనంజయః ౪౪-౧౦

అర్జును డిట్లు "అర్జునుడు" అను నామముతో ప్రారంభించి తన పది పేళ్లు పలుకగా నుత్తరుడు "ఎందువలన విజయుడ వయితివి' అను సమయోచితవచనము పలికినాడు. విజయసిద్ధిని గూర్చిననామమును ముందుగా వ్యక్తీకరింపుము అని యుత్తరుడు వచించినట్లయినది, అర్జును డపుడు తన పది పేళ్లను 'ధనంజయుండను' నామ మాదిగా వివరించువాడయినాడు. పశువులకు సొమ్ములను వ్యవహారముగలదు. పశువులను జయించునది యాసందర్భముగాన ధనంజయశబ్దము నే యర్జునుడు తొలిగా వివరించువాడయినాడు.

సర్వాన్ జనపదాన్ జిత్వా విత్త మాదాయ కేవలం
మధ్యే ధనస్య తిష్ఠామి తే నాహు ర్మాం ధనంజయమ్ ౧౪

అభిప్రయామి సంగ్రామే యదహం యుద్ధదుర్మదాన్
నాజిత్వా వినివర్తామి తేన మాం విజయం విదుః ౧౫
శ్వేతాః కాంచనసన్నాహా రథే యుజ్యంతి యే హయాః
సంగ్రామే యుధ్యమానస్య తే నాహం శ్వేతవాహనః ౧౬
ఉత్తరాభ్యాం ఫల్గునీభ్యాం నక్షత్రాభ్యా మహం దివా
జాతో హిమవతః పృష్ఠే తేన మాం ఫాల్గునం విదుః ౧౭
పురా శక్రేణ మే దత్తం యుధ్యతో దానవర్షభైః.
కిరీటం మూర్ధ్ని సూర్యాభం తే నాహు ర్మాం కిరీటినమ్ ౧౮
న కుర్యాం కర్మ బీభత్సం యుధ్యమానం కథంచన
తేన దేవమనుష్యేషు బీభత్సు రితి విశ్రుతః ౧౯
ఉభౌ మే దక్షిణౌ పాణీ గాండీవస్య వికర్షణే
తేన దేవమనుష్యేషు సవ్యసాచీతి మాం విదుః ౨౦
పృథివ్యాం చతురంతాయాం వర్ణో మే దుర్లభ స్సమః
కరోమి కర్మ శుక్లంచ తేన మా మర్జునం విదుః ౨౧
అహం దురాపో దుర్ధర్షో దమనః పాకశాసనిః
తేన దేవమనుష్యేషు జిష్ణునామాస్మి విశ్రుతః ౨౨
కృష్ణ ఇత్యేవ దశమం నామ చక్రే పితా మమ
కృష్ణావదాతస్య తతః ప్రియత్వాద్బాలకస్యవై ౨౩

(సర్వజనపదముల జయించి విత్తమునుగొనివచ్చి మధ్యనే నుండుట గల్గినందున నన్ను ధనంజయుడని తెలియుచున్నారు.(౧) యుద్ధదుర్మదులగు వారల జయింపనిది నేను మరలిరాలేదు గావున నన్ను విజయుడని తెలియుచున్నారు,(౨) రణరంగ మందు యుద్ధమొనర్చు నా రథమునకు తెల్లనిగుఱ్ఱము లుండుటం

జేసి నేను శ్వేతవాహనుడ నయితిని(౩) ఉత్తరఫల్గునీనక్షత్ర మున పగటివేళ హిమవత్పృష్టమం దుద్భవించితినిగాన నన్ను ఫాల్గునుడని తెలియుచున్నారు.(౪) దానవులతో యుద్ధమొనర్చు నాకు సూర్యాభమగు దేవేంద్రదత్త కిరీటము శిరమున శోభించి నందున నన్ను కిరీటియని చెప్పుచున్నారు.(౫) యుద్ధమందు నేను ఘృణితమగు కర్మను చేయను కనుక బీభత్సుడని విశ్రుతుడనైతిని బీభత్స మేర్పడు యుద్ధమొనర్చు నేను దేవమనుష్యులందు బీభత్సుడని విశ్రుతుడనైతిని.(౬) రెండు చేతులచేత గాండీవము నాకర్షించుటంజేసి నన్ను దేవమనుష్యులందు సవ్యసాచియని తెలియుచున్నారు.(౭) చతురంతమగు పృథివియందు దుర్లభమైనవర్ణము నా యందుండి నందున, కీర్తికరకార్యములు నాచే గావింపబడినందున నన్నర్జునుడనని తెలియుచున్నారు.(౮) నేను దురాపుడను దుర్ధర్షుడను, దమనుడనై యుందును. అందువలన శక్రతనయుండ నగు నేను జిష్ణునామమున విశ్రుతుడనైతిని(౯) కృష్ణ యను పదియవపేరు నాతండ్రి నన్ను "నల్లవాడా' యని పిలిచినందున గల్గినది. కృష్ణావదాతవర్ణము నాది యగుటను, బాలకప్రియత్వమున 'కృష్ణ' అని నా తండ్రి నన్ను పిలుచువాడు(౧౦) అని యర్జునుడు తన పది పేళ్లు వివరించిపలికెను.)

"నేను లోకమంతయుజయించి ధనరాశులను పుష్కలముగ దెచ్చితిని, అందున నేను ధనంజయుడనని ప్రసిద్ధుడనైతిని. యుద్ధదుర్మదులను జయించి సంగ్రామవిజయమొందినందున నేను విజయుడనని ప్రసిద్ధినొందితిని-ఇట్లని యర్జునుడు పలుకలేదు.

ఇట్లుపలుకుట సోత్కర్షయగును, అర్జునుడు సోత్కర్షగా మాటాడువాడుకాదు. సోత్కర్ష కానివిధముగా నర్జును డుత్తరు డడిగినదానికి సమాధానమిచ్చుట గమనింపదగినది- అర్జునుని యుత్తమశీలము నిది వివరించుచున్నది. ఉత్తరు డర్జునున కభివాదన మొనరించి యిట్లు పలికెను. (*) "నేను భూమింజయుడను నామము, ఉత్తరుడను నామము గలవాడను. నే నజ్ఞానమున బలికినదంతయు క్షమింపదగుదువు. చిత్రదుష్కరకర్మలొనరించినట్టి నిన్ను నెఱుంగుదును అందువలన నాకు భయము పోయినది, నీయందు బ్రీతియేర్పడినది సారథినైన నాతోడ నీవు రథికుడవై (యుద్ధ మొనర్చుము) నీవు చెప్పినట్లు రథము నడపెదను' అని పలికెను. అర్జును డుత్తరునకు విపులమగు ధైర్యమును పలికి 'నేనే కౌరవులతో బోరాడెదను, నీ పశువులను జయించెదను' అని పలికెను అపుడుత్తరు డిట్లుపలికెను

బిభేమి నాహ మేతేషాం జానామి త్వాం స్థిరం యుధి
కేశవే నాపి సంగ్రామే సాక్షా దింద్రేణవా సమమ్ ౯౫-౯
ఇదంతు చింతయ న్నేవం పరిముహ్యామి కేవలం
నిశ్చయంచాపి దుర్మేధా న గచ్ఛామి కథంచన ౧౦
ఏవం యుక్తాంగరూపస్య లక్షణైః సూచితస్యచ
కేన కర్మవిపా కేన క్లీబత్వ మిద మాగతమ్ ౧౧
మన్యే త్వాం క్లీబవేషేణ చరంతం శూలపాణినం
గంధర్వరాజప్రతిమం దేవం చాపి శతక్రతుమ్

[*] అహం భూమింజయో నామ నామ్నాహ మపిచోత్తరః
౨౪

అరునః :

భ్రాతు ర్ని యోగాత్ జ్యేష్ఠస్య సంవత్సర మిదం వ్రతం
చరామి వ్రతచర్యాంచ సత్య మేత ద్బ్రవీమి తే ౧౩
నాస్మి క్లీబో మహాబాహో పరవాన్ ధర్మసంయుతః
సమాప్తవ్రత ముత్తీర్ణం విద్ధి మాం త్వం నృపాత్మజ ౧౪

('నేను వారికి భయపడను నీవు యుద్ధమందు స్థిరముగా నుందువని యెఱుంగుదును. రణరంగమందు గేశవునితోడ, సాక్షా దింద్రునితోడ సముండవు నీవు, నేనిదే (యీ సందర్భమున) జింతించుచు గేవలము పరిమోహా మొందుచుంటిని. ఇట్టి యుక్తాంగరూపము, లక్షణములు గల్గిన నీ కేకర్మవిపాకముచే నీక్లీబత్వము వచ్చిపడినదో కదా. క్లీబవేషమున జరించు శూలపాణివని తలంతును. గంధర్వరాజప్రతిముడవు, శతక్రతు దేవుడవు నీ వగుదని తలంచెదను'- ఉత్తరు డిట్లుపలుకగా నర్జును డిట్లు పలికెను. "పెద్దన్నగారియొక్క నియోగానుసారమైన వ్రతమిది యాచరించుచున్నవాడను, సత్యము పలుకుచుంటిని. [*] నేను క్లీబుడనుగాను. ధర్మసంయుతుడను. సమాప్తవ్రతోత్తీర్ణుడనని నన్ను తెలియుము-అని పలికెను.)

---

[*] "సత్యము పలుకుచున్నాను నేను క్లీబుడను కాను" అని యర్జును డుత్తరునితో బలుకుట గమనార్హమైనది. అర్జునుడు దేవలోకమునకు బోయి బ్రహ్మచర్య మొనరించి యస్త్రవిద్య నభ్యసించెను. ఆ సందర్భమున నిట్టి పరిస్థితి యేర్పడినది.

అర్జునుడు తనక్లీబత్వమును గూర్చి గంభీరముగా బలికి నాడు. అది విని యుత్తరు డిట్లు వచించెను. "పరమానుగ్రహ మిపు డింతగా నేను తర్కించినది వృథా కాదు. నీ వంటివారు క్లీబరూపులు కానేరరు,

సహాయవా నస్మి రణే యుధ్యేయ మమరైరపి
సాధ్వసంహి ప్రణష్టం మే కిం కరోమి బ్రవీహి మే ౧౯
అహం తే సంగ్రహీష్యామి హయాన్ శత్రురథా రుజాన్
శిక్షితో హ్యాస్మి సారథ్యే తీర్థః పురుషర్షభ ౧౭
దారుకో వాసుదేవస్య యథా శక్రస్య మాతలిః
తథా మాం విద్ధి సారథ్యే శిక్షితం నరపుంగవ ౧౮

నేనిపుడు సహాయవంతుడనే అమరులతోగూడ నేను యుద్ధమాడువాడనే-సాధ్వసము ప్రణష్టమైనది. నేనేమి గావింప వలసినది, తెల్పుము నీ కిపుడు సారథి నయ్యేదను, తీర్థతః

---

తత శ్శక్రో ౽ బ్రవీ త్పార్థం కృతాస్త్రం కాల ఆగతే
నృత్యం గీతంచ కౌంతేయ చిత్రసేనా దవాప్నుహి అం ౪౪-౬
వాదిత్రం దేవవిహితం నృలోకే య న్నవిద్య తే
త దర్జయస్వ కౌంతేయ శ్రేయో వై తే భవిష్యతి ౩
గాంధర్వ మతులం నృత్యం వాదిత్రం చోపలబ్ధవాన్ ౧౧

(దేవేంద్రు డర్జునునితో 'చిత్రసేనునివలన నృత్యము, గీతము నభ్యసింపుము నృలోకమం దట్టివిద్య లేదు, అని పలికెను. శక్రవచనానుసార మర్జునుడు గాంధారవిద్యను - నృత్యము, వాదిత్ర మభ్యసించెను.)

నేను సారథ్యమందు సుశిక్షితుండను. కృష్ణున కు దారకుడు ఇంద్రునకు మాతలియట్లు నేను సారథ్యమందు శిక్షితుండను. సుగ్రీవము మేఘపుష్పము, శైబ్యము, బలాహకములట్లు (కృషరథాశ్వములట్లు) నే నిపు డీగుఱ్ఱములను నడిపించువాడ'

---

ఈ సందర్భమున నర్జునునిదృష్టి యుర్వసియందు సక్తమగుట నెఱింగి వాసవు డాచిత్రసేనునితో జెప్పి యుర్వశిని కౌంతేయునిదరికి బోవునట్లు గావించెను అనంగశరపీడితనై వచ్చియున్నదాన ననిపలికిన యుర్వశినిజూచి యర్జునుడిట్లనెను

గచ్ఛ మూర్ధ్నా ప్రపన్నో ఽ స్మి పాదౌ తే వరవర్ణిని
త్వంహి మే మాతృవత్పూజ్యా రక్ష్యో ఽహం పుత్రవత్త్వయా
౪౬-౪౭

ఏవ ముక్తాతు పార్థేన ఉర్వశీ క్రోధమూర్ఛితా
వేపంతీ భ్రుకుటీ వక్త్రా శశాపాథ ధనంజయమ్ ౪౮
తవ పిత్రా భ్యనుజ్ఞాతాం స్వయంచ గృహ మాగతాం

---

యస్మా న్మాం నాభినందేథాః కామబాణవశం గతామ్ ౪౯
తస్మాం త్త్వం న ర్తనః పార్థ స్త్రీమధ్యే మానవర్జితః
అపుమానితి విఖ్యాతః షండవ ద్విచరిష్యసి ౫౦

---

(వెడలిపొమ్ము, శిరసా నీ పాదములందు బ్రపన్నుడనైతిని. నీవు నాకు తల్లివలె పూజ్యురాలవు. నేను పుత్రునట్లు నీచే రక్షింపదగువాడను' అని యర్జునుడు పలుకగా నుర్వశి క్రోధమూర్ఛితయై యర్జును నిట్లు శపించెను. "నీ తండ్రిచే ననుజ్ఞాతనై, స్వయము గృహాగతయగు నన్ను - కామబాణ

నని పలికెను. అర్జునడపుడు బృహన్నలావేషమును దీసివేసెను.
వశంగతనగు నన్ను నీవభినందించుట లేనికారణమున నీవు నర్త
కుడవై స్త్రీమధ్యమందు మానవర్జితుడవై అపుంసుడవని (అపు
మానితి) విఖ్యాతుడ వగుదువు. షండునివలెవర్తించెదవు" అని
శాప మిడెను. ఈ సందర్భమున దేవేంద్రు డర్జునునితో నిట్లనెను,)

తత ఆన్యాయ తనయం వివిక్తే హరివాహనః
సాంత్వయిత్వా శుభై ర్వాక్యైః స్మయమానో౽భ్యభాషత
౫౪

యత్తు ద త్తవతీ శాప మూర్వశీ తవ మానద
సచాపి తే౽ర్థకృ త్తాత సాధకశ్చ భవిష్యతి ౫౮
అజ్ఞాతవాసో వస్తవ్యో భవద్భి ర్భూతలే౽నఘ
వర్షే త్రయోదశే వీర తం తత్ర క్షపయిష్యతి ౫౭
ఏవ ముక్తస్తు శక్రేణ ఫాల్గునః పరవీరహా
ముదం పరమికాం లేభే నచ శాపం వ్యచింతయ్యత్

(హరివాహనుడు రహస్యమున నర్జుననోదార్చి స్మయ
మానుడై యిట్లనెను. ఈయుర్వశియిడిన శాపము నీ కర్థకృతమై
సాధకము కాగలదు. భూతలమందు మీర అజ్ఞాతవాసమొనర్చు
నాపదుమూడవ సంవత్సరమున నీశాపమును నీవు గడిపెదవు.
శక్రుడిట్లు పలుకగా ఫాల్గుణుడు పరమమోదమొంది శాపవిష
యకమగు జుగుప్స నొందలేదు.)

ఈశ్లోకములలో నర్జునునం దపుంస్త్వము వర్తించునని
కలదేకాని పుంస్త్వము పోవునని లేదు. ఉర్వశి తా నింద్రునిచే
ననుజ్ఞాతనై వచ్చితినని మాత్రమేపలికినది. మఱియు జిత్రము

నీలచికురంబుల నెత్తికట్టి తెల్లనివస్త్రమందు పైకట్టెను. పిమ్మట స్వయము గృహగతనై తినని పలికినది. దీనినంతయు గమనించిన యర్జును డది తంత్రిడి పనువుగా దనయందు వర్తించునది కాదని తలంచినాడు. ఇంద్రుడు పర్యవసానములో నర్జును నుద్ధరించి మంచిపరిస్థితిని గల్గించినాడు. (ఉర్వశిపురూరవునకు భార్య-ఆది పర్వము) ఉర్వశి కుంతివంటిదని యర్జును డీవుడు వచించుటయు గమనింపదగినది. కర్ణుడు జననీజనకులగు కుంతియుసూర్యుడు చెప్పిన దాచరించలేనివాడై నాశనమొందినాడు. ఈపట్టునం దీవిషయగాంభీర్య మిందొకటి గమనింపదగినది. యక్షుడుగా నేతెంచిన యమధర్మరాజు ధర్మరాజున కిట్లు వరమొసంగి యున్నాడు.

వర్షాణి ద్వాద శారణ్యే త్రయోదశ ముపస్థితం
తత్రనో నాభిజానీయు ర్వసతో మనుజాః క్వచిత్ అర
౩౧౩-౧౫

దదా నీత్యేవ భగవా నుత్తరం ప్రత్యపద్యత
భూయ శ్చాశ్వాసయామాస కౌంతేయం సత్యవిక్రమమ్
యద్యపి స్వేన రూపేణ చరిష్యత మహీ మిమాం
న వో విజ్ఞాస్యతే కశ్చి త్త్రిషులోకేషు భారత ౧౭

వర్షం త్రయోదశ మిదం మత్ప్రసాదా త్కురూద్వహాః
విరాటనగరే గూఢా అవిజ్ఞాతా శ్చరిష్యథ ౧౮
యద్వః సంకల్పితం రూపం మనసా యస్య యాదృశం
తాదృశం తాదృశం సర్వే ఛందతో ధారయిష్యథ ౧౯

ప్రాఙ్ముఖుడై శుచియు ప్రయత మానసుడై సర్వాస్త్రములను రథో త్తమమందు దలంచెను. అస్త్రములు ప్రాంజలులై 'కింకరు

(యక్షునితో ధర్మరాజు "అరణ్యామంను ద్వాదశవత్స రము లున్న మాకు పదుమూడవవత్సరము సమీపించినది. (ఉప స్థితం) మావర్తనమును మనుజులెట్లును నెఱుంగకుందురు గాక' అని పలికెను. అపుడు యక్ష రూపమున వచ్చిన యమధర్మ రాజు ధర్మజునాశ్వాసించి యిట్లనెను, నైజరూపమున వర్తించి నను మిమ్ములను మూడులోకములం దెవ్వారు నెఱుంగకుం దురు విరాటనగరమున గూఢవర్తనమున చరింపుడు, మీర లేయేరూపములను మనమందు సంకల్పించెదరో యాయారూప ములు మీరు ఛందతః ధరింపగలవారు' అని పలికెను.

ధర్మజుడు "వర్షాణి ద్వాద శారణ్యే త్రయోదశ ముప స్థితం" అని చిత్రముగా పలికినాడు పండ్రెండువత్సరములు గడచి పదుమూడవవత్సరము నచ్చినదని దీని యభిప్రాయముకా దని యెఱుంగదగును. ధర్మజుని మాయోపాయ మిందెంతయేని యిమిడియున్నది. పాండవు లయిదుగురు ఛందతః మనస్సం కల్పిత రూపముల నొందగలరు. స్వరూపమున జరించు పాండవు లందు ఛందతః కోరినరూపము వర్తించును. కావున నర్జునుడు స్వరూపమందే నపుంసక వేషమున గానవచ్చినాడని సారస్యము. మీ రేయేపనుల వెంట విరాటు ననువర్తించెదరని ధర్మజు డడిగి నపు డర్జును డిట్లు పలికెను.

లము' అని పలికినవి, "అర్జును డస్త్రములకు నమస్కరించి స్పృశించి "నామనసున నెల్ల పన్నిహితమైయుండుడు" అని

ప్రతిజ్ఞాం షండకో ఽ స్మీతి కరిష్యామి మహీపతే
జ్యాఘాతౌహి మహాంతౌ మే సంవర్తుం నృప దుష్కరౌ
విరా ౨-౨౬
వలయై శ్ఛాదయిష్యామి బాహూ కిణకృతా విమౌ
కర్ణయోః ప్రతిముచ్యా హం కుండలే జ్వలన ప్రభే ౨౩
పినద్ధ కంబుః పాణిభ్యాం తృతీయాం ప్రకృతిం గతః
వేణీకృతశిరా రాజ న్నామ్నా చైవ బృహన్నళా ౨౮
పఠ నాఖ్యాయికా శ్చైవ స్త్రీభా వేన పునః పునః
రమయిష్యే మహీపాల మన్యాంశ్చాంతఃపురే జనాన్ ౨౯
గీతం నృత్యం విచిత్రంచ వాదిత్రం వివిధం పథా
శిక్షయిష్యా మ్యహం రాజన్ విరాటస్య పురస్త్రియః ౩౦
ప్రజానాం సముదాచారం బహుకర్మకృతం వదన్
ఛాదయిష్యామి కౌంతేయమాయ యాఽత్మాన మాత్మనా ౩౧
యుధిష్ఠిరస్య గేహేవై ద్రౌపద్యాః పరిచారికా
ఉషితా ఽ స్మీతి వక్ష్యామి పృష్టో రాజ్ఞాచ పాండవ ౩౨
ఏ తేన విధినా చ్ఛన్నః కృతకేన యథా నళః
విహరిష్యామి రాజేంద్ర విరాటభవనే సుఖమ్ ౩౩

(షండకుడనని ప్రతిజ్ఞ గావించెదను. జ్యాఘాతకిణకృతము లగు బాహువుల వలయములచే నాచ్ఛాదన మొనరించెదను. జ్వలనప్రభలగు కుండలములను కర్ణములకు తగిలించి, చేతికి శంఖముల గాజులను తొడిగికొని తృతీయ ప్రకృతి నొందెదను.

పలికెను అర్జును డిట్లు స్త్రపరిగ్రహామెుంది ప్రహృష్టవదన డై ధనుష్టం
వేణీకృతశిరముఃగల్గి బృహన్నళానామమున కథావాఖ్యాయికలు
గావించుచు స్త్రీభావమున మాటిమాటికి మహీపాలుని, అంతః
పుర జనులను రమింపజేయుదును...... మాయచే నన్ను నేను
మరుగుగావించుకొని (ఛాదయిష్యామి) కృతకముగ నలుడు
విహరించినట్లు విరాటభవనమున నుండెదను,

అర్జును డిపుడు తన షండవేషమును నలుని బాహుక
వేషముతో సరిపోల్చిపలికినాడు. ఈ విషయము భారతమం దిట్లు
గలదు. నలుడు కర్కోటకుని దావమునుండి రక్షించి తెచ్చిన
పైని కర్కోటకుడు నలుని గఱచెను. దానితో నలునకు విరూప
మేర్పడెను,

తత స్సంఖ్యాతు మారబ్ధ మదశ ద్దశమే పదే
తస్య ద్రష్టస్య తద్రూపం క్షిప్ర మంతరధీయత అర ౬౬ ౧౨
తతః కర్కోటకో నాగః సాంత్వయ న్నళ మబ్రవీత్
మయా తేఽంతర్హితం రూపం న త్వాం విదు ర్జనా ఇతి ౧౮
గచ్ఛ రాజ న్నిత స్సూతో బాహుకోఽహమితబ్రువన్ ౨౦
స్వం రూపంచ యదా ద్రష్టు మిచ్ఛేథా స్త్వం నరాధిప
సంస్మర్తవ్య స్తదా తేఽహం వాస శ్చేదం నివాసయే ౨౪
అనేన వాససా చ్ఛన్న స్స్వరూపం ప్రతిపత్స్యసే
ఇత్యుక్త్వా ప్రదదౌ తస్మై దివ్యం వాసోయుగం తదా ౨౫
తత స్తద్వస్త్ర మరజః ప్రావృణో ద్వసుధాధిపః
సంస్మృత్వ నాగరాజం తం తతో లేభే స్వకం వపుః ౭౬-౪౨
స్వరూపిణంతు భర్తారం దృష్ట్వా భీమసుతా తదా
ప్రాక్రోశ దుచ్చై రాలింగ్య పుణ్యశ్లోక మనిందితా ౪౩

కార మొనరించెను, ఆశబ్దమును పిడుగుపడినట్లు కౌరవు లాలకించిరి.

భై మీమపి నళో రాజా భ్రాజమానో యథా పురా
సస్వజే స్వసుతౌ చాపి యథావ త్ప్రత్యనందత ౪౪

(అపుడు 'పది' యని లెక్కించు నలుని కర్కోటకుడు కఱవగా వెంటనే (నలుని) యా రూప మంతర్ధాన మాయెను. అపుడు కర్కోటకుడు నలునోదార్చి 'నాచే నీరూప మంతర్హితము గావింపబడినది. నిన్ను జనులు తెలియకుందురు. ఋతుపర్ణునియొద్దకు బోయి బాహుకుడనని చెప్పి యచ్చట సూతుడుగ నుండుము. నీ రూపము నెపుడు నీవు చూడనిశ్చయించెదవో యపుడు నన్ను స్మరింపుము. ఈ వస్త్రమున నపు డాచ్ఛాదితుడవుకమ్ము. పతద్వ్యాసఛన్నుడవై నీరూప మొందువాడ వగుదువు' ఇట్లని కర్కోటకుడు పలికి వస్త్రయుగ్మమును దొసంగెను. ... .... నలుడావస్త్రమున నాచ్ఛాదితుడై కర్కోటకుని దలపగా నిజరూప మొందిన వాడాయెను)

నలునకు రూప మంతర్హితమైనదే కాని పోలేదు. సుసమయ మేర్పడగానే స్వరూపము నలుడు గాంచగల్గెను. అట్లే యూర్వశి శాపమున నర్జునునకు పుంస్త్వము నశించలేదని యెఱుంగదగును అపుంస్త్వమున, స్త్రీభావమున నర్జునుడు వర్తించుచుండువాడయినాడని పర్యవసానము. యమధర్మరాజు వరమున ఛందతః రూపమొందగలవాడైన యర్జునుడు స్వరూపమును మఱుగుగావించుకొనువాడాయెను. అర్జునుడు బృహన్నలగా విరాటనగరమున ప్రవేశించు సందర్భమున నిట్లు గలదు.

అథాపరో౽ దృశ్యత రూపసంపదా
స్త్రీణా మలంకారధరో బృహత్పుమాన్

కృష్ణాన్ భంగమతః కేశాన్ శ్వేతే నోద్గ్రిగిధ్య వాససా
అథాసౌ ప్రాఙ్ముఖో భూత్వా శుచిః ప్రయతమానసః

---

ప్రాకారవప్రే ప్రతిముచ్య కుండలే
దీర్ఘే చ కంబూ పరిహాటకే శుభే  విరా॥ ౧౧-౧
బహూంశ్చ దీర్ఘాన్ ప్రవికీర్య మూర్ధజా
న్మహాభుజో వారణతుల్యవిక్రమః
గతేన భూమిం ప్రతికంపయం స్తదా
విరాట మాసాద్యా సభాసమీపతః  ౨
తం ప్రేక్ష్య రాజోపగతం సభాతలే
వ్యాజాత్ ప్రతిచ్ఛన్న మరిప్రమాథినం
విరాజమానం పరమేణవర్చసా
సుతం మహేంద్రస్య గజేంద్ర విక్రమమ్  ౩
సత్త్వోపపన్నః పురుషోఽమరోపమః
శ్యామో యువా వారణయూథపోపమః
ఆముచ్యకంబూ పరిహాట కే శుభే
విముచ్య వేణీ మపి నహ్యా కుండలే  ౪
స్రగ్వీ సుకేశః పరిధాయ చాన్యథా
శుశోభ ధన్వీ కవచీ శరీ యథా
ఆరుహ్యా యానం పరిధావవతాం భవాన్
సుతై స్సమో మే భవవా మయా సమః  ౬
వృద్ధో హ్యాహం వై పరిహాతు కామ
స్సర్వాన్ మత్స్యాం స్తరసా పాలయస్వ

అథి దధ్వా మహాబాహుః సర్వాస్త్రాణి రథోత్తమే
ఊచుశ్చ పార్థం సర్వాణి ప్రాంజలీని నృపాత్మజమ్ ౨౬

---

నైవం విధాః క్లీబరూపా భవంతి
కథంచ నేతి ప్రతిభాతి మే మనః ౭
ఇదంతు రూపం మమ యేన కిం తవ
ప్రకీర్తయిత్వా భృశశోకవర్ధనం
బృహన్నళాం మాం నరదేవ విద్ధి
సుతం సుతాంవా పితృమాతృవర్జితామ్ ౮
బృహన్నళాం తా మభివీక్ష్య మత్స్యరాట్
కళాసు నృత్యేషు తథైవ వాదితే
సంమంత్ర్య రాజా వివిధైః స్స్వమంత్రిభిః
పరీక్ష్య చైనం ప్రమదాభి రాశువై
అపుంస్త్వ మప్యస్య నిశమ్యచస్థిరం ౧౦
తతః కుమారీపుర ముత్ససర్జతామ్ ౧౧

(రూపసంపదగల్గి స్త్రీలఅలంకారమును ధరించిన మహా పురుషు డర్జునుడు విరాటునకు గానవచ్చెను, క్లీబరూపమున నర్జునుడు విరాటునకు సభాసమీపమున గానవచ్చెను. వారణ తుల్య విక్రముడగు నర్జునుడు గమన గతిని భూమిని గంపింప జేయుచు (గతేన భూమిం ప్రతికంపయం స్తథా) వ్యాజమున ప్రతిచ్ఛన్నుడై విరాటుని సమీపించెను. అపుడు విరాటు డిట్లనెను. 'సత్వోపపన్నుడు, అమరోపముడు, శ్యాముడు, యువా

ఇమేస్మ పరమోదారాః కింకరాః పాండునందన
ప్రణిపత్య తతః పార్థః సమాఽభ్యచ పాణినా ౧౭
సర్వాణి మానసానీహ భవతీ త్యభ్యభాషత తే
ప్రతిగృహ్య తతోఽస్త్రాణి ప్రహృష్టవదనోఽభవత్ ౧౮

నుడు, వారణయూథపోపముడగుదువు. (స్త్రీ జనోచిత పుష్ప హార కేశవే శాలం కృతులు కల్గినను ధనస్సు, కవచము, శరము దాల్చిన, వీరునివలె శోభించుచున్నావు. వాహనము నారోహించి నా పుత్రులతోగాని, నాతోగాని సమానముగా ఇచ్చానుసారముగా భ్రమింపుము. ఈ మత్స్యరాజ్యమును నీవే పరిపాలింపుము. నీవంటివారు క్లీబరూపులెట్లును గానేరరని నామనమందభిప్రాయమగుచున్నది. విరాటు డిట్లు పలుకగా నర్జును డిట్లు పలికెను. ఈరూపమును గూర్చి తెల్పి యేమి భృశశోకవర్ధనమైన దిది, నన్ను బృహన్నలగా. పితృమాతృవర్జితమగు సుతుడో, సుతయో యనిచూడుము—అర్జును డిట్లు పలుకగా విరాటరాజర్జునుని పరీక్షగావించెను, నృత్యగీతములందు బరీక్షగావించెను. ప్రమదలచే బరీక్షచేయించి అతనియందు అపుంస్త్వమును నిశ్చయించి యాపిమ్మట అంతఃపురమున కాతని బంపెను.)

'గతేన భూమిం ప్రతికంపయన్' అనునది పార్థునందు బురుష ప్రవృత్తిని నిరూపించుచున్నది 'సత్త్వోపపన్నః' మొదలగు పుంలింగములు, ధన్వీ, కవచీ, అరుహ్యాయానం అనునవి యర్జునునిపుంస్త్వమును నిర్ధారించుచునేయున్నవి. 'నైవంవిధాః క్లీబరూపా భవంతి, ఇదంతురూపం, అపుంస్త్వమప్యస్య, నిశమ్యాచ స్థిరం' అనునవి పురుషత్వమందు వర్తించుచున్న క్లీబత్వమును

అ_స్త్రిములు ప్రణమిల్లి "కింకరులము, మాకేమి సెలవు' అని పలికినపు డారథికున కింక కారాని కార్య మేముండగలదు. ఇట్లుగా రామాయాణమందు రామునకు, భారతమం దర్జునునకు అస్త్రము లిట్లు "కింకరులము" అని పలికినట్లు గలదు బ్రహ్మచర్య దీక్ష, ధర్మమెంతగా నొప్పియుండునో యంతగా నస్త్రము లుపయు_క్తములగును "ప్రాంజలీని" అని యస్త్రములగూర్చి యిచ్చట చెప్పబడినది. అస్త్రములు ప్రత్యక్షమగుటయందలి విశేషము నిదితెల్పుచున్నది, ప్రతిగ్రహమొందిన యర్జునుడు ప్రహృష్టవదనుడై నాడు. అతడు గాండీవజ్యారవమొనర్పగా గౌరవు లశనిపాతమని యులికిపడిరి. మఱియు గొండలు డీకొనిన ట్లందుండి శబ్ద మేర్పడెను. భూమి గడగడలాడెను. దిక్కుల గాలివీచెను ఆదిక్కులపుడు ప్రకాశింపలేను, భ్రాంత ధ్వజమైన దాకాశము. మహాద్రుమములు కంపించినవి.

---

ధ్వనింపజేయుచున్నవి. పరీక్ష కాగియున్న, క్లీబత్వమును దర్శించి యున్న యర్జునుడు చిత్రముగా ధర్మజునితో ప్రతిజ్ఞాం షండకోఽస్మీతి కరిష్యామి మహీపతే అనిపలికి నాడు, ఒ శ్లోకమం దన్నియు విచిత్రముగా ధన్వీ కవచీ, శరీ అని పుంలింగశబ్దము లయిననూ "గౌరీనదీ" వంటి స్త్రీలింగశబ్దములను పైకి కనిపించు దీర్ఘాంతములు ప్రయోగింపబడుట రచ నాచమత్కృతియై యున్నది.

ఉత్తరః

ఏక స్త్వం పాండవశ్రేష్ఠ బహూ నేతా న్మహారథాన్
కథం జేష్యసి సంగ్రామే సర్వశస్త్రాస్త్రపారగాన్ ౩౩
అసహాయోఽసి కౌంతేయ ససహాయాశ్చ కౌరవాః
అత ఏవ మహాబాహో భీత స్తిష్ఠామి తేఽగ్రతః ౩౪
ఉవాచ పార్థో మాభైషీః ప్రహస్య స్వనవ త్తదా
యుధ్యమానస్య మే వీర గంధర్వైః సుమహాబలైః ౩౫
సహాయో ఘోషయాత్రాయాం క స్తదాసీ త్సఖా మమ
యథా ప్రతిభయే తస్మిన్ దేవదానవసంకులే ౩౬
ఖాండవే యుధ్యమానస్య క స్తదాసీ త్సఖా మమ
నివాతకవచై స్సార్థం పౌలోమైశ్చ మహాబలైః ౩౭
యుధ్యతో దేవరాజార్థే క స్సహాయ స్తదాఽభవత్
స్వయంవరేతు పాంచాల్యా రాజభి స్సహ సంయుగే ౩౮
యుధ్యతో బహుభి స్తాత క స్సహాయ స్తదాఽభవత్
ఉపజీవ్య గురుం ద్రోణం శక్రం వైశ్రవణం యమమ్ ౩౯
వరుణం పావకంచైవ కృపం కృష్ణంచ మాధవం
పినాకపాణినం చైవ కథ మేతా న్న యోధయే ౪౦
రథం వాహయ మే శీఘ్రం వ్యేతు తే మానసో జ్వరః ౪౧

(పాండవశ్రేష్ఠ నీ వొక్కండవు. సర్వశస్త్రాస్త్రపారగులైన పెక్కు మహారథుల నెట్లు రణమందు గెల్చెదవు. కౌంతేయుడా అసహాయుడవయితివి, కౌరవులు ససహాయులై యున్నారు. అందువల్ల నే మహాబాహో! నీ యెదుట గూడ

భీతుఁడ నగుచున్నాను' అని యుత్తరుఁడు పలుకగా నర్జునుడు భయపడకుమంచు పలికి ప్రహసించి యిట్లనెను "వీరుఁడా! సుమహా బలులగు గంధర్వులతో ఘోషయాత్రసందర్భమున యుద్ధమొన ర్చిన నాకెవ్వడు సఖుడున్నాడు (కస్తదాసీత్సఖా మమ) దేవ దానవ సంకులమగు ఖాండవదాహయుద్ధమందు నాకెవ్వాడు సఖుండు. దేవరాజనిమిత్తము నివాతకవచులు, పౌలోములతో యుద్ధమొనర్చు నాకెవ్వండు సహాయుఁడు. పాంచలీస్వయంవర మందు రాజులతో సంగ్రామ మొనర్చినట్టి నాకెవ్వాడు సహా యుడు గురుండు-ద్రోణుండు, శక్రుడు, వై శ్రవణుడు, యముడు, వరుణుడు, పావకుడు, కృపుడు, మాధవుండు- కృష్ణుడు పినాకపాణియు-నిందఱి శిక్షాప్రసక్తి యేర్పడియున్న నేను వీరితో నెట్లు పోరాడకుండువాడను. రథమునడిపింపుము. మానసజ్వరము వలదు నీకు అని పలికెను )

అర్జునుడు, భీష్మద్రోణాదు లంద ఱొక్కఁ ఒక్కఁడే యనేక వీరులతో బోరాడునట్టి మేటివీరులు. "మేటివీరు లిండఱు రణమొనర్ప నన్నప్పు డొక్కండ వెట్లుగా నట్టివారినెల్ల నెదిరించి జయము గైకొంఁవు' అని యుత్తరుడు పలికినాడు. ఇట్టిసన్నివేశ మాయుత్తరు డెఱుంగడు. అసహాయుడై ఘోర సంగ్రామ మొనర్చువా డర్జునుండొక్కరుండుమాత్రమే, కావున నుత్తరున కేర్పడిన యీసంశయ మర్జునపరాక్రమవిశేషమును నింపునదియే యగుచున్నది. 'అత ఏవ మహోబాహో భీతస్తి ష్ఠామి తేగ్రతః' అని యుత్తరు డనుటలో నిది సువ్యక్తమగు న్నది. అర్జునుడు భయపడకుమని ముందుగా బలుకుట యుత్తరు

నందు భావమును గనబఱచుచున్నది. పిమ్మట ప్రహసించి సమాధానవచనములు పలికినా డర్జునుడు,

అర్జును డొక్క డనేకఘనయుద్ధము లొనర్చి విజయ మొందియున్నాడు ఈవిషయము సోత్కర్ష కానివిధముగా నత డుత్తరున కెఱిగించినాడు. అందు మొదటగా ఘోష యాత్రాయుద్ధవిషయము ప్రస్తావించుట అంతసమాధాన మగుచున్నదని తాత్పర్యము "క స్త దాసీ త్సఖా మమ, క స్సహాయ స్తదా ఽ భవత్" అని యర్జునుడు పలుకుట యెంత యేని సత్త్వభావమును నింపుచున్నది ఎందఱుమహానుభావుల యొద్దనో ఘనశుశ్రూషగావించి యర్జును డపూర్వాస్త్రసంపద నొందియున్నాడు. ఆ శిక్షాబలమహిమయే యుద్ధవిజయ ప్రసంగ ముగా నర్జునుడు రూపొందించుట వొడ్డవిషయముగా నేర్పడు చున్నది. "కథ మేతా న్న యోధయే" అని ప్రశ్నార్థకముగా నర్జునుడు పలుకుట యుత్తరున కెంతయేని సమర్థసమాధాన మగుచున్నది. అర్జును డిట్లు విస్తారప్రసంగమొనరించి "రథం వాహాయ మే శీఘ్రం వ్యేతు తే మానసో జ్వరః' అని చివరగా బలికి యుత్తరునకు విపులోత్సాహ మేర్పఱచిన వాడయినాడు.

ఉత్తరం సారథిం కృత్వా శమీం కృత్వా ప్రదక్షిణం
ఆయుధం సర్వ మాదాయ ప్రయయౌ పాండునందనః ౪౬-౧
. ధ్వజం సింహం రథా త్తస్మా దపనీయ మహారథః
ప్రణిధాయ శమీమూలే ప్రాయా దుత్తరసారథిః ౨
దైవీం మాయాం రథే యుక్తాం విహితాం విశ్వకర్మణా

కాంచనం సింహలాంగూలం ధ్వజం వానరలక్షణమ్ ౩
మనసా చింతయామాస ప్రసాదం పావకస్యచ
సచ తచ్చింతితం జ్ఞాత్వాసధ్వజే భూతా న్యదేశయత్ ౪
స పతాకం విచిత్రాంగం సోపాసంగం హిరణ్మయం
ఖా త్పపాత రథ స్తూర్ణం దివ్యరూపం మనోరథమ్ ౫
రథం త మాగతం దృష్ట్వా దక్షిణం ప్రాకరో త్తదా
రథ మాస్థాయ బీభత్సుః కౌంతేయః శ్వేతవాహనః ౬
బద్ధగోధాంగుళిత్రాణః ప్రగృహీతశరాసనః
తతః ప్రాయా దుదీచీంచ కపిప్రవరకేతనః ౭

(ఉత్తరుని సారథిగా గావించి శమీవృక్షమునకు బ్రదక్షిణ మొనరించి యాయుధము సర్వము గైకొని పాండునందనుడు బయలుదేరెను. సింహధ్వజమును శమీమూలమందుంచి యుత్తర సారథియగు నర్జునుడు వెడలెను. విశ్వకర్మవిహితమగు కాంచన సింహలాంగూలమైన. వానరలక్షణమైన ధ్వజమును, పావక ప్రసాతమగు దివ్యరథము నర్జునుడు మనసాచింతించెను. అగ్ని హోత్రు డదియెటింగి (చింతితం జ్ఞాత్వా) ధ్వజమందు భూత ముల నేర్పఱచెను. సపతాకము, విచిత్రాంగము, సోపాసం గము, హిరణ్మయము. దివ్యరూపము. మనోరథము నగు రథము తత్క్షణ మాకాశమునుండి దిగెను. రథమట్లు వచ్చుటగాంచి యర్జునుడు ప్రదక్షిణమాచరించి యందధిష్ఠించెను. బద్ధగోధాం గుళిత్రాణుడు, ప్రగృహీతశరాసనుడునై కపిప్రవరకేతునుడగు పార్థు డుదీచీదిక్కుగా వెడలెను.)

అర్జునున కిపుడు దివ్యమైనవగు పరికరములు గాండీవము, రథము, ధ్వజము, భూతము లేర్పడినవి. గుఱ్ఱములుమాత్ర ముత్తరునివే. అవి చేవగల్గినవని యుత్తరవచనమున నభిప్రాయ మగుచున్నది. (౪౫-౧౮-౨౨) కపిప్రవరకేతనుండగు విజ యుండు శుభమైన యుత్తరదిక్కునుగూర్చి వెడలినాడు. అరి మర్దనుడగు నర్జునుడు శత్రురోమహర్షణమైన మహాశంఖమును బూరింపగా దేరిగుఱ్ఱములు మోకాళ్ళూనినవి. ఉత్తరుడును సంత్రస్తుడై రథమందు జతికిలపడెను. అర్జునుడు కళ్లెములు పట్టి గుఱ్ఱములను లేవనెత్తి యుత్తరుని బరిష్వంగమొనరించి యూరార్చెను. మఱియు నిట్లు పలికెను.)

మాభైస్త్వం రాజపుత్రాగ్ర్య క్షత్రియోఽసి పరంతప
కథం పురుషశార్దూల శత్రుమధ్యే విషీదసి ౧౧
శ్రుతాస్తే శంఖశబ్దాశ్చ భేరీశబ్దాశ్చ పుష్కలాః
కుంజరాణాంచ నదతాం వ్యూఢానీకేషు తిష్ఠతామ్ ౧౨
సత్వం కథ మిహానేన శంఖశబ్దేన భీషితః
విషణ్ణరూపో విత్రస్తః పురుషః ప్రాకృతో యథా ౧౩

ఉత్తరః

శ్రుతా మే శంఖశబ్దాశ్చ భేరీశబ్దాశ్చ పుష్కలాః
కుంజరాణాంచ నదతాం వ్యూఢానీకేషు తిష్ఠతామ్ ౧౪
నైవం విధః శంఖశబ్దః పురా జాతు మయా శ్రుతః
ధ్వజస్య చాపి రూపం మే దృష్టపూర్వం నహీదృశమ్ ౧౫
ధనుషశ్చాపి నిర్ఘోషః శ్రుతపూర్వో న మే క్వచిత్

అస్య శంఖుస్య శబ్దేన ధన షో నిస్స్వనేనచ ౧౨
అమానుషేణ శబ్దేన భూతానాం ధ్వజవాసినాం
రథస్యచ నినాదేన మనో మః హ్యాతి మే భృశమ్ ౧౩
వ్యాకులాశ్చ దిశః సర్వా హృదయం వ్యథతీవ మే
ధ్వజేన పిహితాః సర్వా దిశో న ప్రతిభాంతి మే ౧౪
గాండీవస్యచ శబ్దేన కర్ణౌ మే బధిరీకృతౌ ౧౫

అర్జునః :

ఏకాంతం రథ మాస్థాయ పద్భ్యాం త్వ మనపీడయ
దృఢంచ రశ్మీన్ సంయచ్ఛ శంఖం ధ్మాస్యా మ్యహాం పునః
౧౬

ఉత్తరశ్చాపి సంలీనో రథోపస్థ ఉపావిశత్
తస్య శంఖస్య శబ్దేన రథనేమి స్వనేనచ ౨౨
గాండీవస్యచ శబ్దేన పృథివీ సమకంపత
తం సమాశ్వాసయామాస పున రేవ ధరంజయః ౨౩

("భయమొందకుము, రాజపుత్రాగ్ర్య! క్షత్రియుండవు, పురుష శార్దూల! పరంతప శత్రుమధ్యమం బెట్లువిషాద మొందెదవు, అర్జునుడిట్లు తొలుత నుత్తరుని వీరజాతిని బేర్కొని యూరడించుట సందర్భోచితమైనది. ఆ పిమ్మట నిట్లు పలికినాడు. "శంఖశబ్దములు, భేరీశబ్దములు పుష్కలముగా నీవు విన్నవాడవే కదా, గజఘీంకారములు. యోధసింహానాదములు విన్నవాడవే

కదా అట్టి నీవి శంఖశబ్దమున భీషితుడవై తెలి ప్రాకృత పురుషునట్లు విషణ్ణరూపుడవై విత్రస్తుడ వయితివి' — అర్జును డిట్లు పలుకగా నుత్తరు డిట్లనెను. "నేను శంఖశబ్దములు, భేరీ శబ్దములు పుష్కలముగా వినినవాడనే. యుద్ధవేవత్స మెఱింగిన వాడనే కాని యిట్టి శంఖశబ్దము పూర్వము నేను విన్నదిలేదు. ఇట్టిధ్వజరూపము కూడ దృష్టపూర్వము కాదు ఇట్టి ధనుర్ని ర్ఘోషము నేను విన్నదిలేదు. ఈశంఖశబ్దమున ధనుష్టంకారమున ధ్వజవాసములగు భూతములయమానుషశబ్దమున, రథఘోషమున నామనస్సు భృశమోహ మొందినది. దిక్కుతోచలేదు. హృదయ వ్యథ యేర్పడినది. ఈధ్వజమును చూడగా నాకు దిక్కులు గానరాలేదు, గాండీవశబ్దమున చెవులు బధిరమైనవి' అని పలి కెను, అర్జునుడు "కాలుదన్ని పెట్టి కూర్చొనుము, దృఢముగా కళ్లెములుపట్టుము. మరల శంఖమును పూరించెదను' అనిపలి కెను. ఇట్లుపలికి యర్జునుడు శంఖమునుపూరింపగా పర్వతభేదన మట్లు గొప్పశబ్ద మేర్పడెను. ద్వేషులకు దుఃఖజనకము, మిత్రులకు హర్ష వర్ధనము నగునట్టి యాశంఖధ్వనికి గిరిగుహాలు, దిక్కులు, శైలములు పిక్కటిల్ల మాఱుమోగినవి. ఉత్తరుడు మరల సంలీనుడై యొఱగిపోయెను. అర్జునుడు మరల నుత్తరు నూరడించి చక్కజేసెను. అర్జునుని యీప్రక్రియ యుద్ధావసర కృత్యమగుచున్నను త్తరు ననుభవపూర్వక ధైర్యవంతుని గావించి నది. ఇట్లుగా సాత్వికస్వభావులగు నుత్తరార్జును లొకరినొక

రక్షముగావించుకొనుచు నిదానవంతులై యేకముఖులైరి. అర్జునుడు రణాగ్రలక్ష్మి నొందువాడై రణరంగమున కాయత్తమైనాడు,

ఉత్తరుని సరిగావించుకొను ప్రయత్నమునన్న యర్జునుని గాంచి భీష్మద్రోణముఖులగు కౌరవరథసత్తములు విత్రస్తమనస్కులయిరి. మఱియు హాతోత్సాహముగా నంతయు గనబడినది. అపుడు నిమిత్తములు విపరీతముగా నుండుటను గాంచి ద్రోణు డాత్మరక్ష ముందుగాను. గోరక్ష చివరగాను పలికినాడు. రాజ (దుర్యోధన) రక్షణము మొదటివిషయము గను. గోరక్షణమనునది, చివరివిషయముగాను ద్రోణుడు సూచించినాడని యభిప్రాయము. అపుడు కర్ణుడు బింకముగా దనకు దుర్యోధనునకు గూడ నాయర్జును డెందునసాటికా డనినాడు, అది విని కర్ణు నుద్దేశించి దుర్యోధనుడు "వచ్చినవా డర్జునుడైన యుద్ధప్రసక్తియే యింకలేదని, పాండవు లింక యడవికి మరలబోవలసినదే యని. వారికి పదుమూడువత్సరము లింకను తీరలేదని" పలికినాడు. ఆ పౌరుషవచనమును భీష్ముడు. ద్రోణుడు, కృపుడు అశ్వత్థామ ప్రశంసించిరి. ఇది వెనుకటి విషయము. ఇపుడర్జును డుత్తరుని ధీరునిగావించుకొని దివ్యరథస్థుడై గాండీవధన్వియై సమీపించుచున్నాడు. అది చూచి ద్రోణుడు మరల నిట్లు పలికినాడు.

యథా రథస్య నిర్ఘోషో యథా మేఘ ఉదీర్యతే
ప్రకంపతే యథా భూమి ర్నైషోఽన్యః సవ్యసాచినః ౨౪
శస్త్రాణి న ప్రకాశంతే న ప్రహృష్యంతి వాజినః

అగ్నయశ్చ న భాసంతే సమిద్ధా స్తన్న శోభనమ్ ౨౪

.... .... ... . .... ... .... .... .... ....

భవణాం రోమకూపాణి సహ్యాస్తా మ్యుపలక్షయే ౨౫

.... ... .... .. .... . . ... .... .... ....

ఉత్పాతా వివిధా ఘోరా దృశ్యంతే క్షత్రనాశనాః
విశేషత ఇహాస్మాకం నిమిత్తాని వినాశనే ౩౦
ఉల్కాభిశ్చ ప్రదీప్తాభి ర్బాధ్యతే పృతనా తవ ౪౦

.... ... . . .... .... . . . .

తస్మ్యసే వాహినీం దృష్ట్వా పార్థబాణప్రపీడితామ్ ౩౨
పరాఙ్ముఖాచ న స్సేనా న కశ్చి ద్యోద్ధు మిచ్ఛతి
వివర్ణముఖభూయిష్ఠాః సర్వే యోధా విచేతసః ౩౩
గాశ్చ ప్రస్థాప్య తిష్ఠామో వ్యాఘానీకాః ప్రహారిణః ౩౪

(మేఘము ట్లుఱుకుచు రథఘోష యున్నది. మిక్కిలిగా భూమి కపించుచున్నది ఆవచ్చువాడు సవ్యసాచి యేకాని వేఱొకండుగాడు. శస్త్రములు ప్రకాశించ లేదు. గుఱ్ఱములు ల్త్సాహముగా గానరా లేదు అగ్నిహోత్రము లు భాసించుట లేదు. ఇది మనకు శోభనముగాదు మృగములు ప్రత్యాదిత్యమై ఘోరప్రవాద మొనరించుచున్నవి. కాకులు ధ్వజాగ్రములందు జేరుచున్నవి. అపశకునములు అభయమును సూచించుచున్నవి నక్కలు సేనామధ్యమునుండి పాఱుచున్నవి. మఱియు నవి యనాహతనిష్క్రాంత మగుచున్నవి. మహాభయము నిది సూచించుచున్నది మీరోమకూపములు కుదుళ్లు పాఱి కానవచ్చుచున్నవి, ధ్రువముగా యుద్ధములందు క్షత్ర

నాశనము గానవచ్చుచున్నది. జ్యోతిస్సులు ప్రకాశించలేదు మృగములు పక్షులు దారుణములై యున్నవి ఘోరమైన యుత్పాతములు క్షత్రనాశనముగా గానవచ్చుచున్నవి. విశేషించి యిపుడివి మనవినాశననిమిత్తముగా నేర్పడుచున్నవి. ఉల్కాపాతములచే నీ సైన్యమంతయు బాధింపబడుచున్నది వాహనము లప్రహృష్టములై ఖేదపరస్థితిగా నున్నవి. గద్దలంతట నీ సైన్యమును చుట్టుముట్టుచున్నవి వాహినిని పార్థబాణప్రపీడితమైనదిగా జూచి నీవు తపించువాడవయితివి. మన సైన్యము పరాభూతమైయున్నది, ఎవ్వండును యుద్ధము నిచ్ఛయించి యుండుటలేదు. యోధులెల్లరు వివర్ణము ఖభూయిష్ఠులై నిశ్చేష్టులై యున్నవారు. గోవుల నిచ్చోటినుండి పంపివేసి మనము యుద్ధాయత్తులమగుదుము'. అని ద్రోణుడు పలికెను.)

ద్రోణు డిపు డర్జునుని యుద్ధోత్సాహమందలి ధాటీని పలికినాడు. కౌరవసైన్య మదిగాంచి దిగులుపడియుండుటను. విపరీతనిమిత్తములను గాంచి కౌరవనాశన సూచకముగా నది యంతయు గానవచ్చుచున్నదని ద్రోణుడు సూచించినాడు.

౧ విపరీతములు గానవచ్చుచున్నవి ఆత్మరక్షయెల్లర కవసరమనునది ద్రోణుని మొదటిమాట. (౭౬ అధ్యాయము) అపరాభూతమై సైన్యము గాన వచ్చుచున్నదిగాన గోనివర్తనపూర్వక యుద్ధప్రక్రియయే యపుడుతగు నని యీ రెండవమాట పలికినాడు. కావున నీరెండవమాట దుర్యోధనప్రసక్తి నెత్తలేదు.

కాని యీ గోనివ_ర్తన ప్రస్తావనము దుర్యోధనునివ_ర్తనమును గూడ సూచించినదియై యున్నది కాగా దుర్యోధనరక్షగాని, గోరక్షగాని యప్పుడువలదని. (నిలుచునది కానేరదని) దుర్యో ధనుడు, గోవులు రణరంగమునుండి తొలగిపోవుట కార్యగతి యని ద్రోణుడు సూచించినట్లయినది. (౪౬ అధ్యాయము) నిష్ఠురమైనను నిజమాడి ద్రోణుడు కార్యగతిని దెల్పగా దుర్యో ధను డిట్లుపలికెను.

అథ దుర్యోధనో రాజా సమరే భీష్మ మబ్రవీత్
ద్రోణంచ రథశార్దూలం కృపంచ సుమహారథమ్ ౪౭-౧
ఉక్తో ఽ యమర్థ ఆచార్యోమయా కర్ణేన చాసకృత్
పునరేవచ వక్ష్యామి నహి తృప్యామి తం బ్రువన్ ౨
పరాజితైర్హి వస్తవ్యం తైశ్చ ద్వాదశవత్సరాన్
వనే జనపదే ఽ జ్ఞాతై రేష ఏవ పణోహి నః ౩
తేషాం న తావ న్నిర్వృత్తం వర్త తేతు త్రయోదశం
అజ్ఞాతవాసో బీభత్సు రథాస్మాభి స్సమాగతః ౪
అనివృత్తే ఽ పి నిర్వాసే యది బీభత్సు రాగతః
పున ర్ద్వాదశవర్షాణి వనే వత్స్యంతి పాండవాః ౫
లోభాద్వా తే న జానీయు రస్మాన్వా మోహ ఆవిశత్
హీనాతిరిక్త మేతేషాం భీష్మో వేదితు మర్హతి ౬
అర్థానాంహి పునర్ద్వైధే నిత్యం భవతి సంశయః
అన్యథా చింతితో హ్యర్థః పునర్భవతి చాన్యథా ౭
స్వార్థే సర్వే విముహ్యంతి యే ఽ పి ధర్మవిదో జనాః
ఉత్తరం మార్గమాణానాం మత్స్యానాంచ యుయుత్సతామ్

యది బీభత్సు రాయాత స్తదా కస్యాపరాధ్నుమః ౬
ఆస్మాన్ యోద్ధు ముపాయాతో మత్స్యో వాపి స్వయం
భవేత్

యద్యేష రాజా మత్స్యానాం యది బీభత్సు రాగతః ౧౬
సర్వై ర్యోద్ధవ్య మస్మాభి రితి నః సమయః కృతః
అథ కస్మాత్ స్థితా హ్యేతే రథేషు నరసత్తమాః ౧౭
భీష్మో ద్రోణః కృపశ్చైవ వికర్ణో ద్రౌణిరేవచ
సంభ్రాంతమనస స్సర్వే కాలే హ్యస్మి న్మహారథాః ౧౮
నాన్యత్ర యుద్ధా చ్ఛ్రేయో ఽ స్తి తథా ఽ త్మా
ప్రణిధీయతాం

ఆచ్ఛిన్నే గోధనే ఽ స్మాక మపి దేవేన వజ్రిణా ౧౯
యమేన వాపి సంగ్రామే కో హాస్తినపురం వ్రజేత్
శరై రేభిః ప్రణున్నానాం భగ్నానాం గహనే వనే ౨౦
కోహి జీవే త్పదాతీనాం భవే దశ్వేషు సంశయః
ఆచార్యం పృష్ఠతః కృత్వా తథా నీతి ర్విధీయతామ్ ౨౧
జానాతిహి మతం తేషాం మనస్త్రాసయతీవ నః
అర్జునే చాస్య సంప్రీతి మధికా ముపలక్షయే ౨౨
ఇష్టహి పాండవా నిత్య మాచార్యస్య విశేషతః
తథాహిదృష్ట్వా బీభత్సు ముపాయాంతం ప్రశంసతి ౨౩
యథాసేనా నభజ్యేత తథానీతి ర్విధీయతాం
హేషితం హ్యుపశృణ్వానే ద్రోణే సర్వం విఘట్టితమ్ ౨౪
అశ్వానాం హేషితం శ్రుత్వాకః ప్రశంసాపరో భవేత్

స్థానే వాపి ప్రజాతో వా సదా హేషంతి వాజినః ౨౮
సదాచ వాయవో వాంతి నిత్యం వర్షతి వాసవః
స్తనయిత్నోశ్చ నిర్ఘోషః శూయతే బహుళ స్తథా ౨౯
కి మత్ర కార్యం పార్థస్య కథం వా సః ప్రశస్యతే
అన్యత్రకామా ద్ద్వేషాద్వా రోషా ద్వ్యాప్మాసు కేవలాత్
ఆచార్యావై కారుణికాః ప్రాజ్ఞా శ్చోపాయదర్శినః
నైతే మహాభయే ప్రాప్తే సంప్రష్టవ్యాః కథంచన ౩౦
ప్రాసాదేషు విచిత్రేషు గోష్ఠీ ష్వావవనేషుచ
కథా విచిత్రా కుర్వాణాః పండితా స్తత్ర శోభనాః ౩౧
బహూ న్యాశ్చర్యరూపాణి కుర్వంతో జనసంసది
ఇజ్యా స్త్రే చోపసంధానే పండితా స్తత్ర శోభనాః ౩౨
అన్నసంస్కారదోషేషు పండితా స్తత్ర శోభనాః ౩౪
పండితాన్ పృష్ఠతః కృత్వా పరేషాం గుణవాదినః
విధీయతాం తథానీతి ర్యథా వధ్యేత వై పరః ౨౫
గావశ్చ సంప్రతిష్ఠాప్య సేనాం వ్యూహ్యా సమంతతః
ఆరక్షాశ్చ విధీయంతాం యత్ర యోత్స్యామహే పరాన్ ౩౬

ద్రోణుడు పలికినపైని దుర్యోధనుడా సమరమందు భీష్మునితో నిట్లనెను. ద్రోణుని గృపుని గాంచి యిట్లు పలికెను. పలుమాఱుగా నాచేత కర్ణునిచేత నాచార్య డుక్తార్థుడైయున్న వాడు, మరల చెప్పుచున్నాను. అతనికి దెల్పి తృప్తుడనగుట లేదు. పరాజితులైనవారిచే ద్వాదశవత్సరములు వనవాసము,

అజ్ఞాతవాసము గావింపబడవలెనంచు మన పణముకదా. వారి కింకను ఆసమయము పూర్తికాలేదు. పదుమూడవవత్సరము వర్తించియేయున్నది. అజ్ఞాతవాసము పూర్తికానిదే బీభత్సుడు వచ్చుచో పాండవులు మరల ద్వాదశవత్సరములు వనమందు వసింపవలసియేయున్నది. లోభత్వమున వారలది తెలియరో మనలనే మోహమావేశించినదో, హీనాతిరిక్తములు భీష్ముడు తెలియందగినదై యున్నది ఉర్థములద్వైధీభావమున నిత్యము సంశయమేయుండును. అన్యథాచింతితార్థముల మరల నన్యథా కాగలదు. ధర్మవిదులగు జనులును స్వార్థమందు మోహ మొందెదరు. మాత్స్యుల యుద్ధవిషయమం దుత్తరునితోడ బీభత్సుడేతెంచుటయం దెవ్వరపరాధులు మయ్యేదముకదా; త్రిగర్తలనిమిత్తముగ మాత్స్యులతో బోరాడ మనము వచ్చి యున్నాముకదా. మాత్స్యుల విప్రకారము లనేకములు వారు మన కెఱిగించియున్నారు. బహుళ సప్తమినా డపరాహ్ణకాలమున త్రిగర్తులు గోవులబట్టుటకు, నష్టమనా డుదయ కాలమునకు మనము గోవులను పట్టుటకు నిశ్చయమొనరించి యుంటిమికదా. ఆవిషయ మేమిజరిగినదో. వారిని రాత్రికాల మందే-యాత్రిగర్తులను పారదోలి మనపైకి విరాటుడే రానిందు విరాటుడుగాని, బీభత్సుడుగాని యెవ్వరువచ్చినను నందఱము యుద్ధమొనరింతమని సమయమొనరించి యిట వచ్చియున్నాము కదా. ఇది కాగా నీ నరసత్తములు రథములందే యున్నవారై యిట్లగుచున్నారుకదా, భీష్ముడు, ద్రోణుడు, కృపుడు,

వికర్ణుడు, అశ్వత్థామ - కాలముండీ మహారథులెల్లరు సంభ్రాంత మనస్కులగుచున్నారుకదా. యుద్ధముకంటె శ్రేయ మింకొకటిలేదు. అట్లుగా మనము గావింపవలసినది. గోవులను పట్టితిమి. దేవేంద్రుడే వచ్చినను యముడే వచ్చినను హాస్తి నాపురమున కెవ్వడు పోవును. ఆచార్యుని వెనుకనుంచి యట్లు నీతిగావింపుడు. వారిమతము తెల్లమగుచున్నది. మనకు మనస్తాపిన గావించుచున్నాడు. అర్జునునందతని అధికప్రీతిని దిలకించుచున్నాము. ఆచార్యునకు విశేషించి నిత్యము పాండవు లిష్టులు. అట్లే బీభత్సుడు వచ్చుచుండునపుడే ప్రశంసించుచున్నాడు. సేన భగ్నమొందకుండునట్లు నీతిగా వింపుడు. హ్రేషితము వినుటయేతడవుగా ద్రోణునందు సర్వము చెట్టయేర్పడుచున్నది. అదేశికమై మహారణ్యమందు. గ్రీష్మమున శత్రువశమొందినట్లుగా మనసైన్యము విఘట్టితము కాకుండు నట్లు నీతిరిగావింపుడు. విశేషించి యాచార్యునకు పాండవులు నిత్య మిష్టులు. ఆతడును నట్లే యేర్పడి పలికియున్నవాడు. అశ్వముల హ్రేషితముల విని యెవ్వడు ప్రశంసాపరుడగును కదా, స్థానమందు బోవుచును సదా గుఱ్ఱములు సకిలించును, సదా గాలివీచును. వాసవుడు నిత్యము వర్షించును, మేఘములు గర్జించుచుండును—ఇట్లని బహుళశ విశ్రుతమే కదా. పార్థప్రశంస యెట్లుయేమి కార్యమయినది. అన్యత్రకామముననో ద్వేషముననో. మనపై కేవలము రోషముననో యిట్లుకల్గినదికదా. ఆచార్యులు కరుణగలవారు. ప్రాజ్ఞులు. ఉపాయదర్శకులు.

అయిన పెద్దభయ మేర్పడినపుడు వారినడిగి యెట్టును ప్రయోజనము కానేరదు. విచిత్ర ప్రాసాదములందు, గోష్ఠులందు ఉపవనములందు విచిత్రకథలు చెప్పువారై యచ్చట పండితులు శోభించెదరు. జనసమ్ముఖమున ఆశ్చర్యాదూపములు వెక్కు గావించుచు నిజ్యాస్త్రోపసంధానవిషయకముగా బండితులు శోభించెదరు. పరవివరజ్ఞానమందు, మనుష్యచరిత ములందు. హ_స్త్యశ్వరథచర్యలందు, ఖరోష్ట్రాజావికర్మలందు గోధనము లందు. రథ్యములందు, వరద్వారముఖములందు, అన్నసంస్కార దోషములందు బండితులు శోభించెదరు. పరగుణవాదులగు బండితులను పృష్ఠమొనర్చి యట్లు నీతిగావింపుడు పరుడు వధ్యు డగునట్లు చూడుడు. గోవులను బంపివేసి, సేనావ్యూహ మంతటనొనరించి- ఆరక్షవిధించి, పరుల నెదిరింతము. ఇట్లుగా దుర్యోధనుడు పలికెను

విపరీతనిమి_త్తముల బొడగాంచి ద్రోణుడాత్మరక్షణమం దెల్లవారుండ దగునంచు బలికి యాపిమ్మటిది గోరక్షణవిషయమని సూచించినాడు. దుర్యోధనరక్ష, గోరక్ష- యీ రెంటిని సూచించుచు ద్రోణుడు నిదానయుక్తుడై యారంభదశయందే పరిస్థితినెల్ల ద్యోత్యమొనరించి యున్నాడు. అర్జునుడు సమీపిం చుచుండుటనుగాంచి యిపుడు ద్రోణుడు స్వపక్షవినాశహేతువగు చున్నదని' సూచించినాడు స్పష్టమిట్లాడి ద్రోణుడు 'గోవుల నిటనుండి తరలించి సేనావ్యూహమొనరింప దగును' అని తెల్లమొనరించినాడు. ఈప్రసంగమందు ద్రోణుడు దుర్యోధన

విషయము స్పష్టముగా ప్రస్తావించలేముగాని ప్రసంగవైఖరి యందు దుర్యోధనరక్షను నిరూపించువాడైనాడు ఇదిచూచి సహించనివాడై దుర్యోధనుడు భీష్మునితో సంగ్రామమందు విపరీతప్రసంగమొనరించెను దుర్యోధనుడు భీష్మునెదుట ప్రసంగమారంభించి ద్రోణుని, కృపుని వీక్షించుచు నీ ప్రసంగమును సాగింపజొచ్చినాడు. కాగా దుర్యోధనుడు పెద్దలనుగూర్చి పెద్దలతోడ విపరీత మాచరించుచున్నాడని పర్యవసాన మగుచున్నది దుర్యోధనుడు 'ఉక్తో ౽ యమర్థ ఆచార్యాః' అనినాడు 'నే నాచార్యులకు జెప్పితిని' అని కాదు దీని యర్థము. ఈమాట ఆచార్యు నెదుటనిలిపి దులుపుటగా దుర్యోధను డనుచున్నాడని గ్రహింపవలెను 'మయా కర్ణేన చాపకృత్' అనునది దుర్యోధనుని దుష్టత్వమునంతకను వెల్లడించు చున్నది 'పునరేవచ వక్ష్యామి, నహి తృప్యామి తం బ్రువన్' అననవి నుఱియు మఱియు దుష్టవచనములై యున్నవి. 'నేను కర్ణుడు గురువులవారికి పలుమాఱుగా గడ్డిపెట్టినట్లయినది మరల బెట్టుచున్నాను. వారికి బుద్ధిరాలేదు' అని దుర్యోధను డనినాడని యభిప్రాయము.

కర్ణుడు 'న చార్జునః కళాపూర్ణః మమ దుర్యోధనస్యచ' అని పలికినాడు. అట్లే దుర్యోధనుడుగూడ తన్ను కర్ణునిమాత్రమే. యిపుడు నిర్దేశించి పలుకుట యెంతయో దుష్టస్వభావమై యున్నది.

"పరాజితైర్హి న స్తవ్యం త్రైశ్చ ద్వాదశవత్సరాన్" అని దుర్యో ధనుడనినాడు. "జూదమందు బరాజితులు" అని స్పష్టము పలుకుట తనకే నామూషీకలిగించును. కావున నిది మినహాయించినాడు. "పరాజితులైనవారు పండ్రెడు వత్సరములు వనవాస మొనర్చుట మన పణము" అని దుర్యోధనుడు పలికినాడు ఇది దుర్యోధనుని దౌష్ట్యమును తెల్పుచున్నది అర్జునుడు బయలు పడిననాటికి పాండవుల కజ్ఞాతవాసము సంపూర్తియైనదని దుర్యోధనుడు తెలియలేడు. సమయపాలనమందు పాండవులనుసరించిన విధాన మంత పర్యాలోచనము కౌరవులకు దెల్లమగుటలేదని యిది స్పష్టము గావించుచున్నది. ఇంకను ౫ నెలల ౧౨ రోజులు తరువాయి యున్నదంచు కౌరవుల తలంపై యున్నది ఈ విష మింకను ఘోరముగా నతడిట్లు పలుకుచున్నాడు. "లోభాద్వా తేన జానీయు రస్మాన్వా మోహ అవిశత్" అని దుర్యోధను డనినాడు పాండవులకు లోభమేర్పడినదని, ద్రోణాదులకు మోహమావేశించినదని దుర్యోధనుని భావమైయున్నది తొందర పడి యర్జునుడు రభసముగా బయల్పడియుండగా నావిషయము తెల్పగ ద్రోణుడిట్లు విపరీతమాడుట ఘోరము. పాండవపక్షపాతమే" - ఇట్లని దుర్యోధనుడు ద్రోణుని విశిష విమర్శనాలు గావించుచున్నాడు కావుననే శంకానివారణార్థముగా గాక "హీనాతిరిక్త మేతేషాం భీష్మో వేదితు మర్హతి" అని దుర్యోధనుడు పలికినాడు. "ఈ పెద్దను గూర్చి యీ పెద్దయే తెలియదగి యున్నది" అని దుర్యోధను డనినాడని భావము.

దుర్యోధను డిట్లు భీష్మద్రోణుల నిద్దఱను విమర్శపాలు గావించు వాడగుచున్నాడు.

"స్వార్థే సర్వే విముహ్యంతి యేఽపి ధర్మవిదో జనాః" అని దుర్యోధనుడు ధర్మపరులనుగూర్చి పలికినాడు. ఈమాట యర్జునునిది తొందరపాటని, ద్రోణునినిది వేగిరపాటని దుర్యోధను డనినట్లు తేలుచున్నది. కావుననే యాపైమాట 'ఉత్తరుని వెనుక నర్జునుడువచ్చుటయందు దోషమెవ్వారిది 'అని యాతడు పలికినాడు.

బహుళసప్తమినాడపరాహ్ణకాలమున సుశర్మ గోవులను పట్టుటకు, మఱునా డష్టమినాడు సూర్యోదయకాలమున కౌరవులు గోవులను పట్టుటకు కౌరవమంత్రాంగమున నిశ్చయమైనది. విరాటుడేకాని, బీభత్సుడే కాని ఎవ్వ రెత్తివచ్చినను యుద్ధమొనర్ప నిశ్చయించుకొనియే వారువచ్చినట్లు నిశ్చయమగుచున్నది. కౌరవమంత్రాంగమం దిది స్పష్ట ముల్లేఖింపబడకున్నను దుర్యోధనుని క్రూరచిత్తము నిది తెల్పుచున్నది, మఱియు భీష్మాదులవిషయకమగు నిర్బంధము నిదితెల్ల మొనర్పుచున్నది.

అర్జును డెదురగుటతో భీష్మద్రోణముఖులు విత్రస్తులయిరి ఎల్ల ఱు హతోత్సాహులైరి. పరిస్థితి యిట్లుతేలగా గమనించియు దుర్యోధనుడు విపరీత మాడుచున్నాడు. 'భీష్మాదులు' అని

పలుకుట కొంతమాటయగును. అట్లుగాక 'భీష్ముడు. ద్రోణుడు కృపుడు వికర్ణుడు అశ్వద్ధామ-మహారథులందఱు కాలమందు సంభ్రాంతమనస్కులైనారు' అని పలికినాడు దుర్యోధనుడు. ఇది (ఈ ఏకవచనములు) ఉదారులవిషయమై నిశితవిమర్శనమే యగుచున్నది.

'దేవేంద్రుడేవచ్చినను, యముండువచ్చినను గోవులనువిడిచి హస్తినాపురము నెవడు ప్రవేశించును' అని దుర్యోధను డని నాడు. దైవములేని మాట వానినోట వచ్చినది. గుఱ్ఱముల మధ్యనే వనభగ్నుడై యున్న యర్జునుడు భంగమొందగలడని దుర్యోధనుడు పలుకుట వానిబుద్ధిహీనతను తెల్పుచున్నది. నిష్ఠురమైనను నిజపరిస్థితిని తెల్పుచున్న ద్రోణునిగూర్చి సైన్యమును కలగుండు గావించుచున్నాడని. అదిమనస్తాప మగుచున్నదని. అర్జునపక్షపాతమున నాతడు సమస్తము చెడగొట్టుచున్నాడని. గుఱ్ఱములసకిలింతలు వినుటయేతడవుగా నతడు సర్వవిఘట్టిత మాచరించుచున్నాడని. అనాయ కాసహాయస్థితి యందు సైన్యమును ద్రోణుడు ముంచివేయుచున్నాడని' దుర్యోధనుడు విస్తారప్రసంగము గావించి "ఆచార్యుని వెనుకపెట్టి తగునేర్పాటు గావింపవలసినది' అనినాడు పాండవు లాతని కిష్టులని. అట్లని ద్రోణుడే స్వయముపలుకుట ఘోరమని దుర్యోధనుడు పలికినాడు, మఱియు "అశ్వానాం హేషితం శ్రుత్వా కః ప్రశంసాపరో భవేత్' అనినాడు.

"మార్గమున బోవుచు గుఱ్ఱములు సకిలించును' అని దుర్యోధను డాపిమ్మట పలుకుట దుష్టవచనమైయున్నది. "వాయువు వీచుచుండును. వాసవుడు వర్షించుచుండును మేఘ ముఱుముచుండును—అని పలుమాఱు వినబడినదికదా' అనుచు దుర్యోధనుడు "కాక యర్జునుని ప్రకసింప నిపుడు జరుగురేమికల్గినది" అని ఘోరముగా బలికినాడు కాగా గురువు గారు 'ప్రేలుడుకాయ' అని దుర్యోధనుడు తేల్చినట్లయినది. "శూ్రియతే బహుళః" అనునది "ఎక్కువగా ప్రేలుచున్నా డనియు నర్థము గల్గించుచున్నది. మంచివిషయములు పలుకుచు చండాలము పర్యవసానము గావించుచున్నాడు దుర్యోధనుడు, మఱియు "అన్యత్ర కామమో, కేవలము మన యెడల దోషమో యీ ప్రసంగమునకు గారణమగును" అనినాడు.

స్తనయిత్నోశ్చ నిర్ఘోషః శ్రూయతే బహుళ స్తథా
[*] కి మత్ర కార్యం పార్థస్య కథం వాసః ప్రశస్య తే
అన్యత్రకామా ద్ద్వేషాద్వా రోషా ద్వాస్మాసు కేవలాత్

---

[*] వ్యాస వాల్మీకుల గ్రంథములందు వాక్యసంజ్ఞలు గుర్తులు (Punctuation) ఉంచుటకుగాదు. పాదములు ముందువెనుకలుగా నూపునొందుచు విచిత్రాన్వయము. విచిత్రార్థము భిన్నభిన్నార్థము కల్గించుచుండును. అయా పాత్రల హృదయగత మిందు బహుభంగుల వివరణమగుచుండును.

ఇంపలి పద్యపాదము ముందుపాదముతో జత యై "ద్రోణుడు ప్రేలుడుకాయ. నోటికివచ్చునట్లు ప్రేలుచున్నాడు. అని యర్థమిచ్చుచున్నది, పిమ్మటపానముతో జతయై ద్రోణుడు పరపక్షపాతి. కౌరవుల కహితుడు' అని యర్థమిచ్చుచున్నది. ద్రోణాచార్యుని గూర్చి దుర్యోధను డిట్లు నోటికివచ్చినట్లు ప్రేలువాడయినాడు, ఆచార్యులవారు సర్వోత్తములయ్యు నిరుపయోగులనుచు పండితులను గూర్చి దుర్యోధనుడు ఘోర ఘోర ప్రసంగము గావించినాడు, "కబుర్లుచెప్పుటకే పండితులు పనికివత్తురని. జనసంపత్తునందుమాత్రమే వారశ్త్రప్రజ్ఞ గనపఱచగలవారని, ప్రత్యక్షరణరంగమందు గాదని, మృగపక్షి మనుష్యుల బాగోగులను చెప్పువారు మాత్రమే వారని పలికి దుర్యోధనుడు చివరకు "అన్న సంస్కార దోషములందు పండి తులు శోభింతురు. అనినాడు. "దోషేషు" అని చివరగా దుర్యోధనుడనుట మఱియు ననార్యప్రసంగమైయున్నది. ఏక వచనము నుండి బహువచనము పలుకుట మఱియు గార్యహాని యగుచున్నది. ఒళ్లుపైదెలియని కాఱులు దుర్యోధనుడు ప్రేల జొచ్చినాడు, "పరగుణవాదులైన పండితులను పృష్ఠమొనరించి పరుడు వధ్యుడగునట్టి నీతిగావింపవలసినది, గోవుల నిటనుండి మరలించి, సేనావ్యూహమొనరించి శత్రువు నెదుర్కొని రక్ష గావింపవలసినది' అని చివరగా దుర్యోధనుడు పలుకుట వాని

దుష్టత్వమును వాని తామసికవచనము ను వ్యక్తీకరించుచున్నవి. ఇన్ని చివాట్లు పెట్టి దుర్యోధనుడు కడకు ద్రోణునిమాటను పాటించుచు "గావశ్చ సంప్రతిష్ఠాప్య సేనాం వ్యూహ్యా సమంతతః' అని పలికినాడు. కాగా నిష్ఠురసత్యవాదియగు ద్రోణుడు కాలోచితమును సాధించు నుదారుడే యగుచున్నాడు. మన్యు ప్రతప్తుడు దుర్యోధను డిట్లుద్వేగప్రసంగము గావింపగా నందుపై గర్ణు డిట్లు పలికినాడు.

సర్వా నాయుష్మతో భీతాన్ సంత్రస్తా నివ లక్షయే
అయుద్ధమనసశ్చైవ సర్వాం శ్చైవా నవస్థితాన్ ४౮-౧

సమాహితోహి బీభత్సు ర్వర్షా ణ్యష్టౌచ పంచచ
జాతస్నేహాశ్చ యుద్ధే ऽ స్మిన్ మయి సంప్రహరిష్యతి ౬

పాత్రీభూతశ్చ కౌంతేయో బ్రాహ్మణో గుణవా నివ
శరౌఘాన్ ప్రతిగృహ్ణాతు మయాముక్తాన్ సహస్రశః
అద్యాహ మృణ మక్షయ్యం పురా వాచా ప్రతిశ్రుతం
ధార్తరాష్ట్రస్య దాస్యామి నిహత్య సమరే ऽ ర్జునమ్ ౧౦

తమగ్ని మివ దుర్ధర్ష మసిశక్తిశరేంధనం
పాండవాగ్ని మహం దీప్తం ప్రదహంత మివా హి తాన్ ౧४

అశ్వవేగపురోవాతో రథౌఘ స్తనయిత్నుమాన్
శరధారో మహామేఘః శమయిష్యామి పాండవమ్ ౧౫

మత్కార్ముకవినిర్ముక్తాః పార్థ మాశీవిషోపమాః
శరా స్సముపసర్పంతాం వల్మీక మివ పన్నగాః ౧౬

జామదగ్న్యా న్మయా హ్యస్త్రం సంప్రాప్త మృషిసత్తమాత్

తదుపా్రశిత్య వీర్యంచ యుధ్యేయ మమరై రపి ౧౭
ధ్వజా్రగే వానర స్తిష్ఠన్ భల్లేన నిహతో మయా
అద్యైత పతతాం భూమౌ వినదన్ భైరవాన్ రవాన్ ౧౮
శత్రోర్మయా విపన్నానాం భూతానాం ధ్వజవాసినాం
దిశః ప్రతిష్ఠ మానానా మస్తుశబ్దో దివంగమః ౨౦
అద్య దుర్యోధన స్యాహం శల్యం హృది చిరస్థితం
సమూల ముద్ధరిష్యామి బీభత్సుం పాతయన్ రథాత్ ౨౧
హతాశ్వం విరథం పార్థం పౌరుషే పర్యవస్థితం
నిశ్వసంతం యథానాగ మద్య పశ్యంతు కౌరవాః ౨౨
కామం గచ్ఛంతు కురవో ధన మాదాయ కేవలం
రథేషు వాపి తిష్ఠంతో యుద్ధం పశ్యంతు మామకమ్ ౨౩

(అయాప్పంతు లెల్లరు సంత్రస్తులై యున్నట్లు లక్షించు చున్నాను. అయుద్ధమనస్కులై యుండుటు గాంచు చున్నాను. విరాటుడే రానిమ్ము బీభత్సుడే రానిమ్ము, ఎవ్వరు వచ్చినను నేను నివారించెదను. మకరాలయమును ఒడ్డు నతిక్ర మించనటుల నేనువారించెదను. నేను ప్రయోగించిన బాణ ములు తిరోహితమగునవి కావు. శలభములు పాదపమునట్లు నాశరములు ముంచివేయగలవు, నా ధనుష్టంకారమును భేరీ శబ్దమట్లు వినవలసినది. ఎనిమిది అయిదు వత్సరములు (ఆరణ్యా స్వర్గవాసము) గావించి జాతస్నేహమున వచ్చినట్టి బీభత్సుడు గుణవంతుడగు బ్రాహ్మణు నట్లు వచ్చియున్నవాడు. మత్ప్ర యుక్త శరౌఘముల నాతడు ప్రతిగ్రహించునుగాక, ఆతండును

త్రిలోకవిశ్రుతుండే. నేను గూడ నయ్యర్జునునికన్న యెంతున నవరుడగాను, ఆకాశమును మిడతలు క్రమ్మినట్లు నేనంతట బ్రయోగించిన బాణపరంపరను చూచెదరుగాక పూర్వ వాక్ప్రతి శ్రుతమగు నఋయఋణమును ధార్తరాష్ట్రునికి గొసంగెదను. అర్జునుని సంహరించి (ఋణవిముక్తుడ నయ్యెదను) .........

అసిశక్తి శరేంధనమై దుర్ధర్షమగు నగ్నియట్లున్న పాండవాగ్నిని చల్లార్చెదను. అశ్వవేగమను వాతము, రథఘోషమను గర్జనము శరధారయను మహా మేఘమునగు నర్జునుండను మహా మేఘమును శమింపజేసెదను. ఆశీవిషోపమగు నాశరములు పాములు పుట్టను చుట్టుకొనునట్లు పార్థుని జుట్టుకొనగలవు. కర్ణికారములచే నచలమునట్లు శరాక్రాంతుడగు గౌంతేయుని జూడవలసినది. ఋషిసత్తముడగు జామదగ్నివలన సంప్రాప్తమైన యస్త్ర ప్రభావంబున వీర్యమున నమరులతో గూడ యుద్ధమొనర్పు వాడనే నేను. భల్లనిహతమైన వానరధ్వజము భైరవరవమున నేలంబడు నిప్పుడే ధ్వజస్థభూతములు పరుగులిడగా నేర్పడిన శబ్దము దివంగతము కాగలదు బీభత్సుని రథమునుండి పడవేసి దుర్యోధనునకు హృదిచిరస్థితమైయున్నట్టి శల్యము నూడబెటి కెదను. హతాశ్వుడు విరథుడు, పౌరుషపర్యవస్థితుడు. సర్ప మట్లు బుసగొట్టువాడునగు బార్థుని గౌరవు లిపుడు గాంచ గలరు. కామతః కౌరవులు గోవులను గొనిపోవచ్చును. కాక రథస్థులై నాయొక్క యుద్ధమును చూడవచ్చును-అని కర్ణుడు పలికెను )

యుద్ధగతులైన ప్రవీరలోకమునుగూర్చి కర్ణుడు తృణీకారవచనములు పలుకుచున్నాడు. "సర్వా నాయుష్మతో భీతాన్, అయుద్ధమనసః" అనినాడు, "పార్థబాణ ప్రపీడితమైనట్లు మనవాహిని గలదు, సైన్యమంతయు బరాభూతమై యున్నది. ఒక్కండును యుద్ధమొనర్ప నిశ్చయించియుండ లేదు. యోధులెల్లలు వివర్ణముఖ భూయిష్ఠులై గానవచ్చుచున్నారు" అని ద్రోణుడు పలికియున్నాడు; ఈ యథాస్థితిని గమనించియు దుర్యోధనుడు, కర్ణుడు నిరువురును ద్రోణవచనములను సహింపజాలక పోయిరి, విపరీతములు పలికిరి. అందఱు సంభ్రాంతమనస్కులగుట [౪౩-౧౮] అయుద్ధమనస్కులై భీతిల్లియుండుట [౪౮-౧] తిలకించుచు నదే నోట వచించుచు గూడ నెల్లర ట్లగుట నెంతయో యాక్షేపించువారై దుర్యోధన కర్ణులుభయులు పలుకజొచ్చిరి. అర్జును డెదురగుటతో నిట్టి సంచలన మా కౌరవులం దేర్పడినది.

అందఱను తెగనాడిపలుకుట కర్ణునిస్వభావమని యిది తెల్పుచున్నది. యుద్ధగతుల నుద్దేశించి ఆయుష్మంతులని పలికినాడు, పెద్దల విషయమై పలుకుట, ఎల్లర నుద్దేశించి పలుకుట కర్ణుడాచరించినాడు, మాటలాడుటలో పాండవులకే కాదు స్వపక్షము వారికిని మనసు గుందించుమాటలు పలుకుట కర్ణునకు నైజమై యున్నది. ఇట్లందఱను తూలనాడి తానొక్కరుడే యుద్ధము గావించెదనని కర్ణుడు బీరములు పలికినాడు.

గుజ్జములు సకిలించును, వాయువు వీచుచుండును. మేఘ ఘుఘుమును. ద్రోణుడు ప్రేలుచున్నాడు- ఇట్లుగా దుర్యోధనుడు పలికియున్నాడు. కర్ణునదే విషయము మరల ముదలకించి పలుకుచున్నాడు. అశ్వవేగమే వాయువు. రథౌఘమే ఉఱుము. శరధార యేమహామేఘము.-ఇట్లనిపలికి "అర్జునాగ్నినిచల్లార్చివేసెదను" అని కర్ణుడు పలికినాడు.

అర్జునుని సమరమునవధించి ధార్తరాష్ట్రునకు ఋణవిముక్తుడనయ్యెదనని పలుకబోయిన కర్ణునినోట "అక్షయ ఋణదాత నయ్యెదను" అని వచనసందర్భ మేర్పడినది. "అద్యాహ మృణ మక్షయ్యాం....దాస్యామి' అనినాడు, "దాస్యామి" అనునది తీర్చెదను, ఇచ్చెదను—అను రెండర్థము లను గల్గియున్నది. ఋణవిముక్తుడ నయ్యెద ననునది కర్ణునుద్దేశము. "అక్షయ ఋణదాత నయ్యెదను" అని కర్ణునినోట విధివిచిత్రవచన మేర్పడినది.

'ఋషిసత్తముడగు జామదగ్నియొద్ద పడసిన యస్త్రవీర్యమున నే నమరులతోగూడ యుద్ధమొనర్చువాడనే అని కర్ణుడు నిషేధవచనము పలికినాడు. అనంతమగు గౌరవసైన్యమును గాంచి దిగ్భ్రాంతుడైన యుత్తరుడు "దేవైరపి దురాసదం" అని పలికినాడు (౭౮-౧౧) అర్జును డాయుత్తరుని దేర్చునట్టి సందర్భములో నాకౌరవ సైన్యమునుగూర్చి పలుకువాడై "దేవైరపి" అను పదమును మినహాయించి "దురాసదం" అని మాత్రమే పలికినాడు. (౭౮-౩౧) ఇది దేవతలం

దర్జునునకు గల భూరిభావమును తెల్పుచున్నది. మఱియు నర్జును డుత్తరునకు ధైర్యోత్సాహములు గల్గించుచు గురుదేవతాశిక్షణ మున్నతి కారకమని విశేషించి పలికినాడు. (౪౫-౩౯-౪౧) ఇది కర్ణార్జునులయొక్క ఘనాల్పములను హృదయ సంస్కారముల తారతమ్యమును తెల్పుచున్నది. కర్ణు డిట్లశక్త దుర్జ సత్వమును పలికినాడు. మఱియు స్వపరపక్షముల రెంటిని దృఢీకరించుచు ప్రసంగించినాడు. (౪౭-౨౨.౨౩) "వచ్చిన వాడు ఫల్గుణుడు కావున గోవులనిచ్చోటనుండి తొలగించి నిలుచుటయే కార్యము' అని ద్రోణుడు పలికినాడు. దానికి సహింపక దుర్యోధనుడు. కర్ణుడు-ఉభయులు విపరీతము పలికినారు, "వచ్చినవా డర్జునుడేయగుచో వనమునకు బొమ్మనుటయే కార్యము, యుద్ధమే తటస్థించిన గోవులనిటనుండి మరలించి యుద్ధమొనర్తుము' అని దుర్యోధను డనినాడు, "అర్జునుని నేనే పడవేయుదును. కామతః కౌరవులిచ్చోటనుండి గోవుల మరలించుకొని పోవచ్చును లేక మామకయుద్ధమును చూడవచ్చును' అని కర్ణుడు పలికినాడు. గోనివర్తనవిషయకమగు ద్రోణవచనము నిట్లాలమొనర్చుచు కర్ణదుర్యోధనులు పలికినారు. అది చూచి కృపు డిట్లు పలికెను

సదైవ తవ రాధేయ యుద్ధే క్రూరతరా మతిః
అర్థానాం ప్రకృతిం వేత్సి నానుబంధ మవేక్ష్యసే ౪౮-౧
మాయాహి బహవ స్సంతి శాస్త్ర మాశ్రిత్య చింతితాః

తేషాం యుద్ధంతుపాపిష్ఠం వేదయంతి పురావిదః ౯

.... .... .... .... .... .... .... .... .... .... .

ఏకః కురూ నభ్యరక్ష దేక శ్చాగ్ని మతర్పయత్ ౬

.... .... .... ... .... .... .... .... ... ....

[*] 1 ఏక స్సుభద్రా మారోప్య ద్వైరథే కృష్ణ
మాహ్వాయత్

[*] 2 దైవతై రప్యవధ్యా స్తే ఏకేన యుధి పాతితాః
ఏకేనహి త్వయా కర్ణ కిం నా మేహ కృతం పురా ౧౧

[*] సన్యాసివేషమున నర్జునుడు ద్వారకానగరమునకు వచ్చినట్లు కృష్ణార్జును లొక్కటై బలరామునికి దెలియనీయక సుభద్ర యిష్టమును గావించినట్లు దక్షిణదేశ భారతప్రతులందు గలదు ఉత్తరదేశ ప్రతులం దట్లులేదు. తీర్థయాత్రగావించు నర్జునుడు ద్వారకానగరమున కేతెంచినాడు, గాంధర్వవిధి నర్జునుడు సుభద్రను రథమెక్కించుకొని యింద్రప్రస్థమునకు వెడలి పోయినాడు. కృష్ణుని గూడ సవాలుచేయువాడై యర్జునుడు సుభద్రనుగొనిపోయినాడని ఈ విషయము సూచించుచున్నది,

[*] "దేవతలకును నవధ్యులగు వారి నర్జునుడొక్కరుండే సంహరించియున్నాడు 'అని కృపుడు పలికినాడు. ఈ మాట దేవతలను తక్కువ పఱచుచున్నదని గ్రహింపదగదు. రాక్షసులు దేవతల కవధ్యులగుటకే ప్రయత్నించెదరు, అట్టి వారిని దేవత లుపాయాంతరమున వధింపజూచెదరు. ధర్మాత్ము

లందు. దేవతలయందు సహజ గౌరవము గల కృపుడు పాండ వుల గూర్చియు, దేవతల గూర్చియు నట్లు చులకనగా మాటాడు వాడు కాడు. కర్ణునిపరముగా మాత్ర మది నిర్లక్ష్యార్థమును స్ఫురింపజేయుచున్నది. ఇట్లుగా నీ శ్లోకార్థము నిచ్చోట గుర్తింప వలసియున్నది. ఈపై శ్లోకమందున్న "ఏకైకేన యథా తేషాం భూమిపాలా వశీకృతాః। ఇంద్రోసి సహి పార్థేన సంయుగే యోద్ధు మర్హతి' అన నదియు గ్రహింపదగును. "ఇంద్రుడును పార్థునితోడ యుద్ధమాడ నర్హుండుకాడు" అను నది ఖాండవదహన విఖ్యాతమును వెల్లడించుచు నింద్రునందు భావమును గల్గించుచున్నది. "నీది వృథాప్రయత్నము, ఇదేమి పౌరుషము ఇట్లని కృపుడు కర్ణుని బజకడుగుచున్నాడని యభి ప్రాయము.

ఏకైకేన యథా తేషాం భూమిపాలా వశీకృతాః
ఇంద్రోపి నహి పార్థేన సంయుగే యోద్ధు మర్హతి ౧౨

... .... .... .... .... .... ... ... ...

ఆశీవిషస్య క్రుద్ధస్య పాణి ముద్యమ్య దక్షిణం
అవముచ్య ప్రదేశిన్యా దంష్ట్రా మాదాతు మిచ్ఛసి ౧౪
అథవా కుంజరం మత్తమేక ఏవ చర న్వనే
అనంకుశ స్సమారుహ్యా నగరం గంతు మిచ్ఛసి
సమిద్ధం పావకం వాపి ఘృత మేదో వసాహుతం
ఘృతాక్త శ్చీరవాసా స్త్వం మధ్యే నోత్సర్తు మిచ్ఛతి ౧౬

ఆత్మానం కః సముద్ధృత్య కంఠే బద్ధ్వా మహాశిలాం
సముద్రం ప్రతరేద్దోర్భ్యాం తత్ర కిం నామ పౌరుషమ్ ౧౭
అకృతాస్త్రః కృతాస్త్రాయ బలవంతం సుదుర్బలః
తాదృశం కర్ణ యః పార్థం యోద్ధుమిచ్ఛేత్స దుర్మతిః ౧౮
ద్రోణో దుర్యోధనో భీష్మో భవాన్ ద్రౌణి స్తథా వయం
సర్వే యుధ్యామహే పార్థం కర్ణ మా సాహసం కృథాః ౨౨

.... .... .... .... .... .... .... .... .... ....

యుధ్యామహేఽర్జునం సంఖ్యే దానవా ఇవ వాసవమ్ ౨౪

(రాధేయ! యుద్ధమందు నీమతి సదాక్రూరతరముగా నుండును. అర్థప్రకృతి నెరుంగుదువుకాని యనుబంధమును చూడవు. శాస్త్రము నాశ్రయించి చింతించిన బహుమాయలు గలవు. అందు యుద్ధము పాపిష్ఠమని పురావిదులు వక్కాణింతురు. దేశకాలసంయుక్తమగు యుద్ధము విజయదమగును. హీనకాలమగునపు డాఫల మింక లభించునది కాదు, దేశమున కాలమున విక్రాంతించుట కళ్యాణకారకము కాగలదు. కార్యముల అనుకూల్యమున నంతరసంవిధాన మగును. రథకారుని భారమును పండితు లవ్యవస్థిత మందురు. ఆలోచింపగా పార్థుని తోడ సన్నిపాతము మనకు క్షమముకాదు- అర్జునుడొక్కడే కౌరవులరక్షించెను. అగ్నిహోత్రుని దృప్తునిగావించెను. ఒక్కండయిదు వత్సరములు బ్రహ్మచర్యదీక్ష గావించెను. ఒక్కండే సుభద్రను రథమెక్కించుకొని (సుభద్రామారోప్య) ద్వైరథమునకు గృష్ణుని సవాలుగావించెను. ఒక్కడే కిరాతరూపస్థితుండగు

ద్రుదునిం దలపడెను. ఈ వనమందే హరింపబడిన ద్రౌపదిని గాపాడియుండెను. ఒక్కడే శక్రునియొద్ద పంచసంవత్సరము లస్త్రశిక్షనొందెను ఒక్కడే చిత్రసేనుడనుగంధర్వుని జయించి కౌరవులకు యశమును కూర్చెను. దేవతలకును నవధ్యులైన నివాతకవచులను, కాలఖుంజులను - ఈ దానవుల నొక్కండు వధియించి యున్నాడు ఓ కర్ణ! నీచే బూర్వము గావింపబడిన దొక్కటి ఘనకార్యమును పేర్కొనుము చూతము. వారలొక్క రొక్కరే భూమిపాలుర వశ్యమొనరించుకొనినట్టివారు. ఇంద్రుడును పార్థునితో యుద్ధమాడ నర్హుండుకాడు. క్రుద్ధాశీవిషము యొక్క కోరలను చేయిపెట్టి తీయునట్లున్నది నీ సాహసము కాక వనమం దెదురులేక తిరుగాడు మత్తకుంజరముపై నంకుశము లేకనే కూర్చొని నగరమందు బోవ నిశ్చయించుచుంటివి. వేగ నిప్పంటుకొను వస్తువులనెల్ల ధరించి యగ్నినుండి దాట నిశ్చయించుచున్నావు మెడలో పెద్దబండ గట్టుకొని హస్తములతో సంద్రము నీదజూచుచున్నావు, ఇదేమి పౌరుషమగును. అకృతాస్త్రుడు కృతాస్త్రుని, బలవంతుని దుర్బలుడు-అట్టివాని నెవ్వాడు ఓ కర్ణా! యెదిరింపజూచువాడగును - ఆ దుర్మతి. ఈతండు పదుమూడుసంవత్సరములు మనచే వికృతుడై యున్నవాడు. పాశవినిర్ముక్త సింహమట్లు మనల నింక నీతడు మిగుల్చువాడు కాడు. కూపమందు సంవృతాగ్నియ ట్లేకాంతమం దాసీనుడైన పార్థుని దెలియక యెదురైనందున మనకీమహాద్భయ మెదురైనది. యుద్ధదుర్మదుండగు పార్థుని మనముచేరి

యెదిరింతము సైన్య మాయత్తమై వ్యూహమొందియుండ వలయును. ద్రోణుడు దుర్యోధనుడు భీష్ముడు నీవు అశ్వత్థామ యక్లేమేము - అందఱము పాణ్డుని దలపడుదము. కర్ణ వలదీ సాహసము - చేరియుండుచో ప్రతి కథమల వార మెదిరింతము. దానవులు వాసవునట్లు యుద్ధరంగమున నర్జునునితో యుద్ధ మొనరింతము-అనికృపుడు పలికెను.

పండితులను ధిక్కరించి యున్న దుర్యోధనునకును ఎల్లర దృణీకరించి యున్న కర్ణునకును నపుడు కృపుడు సమాధానమిచ్చు చున్నాడు. కర్ణ దుర్యోధనులిద్దఱు నపుడెల్లర దృణీకరించియే యున్నారు. కృపుడిపుడు కర్ణునిముందుంచుకొని దుర్యోధనున కును తగు సమాధానము పలుకుచున్నాడు. యుద్ధమందే సదా క్రూరతరమగు మతి గల్గియుండు కర్ణుని దిరస్కరించి పలుకుచు గృపుడు కార్యానుబంధమును వివరించినాడు అర్జునుడొక్క రుడే గావించియున్న ఘన కార్యముల నొక్కొక్కటి వేర్కొని నాడు. అర్జునుడొక్కరుడే గంధర్వరాజు చిత్రసేనుని నిర్జించి కౌరవులకెల్ల యశము గూర్చియున్నాడని కృపు డీసందర్భ ములో బలుకుట దుర్యోధనాదులకు దగుసమాధానమగుచున్నది. రాచపాటిని బురస్కరించుకొనియున్న కృపుని యీతీరు గమ నింపదగినదై యున్నది. "ఉల్కములచే గుంజరమునట్లు నే నర్జునుని నొప్పించెదను. గరుత్మంతుడు పన్నగమునట్లు పార్థుని వివశుని గావింతును. పాండవాగ్నిని శమింప జేయుదును. కర్ణ కారావృతాచలమట్లు కౌంతేయుని శరములచే గప్పివేసెదను,

అని కర్ణుడు బింకము లు పలికియున్నాడు. దీనిని మనసున నిడి కృపుడు 'పాముకోరలు పెఱకజూచుట, అనంకుశముగ వనకుంజరము నెక్కి నగరవీధులందు వర్తింకుట. అగ్నిని ప్రవేశించుట, బండకట్టుకొని సముద్రమును చేతులతోనీదుట వంటిది నీ యీ ప్రయత్నము' అని పలికినాడు. ఇది పౌరుషమగునాయని కర్ణుని నిలవరించుచున్నాడు.

"అకృతాస్త్రాః కృతాస్త్రంవై బలవంతం సుదుర్బలాః" అనుపాద మెంత సమాధానమునో గావించుచున్నది, పాద మధ్యమందున్న "కృతాస్త్రంవై బలవంతం' అననది యర్జున సామంతమును నిరూపించుచున్నది, 'అకృతాస్త్రాః ... .... సుదుర్బలాః' అను నాద్యంతములు కర్ణునెల్లను సూచించు చున్నవి 'సుదుర్మతిః' అను చివరనున్న ప్రథమావిభక్తి విచిత్రముగా నున్నది ఈశ్లోకమం దెవ్వరిపేళ్లు లేకుండుట గమనింపదగినది అర్జును నెదురించుట యెట్టిదో యదియే యిందు విచిత్రముగా ధ్వనించుచున్నది. కౌరవులం దెవ్వరినిగాని యనినట్లు స్పష్టము కాదు.

ఇట్లే 'ద్రోణో దుర్యోధనో భీష్మో భవాన్ ద్రౌణి స్తథా వయం' అను పాదముకూడ చిత్రముగా నున్నదిః ద్రోణుని విమర్శించి పలికిన దుర్యోధనున కిది తగు సమాధానమగుచున్నది, ద్రోణ భీష్ముల మధ్యగా దుర్యోధనుని నిర్దేశించినాడు కృపుడు, ప్రభురతు పండితమధ్యగతమైననే యేర్పడగలదని సూచన. 'భవాన్' అని పాదమధ్యమందు గర్ణుని కృపుడు నిర్దేశించినాడు. పెద్ద లొకదిక్కు, అశ్వత్థామాదు లొకదిక్కుగానైన కర్ణునకు

బ్రదుకుదెరువు గలదని కృపుడు నిలవదీయుచున్నాడు. ద్రోణ ద్రౌణుల మధ్యగా (ఆ తండ్రి కొడుకులకు మధ్యగా) కర్ణదుర్యోధనులను పేర్కొనుట యంత సవాధాన మగుచున్నది. "భవాన్ ద్రోణిః" అను వరుసమాటలు విచిత్రముగా నున్నవి. 'యుధ్యామ పార్జునం సంఖ్యేదానవా ఇవ వాసవం' అనుపాద మెంతవిచిత్రముగానో యున్నది. కృపవచనానంతర మశ్వత్థామ యిట్లు పలికెను.

నచ తావ జ్జితా గావో నచ సీమాంతరం గతాః
న హాస్తినపురం ప్రాప్తా స్త్వంతు కర్ణ నికత్థసే 	౫౦-౧
సంగ్రామాన్ సుబహూన్ జిత్వా లబ్ధ్వాచ విపులం ధనం
విజిత్యచ పరాం సేనాం నాహుః కించన పౌరుషమ్ 	౨
దహ త్యగ్ని రవాక్య స్తు తూష్ణీం భాతి దివాకరః
తూష్ణీం ధారయతే లోకాన్ వసుధా సచరాచరాన్ 	౩
చాతుర్వర్ణ్యస్య కర్మాణి విహితాని స్వయంభువా
ధనం యై రధిగంతవ్యం యచ్చ కుర్వ న్నదుష్యతి 	4

.... .... .... .... .... .... ... .... .... ....

వంచనాయోగవిధిభి ర్వైతసీం వృత్తి మాస్థితః
వర్తమానా యథాశాస్త్రం ప్రాప్య చాపి మహీ మిమామ్ 	౭
సత్కుర్వంతి మహాభాగా గురూన్ సువిగుణా నపి
ప్రాప్య ద్యూతే నకో రాజ్యం క్షత్రియ స్తోష్టు మర్హతి 	౮

.... .... .... .... .... .... .... .... .... ...

ఏకవస్త్రాం సభాం నీతా దుష్టకర్మ ప్రజస్వలా
మూల మేషాం మహత్కృత్తం సారార్థీ చందనం యథా ౧౩
[*] కర్మకారాయిథా స్నూత త తకిం విదురో ఽ బవీత్
యథా శక్తి మనుష్మాణాం శమ మూలతుయామ హే ౧౪
అన్యేషాంచైవ సత్వానా మపి కీటపిపీలికైః
ద్రౌపద్యా స్తం పరికేశం న తుంతుం పాండవో ఽ ర్హతి ౧౫
తుయాయ ధార్తరాష్ట్రాణాం పాదుర్భూతో ధనంజయః
త్వం పునః పండితో భూత్వా వాచం వక్తు మి హేచ్ఛసి ౧౬
వైరాంతకరణో జిష్ణు ర్న న శ్శేషం కరిష్యతి
నైష దేవా న్న గంధర్వా నాసురా న్న చ రాతుసాన్ ౧౭
భయా దిహ న యుధ్యేత కుంతీపుత్రో ధనంజయః
యం య మేషో ఽ భి సంక్రుద్ధః సంగ్రామే నితతిష్యతి ౧౮

---

[*] సభాపర్వములో ద్రౌపదీపరాభవఘట్టమున విదురు డీమాటలు పలికినట్లుగా లేదు. కావ్యప్రయోజనము నుద్దేశించి ప్రయోజనము గూర్చుచు రచన వివిధమార్గముల సాగుచుండును. ఒకఘట్టము యొక్క భావమంతయు నా ఘట్టములోనే తేట పడదు. గ్రంథమును బట్టియు, ప్రకరణమును పట్టియు, ఘట్ట మునకు ముందు వెనుకలనున్న విషయములను పట్టియు, స్థలాం తరములను పట్టియు, పాత్రలను బట్టియు, ఒకేవిషయము పలు మాఱుగా పలురీతుల జెప్పుటను పట్టియు నభిప్రాయము నిర్ణ యింప వలసియుండును. ఇట్టిరచనావిధానము రామాయణ భారతములందు నిండుగాగలదు.

పై యధ్యాయము ప్రారంభమందు 'కర్ణ' అను సంబో ధనము గలదు. అధ్యాయమధ్యమందు "సూత" అను సంబో ధనము గలదు. (౧-౧౪)

వృక్షం గరుత్మాన్ వేగేన వినిహత్య త మేష్యతి
త్వత్తో విశిష్టం వీర్యేణ ధను ష్యమరరా ట్సమమ్ ౧౯
వాసుదేవసమం యుద్ధే పార్థం కో వా న పూజయేత్
దేవేన దేవం యుధ్యేత మానుషేణచ మానుషమ్ ౨౦
అస్త్రం హ్యాస్త్రేణ యో హన్యా త్కో ఽర్జునేన సమః పుమాన్
పుత్రాదనంతర శ్శిష్య ఇతి ధర్మవిదో విదుః ౨౧
ఏతేనాపి నిమిత్తేన ప్రియో ద్రోణస్య పాండవః
యథా త్వ మకరో ర్ద్యూత మింద్రప్రస్థం యథా హరః ౨౨
యథా నైషీ స్సభాం కృష్ణాం తథా యుధ్యస్వ పాండవం
అయం తే మాతులః ప్రాజ్ఞః క్షాత్రధర్మస్య కోవిదః ౨౩
దుర్ద్యూతదేవీ గాంధారః శకుని ర్యుధ్యతా మిహ
నాక్షాన్ క్షిపతి గాండీవం న కృతం ద్వాపరం నచ
జ్వలితో నిశితాన్ బాణాం స్తీక్ష్ణాన్ క్షిపతి గాండివమ్ ౧౪

.... .... ... ... ... ...

యథా సభాయాం ద్యూతం త్వం మాతులేన సహాకరోః
తథా యుధ్యస్వ సంగ్రామే సౌబలేన సురక్షితః ౨౮
యుధ్యంతాం కామతో యోధా నాహం యోత్స్యే ధనంజయం

మత్స్యో హ్యస్మాభి రాయోధ్యో యద్యాగచ్ఛే ద్గవాం పదమ్ ౨౯

(గోవులను (పట్టితిమే కాని) జయించ లేదు, సీమాంతర మునకు బోలేదు. హస్తినాపురమునకు మనము చేర లేదు, కర్ణ! నీ విట్లు పలుకుచుంటివే. (వికత్థసే) అనేక యుద్ధజయములు పొంది విస్తార ధనము నొంది సైన్యవిజయ మొందిన వాడిట్లు పౌరుషము పలుకడు. (పలుకువాడు కాడు.) అవాక్యముగ నగ్ని దహించును, దివాకరుడు నిర్నిమిత్తముగ ప్రకాశించును (వెలుంగుచుండును.) సచరాచర లోకమునంతయు నీవసుంధర నిర్నిమిత్తముగ ధరించుచున్నది. స్వయంభవునిచే చాతుర్వర్ణ్యము వారలకు విహితకర్మలు విధింపబడియున్నవి. అట్లర్థ మొందు వాడు దోషగునొందడు .... ... వంచనాయోగ విధులచే వైతసీవృత్తినొంది యథాశాస్త్రప్రవర్తకునట్లగుచు మహినిబొంది యుండియు గురువులను (విగుణులయినవారయినను వారలను) సత్కరించెదరు. ద్యూతమందు రాజ్యము పొందిన వాడు-అక్షత్రియుడు స్తోత్రము గావించుకొనదగదు. అట్లుగా నృశంసరూపుడీ ధార్తరాష్ట్రుడు-నిర్ఘృణుడు. అట్లుగా విత్తముబొందిన యేవిచక్షణుడిట్లు గావించువాడగును, నికృతిచే వంచనాయోగమున వైశంసికునట్లు చరించువాడువలె-అట్లు గావించును. ఏద్వైరథయుద్ధమున నీవు ధనంజయుని జయించితివి, నకులుని సహదేవుని జయించి వారిధన మెపుడు హరించితివి, ఎందు యుధిష్ఠిరుడు జయింపబడినాడు, బలినాంవరుడు భీము డెందు

(జయింపబడినాడు) ఏ యుద్ధమం దెప్పు డింద్రప్రస్థము నీచే జయింపబడినది అట్లే యేయుద్ధమున ద్రౌపది జయింపబడినది, ఏకవస్త్రయు రజస్వలయు నగుదాని సభకునీడ్చితెచ్చుట యే దీనికెల్ల మూలము, సాహాయ్యార్థియగువాడు చందనము నట్లో (పనియున్నది) అది జరుగునపుడు విదురు డేమిపలికి నాడు— మనుష్యులకు యథాశక్తియగు శమమునుగాంచుచున్నాము, అన్యసత్వములగు- కీటపిపీలికములందును నివి గాంచుచున్నాము అనిపలికెను ద్రౌపదికిగల్గిన యాపరిక్లేశమును క్షమింప పాండ వుడు తగడు ధార్తరాష్ట్రక్షయమునకే ధనంజయుడు ప్రాదుర్భవించినాడు. నీవింక నిపుడు పండితుడనంచు మాటాడు చున్నవాడవు. వైరాంతకరణుడగు జిష్ణుడు మనలనిశ్శేషము గావింపగలడు - దేవతలనుగాదు, అసురులనుగాదు, రాక్షసులను గాదు, (అందఱ నతడు నిశ్శేషము గావింపగలడు.) (ఎవ్వరెత్తి వచ్చినను) భయమున యుద్ధముచేయకుండువాడు కాడాకుంతీ సుతుండు-ధనంజయుండు ఎవనియందు సంక్రుద్ధుడైయుండునో వారిని గరుత్మంతుడు వృక్షమునట్లాతండు పడివేయగలడు. వీర్య మున నీకన్న విశిష్టుడు, ధనుస్సున నమరరాట్సముడు, యుద్ధ మున వాసుదేవసమానుడునగు పార్థు నెవ్వడు పూజింపకుండును దేవుని దైవపక్కిగను, మనుజుని మానుషమున, అస్త్రము న మున నెవడు హరింపగలవాడో యాయర్జునునకు సమాన

పూరుషుండెవడున్నాడు. పుత్రుని యనంతరము శిష్యుడని ధర్మవేత్తలు తెలియుదురు, ఈనిమిత్తమునన్నైన ద్రోణునకు పాండవుడు ప్రియుండే నీ వెట్లుగా ద్యూతమొనరించితివో. యెట్లుగా నింద్రప్రస్థమును హరించితివో, ఎట్లుగా ద్రౌపదిని సభకుకొని తెచ్చితివో యట్లుగా పాండవునితోడ యుద్ధము గావింపుము. ఈ నీ మేనమామ ప్రాజ్ఞుడు, క్షాత్రధర్మకోవిదుడు, చెడుజూదమాడిన గాంధారుడు - శకుని యిపుడు పోరాడనిమ్ము, ఆతడు గాండీవమునుండి పాచికలను వేయండది నిస్సంశయము, జ్వలించు నిశిత తీక్ష్ణ బాణములనే గాండీవము నుండి యాతడు ప్రయోగించును, గాండీవనిర్ముక్త బాణపరంపర యందు దారుణగిరులు గూడ నిలువంజాలవు. అంతకుడు, పవనుడు, మృత్యువు. అగ్ని బడబాముఖము గావించువానియందు శేషముండగలదు. క్రుద్ధుండగు ధనంజయుండేమియు మిగిలించువాడుకాడు. (నిశ్శేష మొనరించును)

గోవులను పట్టుట జరిగినదికాని జయించుట కాలేదు. ఎల్లను దాటి పోవుటలేదు. హాస్తినాపురమును చేరుకొనలేదు. పరిస్థితి యిది కాగా కర్ణ, బీరమాడుచుంటివే' అని యశ్వత్థామ పలికినాడు, "కర్ణ" అను సంబోధన మిందుండుటచే నీ మాట కర్ణునికే జవాబగుచు విషయముచే దుర్యోధనునకే జవాబగుచున్నది. సంగ్రామమున గాక వంచనావిధిగా-వైతసీ వృత్తిగా రాజ్యము హరించినాడు పౌరుషముపలుకుట గర్హ్యమని యశ్వ

త్థామ పలికినాడు. గుఱ్ఱములు మార్గవర్తనములయ్యె సకిలించును, గాలివీచును. వాసవుడు వర్షించును. మేఘముఱుమును' అనుచు బలికి 'ద్రోణుడు వ్రేలుడుకాయ' అని దుర్యోధనుడు తేల్చినాడు. దానికి జవాబుగా "దహత్యగ్ని రవాక్యస్తు... తూష్ణీం ధారయతే....వసుధా' యని యశ్వత్థామ బదులు పలికినాడు 'మన మిట్లు వ్రేలుకొనుచుండగా మాటాడకుండనే యర్జునుడు తనపని గావించుకొని పోగలడు' అనినాడు ఈ యధ్యాయారంభమున 'కర్ణ' అనునొక్క సంబోధనము మాత్రమే గలదు అందువలన గర్ణు నుద్దేశించియే యంత ప్రసంగమును నశ్వత్థామ పలుకుచున్నాడని తెల్లమగుచున్నది. విషయనిర్ణయమున దుర్యోధనునకే గాటయిన మాటలుగా రూపొందుచున్నవి

దుర్యోధనుడు ద్రోణుని విమర్శించుచు 'స్వార్థే సర్వే విముహ్యంతి యేఽపి ధర్మవిదో జనాః" అని యనియున్నాడు. తండ్రిని గూర్చిన యీ మాటను బురస్కరించుకొనియే యశ్వత్థామ కర్ణముఖముగా దుర్యోధనునకు మాట నప్పగించుచున్నాడు. "త్వం పునః పండితో బుద్ధ్వావాచం వక్తు మిహేచ్ఛసి' అనినా డశ్వత్థామ- పండితుడు మేల్మినిబలికినాడు. దుర్యోధనుడు మోహాగ్రస్తుడై వ్రేలినాడని యీ మాట పర్యవసించుచున్నది.

పుత్రు ననంతరము శిష్యుండగును - అని ధర్మవిదులు తెలియుదు రీనిమిత్తమునన్నైన ద్రోణునకు పాండవుడు ప్రియు

జేయని యశ్వత్థామ వచించుట గమనింపదగినది. "అర్జునుడు ప్రియుడు' అని పలుకక పాండవులు ప్రియుడు అని పలుకుట సాభిప్రాయమగుచున్నది. ధర్మాత్ములగు పాండవులు ద్రోణునకు ప్రియులు' అని సమర్థించుచు, ద్రోణుని ధర్మపక్షపాతమును వివరించుచు "నా కౌరవులు గూడ ద్రోణాచార్యుని శిష్యులే కదా. వారి హితమునకే ద్రోణుడిట్లు తంటాలు పడుచున్నాడు ఇది పండితునితీరు, అట్టివాడు కాక దుర్యోధనుడు మోహగ్రస్తుడై చెడుజూదమాడించి యిపు డాత్మనాశన కృత్యమునకు గడంగుచున్నాడు' అని యశ్వత్థామ తేల్చిపలుకుచున్నాడు,

అనివృత్తేపి నిర్వాసే యది బీభత్సు రాగతః
పున ర్ద్వాదశవర్షాణి వనే వత్స్యంతి పాండవాః ౪౭-౫
పండితాన్ పృష్ఠతః కృత్వా పరేషాం గుణవాదినః ౩౫
అని దుర్యోధనుడు స్వపరపక్ష విషయముగా బలికినాడు.
కామం గచ్ఛంతు కురవో ధన మాదాయ కేవలం
రథేషువాపి తిష్ఠంతో యుద్ధం పశ్యంతు మామకమ్ ౪౮-౨౩
అని కర్ణు డెల్లర తృణీకరించుచు బలికినాడు॥
ద్రోణో దుర్యోధనో భీష్మో భవాన్ ద్రౌణి స్తథావయం
సర్వేయుధ్యామహే పార్థం కర్ణ మాసాహసం కృథాః
౪౯-౨౨
అని కృపుడు పలికినాడు,

యథా సభాయాం ద్యూతం త్వం మాతులేన సహాకరోః
తథా యుధ్యస్వ సంగ్రామే సౌబలేన సురక్షితః ౫౦-౨౭
యుధ్యంతాంకామతో యోధాస్సాహం యోత్స్యే ధనంజయం
మత్స్యస్యాప్యస్మాభి రాయోద్ధ్యోయద్యా గన్ గ్రహాం
పఠిమ్ ౨౯

అని యశ్వత్థామ పలికినాడు

దుర్యోధనుడు కర్ణుడు 'వారుభయులే ప్రధానులు, వారిద్దఱదేకార్యము'-అనునట్లు మాటాడియున్నారుగాన నిట్టి పర్యవసానము గల్గుచున్నది. 'యోధులారా; మీకిష్టమున్న యుద్ధమొనరింపుడు'- ఇట్లని యశ్వత్థామ పలుకలేదు 'యోధులు కోరి యుద్ధమొనర్చిన నొనర్పనిమ్ము. నేను ధనంజయునితో యుద్ధమొనర్పను' అని యశ్వత్థామ పలికినాడు. ఇట్లు పలుకుట కర్ణునకు మాత్రమే జవాబగుచున్నది. 'కామతః' అనుమాట విచిత్రమైనది "మీరు యుద్ధముచేయనవసరములేదు' అని కర్ణుడు తృణీకరించి పలికినందున యోధులు యుద్ధమునకు సిద్ధపడుట "కామతః" యగునని యశ్వత్థామ యభిప్రాయమైయున్నది. విరాటుడు గోవులను విడిపింపవచ్చినపుడు యుద్ధమొనర్చుట యందఱియొక్క కార్యమై యుండగలదు, అట్లుగాక యర్జునుడే తెంచియున్నందున కర్ణవచనానుసారమది యోధులనుండి భిన్నమగుచున్నది, దుర్యోధనునిమాటప్రకార మశ్వత్థామాదు లందఱు పృష్ఠగతులు కావలసినవారయిరి. ముందుండదగిన వారయిరి, కావుననే యశ్వద్ధామ "నేను యుద్ధము చేయను"

అని పలికినాడు. "పండితులు యుద్ధముచేయరు' అని స్పష్ట
పలుకుట గాంభీర్యమునకు గొఱత. విపరీతప్రసంగములు కలిగినను
పండితులు నిష్ఠురములకు సహించియే కార్యగతినిగల్గించి తోడ్ప
డెదరు, ద్రోణాదులు పృష్ఠగతులగుటలేదు. అశ్వద్ధామ యుద్ధ
మొనరింపకయుండలేదు, మాటకుమాట సమాధానమొసంగి
యశ్వద్ధామ యూరకొనినాడు. పరిస్థితి యిటువిషమించు
చుండుటను గాంచి భీష్ముడిట్లు పలికెను.

సాధు పశ్యతివై ద్రౌణిః కృపశ్చ సాధు పశ్యతి
కర్ణస్తు క్షాత్రధర్మేణ కేవలం యోద్ధు మిచ్ఛతి 50-1
ఆచార్యో నాభివక్తవ్యః పురుషేణ విజానతా
దేశకాలౌతు సంప్రేక్ష్య యోద్ధవ్య మితి మే మతిః
యస్య సూర్యసమాః పంచ సపత్నాః సుప్రహారిణః
కథ మభ్యుదయే తేషాం న ప్రముహ్యేత పండితః 3
స్వార్థే సర్వే విముహ్యంతి యే ఽపి ధర్మవిదో జనాః
తస్మా దాశ్రిజన్ బ్రవీ మ్యేత ద్వాక్యం తే యది రోచ తే 4
కర్ణోహి యదవోచ త్వాం తేజ స్స జననాయ తత్
ఆచార్యపుత్రః క్షమతాం మహత్కార్య ముపస్థితమ్ 5
నాయం కాలో విరోధస్య కౌంతేయే సముపస్థితే
క్షంతవ్యం భవతా సర్వ మాచార్యేణ కృపేణచ 6

.... .... .... .... .... ... .... .... .... ....

బలస్య వ్యసనానీహ యాన్యుక్తాని మనీషిభిః
ముఖ్యో భేదోహి తేషాంతు పాపిష్ఠో విదుషాం మతః 13

ద్రోణః

నైవం న్యాయ్య మిదం వాక్య మస్మాకం పురుషర్షభ
కింతు రోషపరీతేన గురుణా భాషితా గుణాః ౧౭

[*] శత్రో రపి గుణా వాచ్యా దోషా వాచ్యా గురో రపి
సర్వథా సర్వయత్నేన పుత్రే శిష్యే హితం వదేత్ ౧౫

దుర్యోధనః

ఆచార్య ఏషః క్షమతాం శాంతి రస్మి న్విధీయతాం
అభిద్యమానేతు గురౌ తద్వృత్తం వేషకారితమ్ ౧౬

వైశంపాయనః :

తతో దుర్యోధనో ద్రోణం క్షమయా మాస భారత
సహ కర్ణేన భీష్మేణ కృపేణచ మహాత్మనా ౧౭

ద్రోణః :

యదేత త్ప్రథమం వాక్యం భీష్మః శాంతనవో உ బ్రవీత్
తేనే వాహం ప్రసన్నో వై నితి రత్ర విధీయతామ్ ౧౮

యథా దుర్యోధనం పార్థో నోప సర్పతి సంగరే
యథా దుర్యోధనో రాజా న గచ్ఛే ద్ద్విషతాం వశమ్ ౧౯

[*] మధ్యస్థః సతతం భీష్మో ద్రోణపుత్రో మయి స్థితః
యతః వుత్ర స్తతో ద్రోణా భవితా నాత్ర సంశయః అది
౧౭-౨౦

కృపః శారద్వతశ్చైవ యత ఏతౌ తతో భవత్
ద్రోణంచ భాగినేయంచ న సంత్యక్షతి కర్హిచిత్ ౨౧

దుర్యోధనుని యీ మాటలు గమనించదగినవి.

సాహసా న్యదివా మోహా త్తథానీతి ర్విధీయతాం
వనవాసే హ్యనిర్వృత్తే ధర్మయే న్న స్వ మర్జునః ౨౦
ధనం చాలభమానో౽త్ర నాద్య తత్ క్షంతు మర్హతి
యథా నాయం సమాయుంజ్యా ద్ధార్తరాష్ట్రిం కథంచన ౨౧
నచ సేనా పరాజయ్యా త్తథానీతి ర్విధీయితాం
ఉక్తం దుర్యోధనే నాపి పురస్తా ద్వాక్య మీదృశమ్ ౨౨
తదనుస్మృత్య గాంగేయో యథావ ద్వక్తు మర్హతి ౨౩

(భీష్ముడిట్లు పలికెను, ద్రోణి సాధువు నీక్షించెను. కృపుడును సాధువు నీక్షించెను. కర్ణుడయిన కేవలము క్షాత్రధర్మమున యుద్ధమొనర్ప గోరుచున్నాడు. ఆచార్యుడు విజ్ఞాతపురుషునిచే (నిట్లు) పలుకదగినవాడు కాడు. దేశకాలములను గాంచి యుద్ధమొనర్ప్పవలెనని నా యభిప్రాయము (మే మతిః) ఎవ్వానికి సూర్యసమములగు సపత్నులాజిపటిష్ఠులభ్యుదయ మొంద నుందురో యప్పుడే పండితుండు మోహ మొందడు. స్వార్థమందు ధర్మవిదులగు జనులను మోహ మొందెదరు. కావున రాజా! యీ మాట దెల్పుచున్నాను, నీకిది రుచించుచో (నట్లు గావింపుము,) కర్ణుడువచించిన దేదికలదో యది తేజస్సంజననార్థమే యగుచున్నది. ఆచార్య పుత్రుడు క్షమింపదగును. మహాత్కార్య ముపస్థితమై యున్నది. కౌంతేయుడు సముపస్థితుడగుచుండగా విరోధమున కిది కాలముకాదు నీచేతను. ఆచార్యుని చేతను. కృపుని చేతను. సర్వము క్షంతవ్యమగును. ఆదిత్యునందు ప్రభ యెటో యట్లు. చంద్రునందు లక్ష్మి (శోభ)

యెట్లో యట్లు మీయందు క్షాత్రత్వము తెలియునది కాదు ఆటులగా మీ యందు బ్రాహ్మణ్యము. బ్రహ్మాస్త్రము ప్రతిష్ఠితమైయున్నది నాల్గువేదము లొకవైపు నింకొకవైపు క్షాత్రము మీయందు గానవచ్చుచున్నవి. సపుత్రకుండగు భారద్వాజునందుగాక వేఱొకచోట నీయుభయము సుప్రతిష్ఠితమై యుండుట గనజాలము. బ్రహ్మాస్త్రము, బ్రహ్మవేదములు (సంపూర్తిగా) సత్పురుషసత్తముండగు ద్రోణునందుగాక యన్యత్ర గాంచజాలము, వేదాంతములు, పురాణములు, పురాతనమైనయితిహాసము- వీనియందు జామదగ్నిగాక ద్రోణుని కంటె నధికుండెవ్వడు ఆచార్యపుత్రుడు క్షమింపవగును. ఇది విరోధసమయము కాదు. సన్నిహితుడగుచున్న పాకశాసనుని మనమెల్లర మెదిరింతము. బలవ్యసనములని మనీషులచే జెప్పంబడినవానిలో భేదమనునది ముఖ్యముగా పాపిష్ఠమంచు విదుషాంమతమైయున్నది- భీష్ము డిట్లుపలుకగా ద్రౌణి యిట్లనెను. పురుషర్షభ! మమ్ములగూర్చి మీరిట్లు పలుకుట న్యాయము కాదు. మఱి రోషపరీతుడగు గురునిచే గుణమే భాషింపబడినది. శత్రువయినను గుణము వాచ్యమే. గురువయ్యు దోషము వాచ్యమే, సర్వదా సర్వయత్నమున బుత్రునందు, శిష్యునందు హితమే పలుకదగినది- అశ్వత్థామ యిట్లుపలుకగా నపుడు దుర్యోధను డిట్లుపలికెను, ఆచార్యుడు క్షమింపదగును. శాంతి విధింపదగును, గురువు లభిద్యమానులు కాదగును. శేషకారితము ప్రవర్తింపదగును - దుర్యోధను డిట్లుపలికి ద్రోణుని

క్షమింపజేసెను. అపుడు కర్ణుడు, భీష్ముడు, కృపుడు. వీరితో గూడి (వచ్చి) దుర్యోధనుడు ద్రోణుని క్షమింపజేసెను. ద్రోణు డపు డిట్లనెను భీష్ముడు - శాంతనుపుడు పలికిన ప్రథమ వాక్యముననే నేను ప్రసన్నుడనైతిని. ఇపుడు నీతినేర్పు ఉపుడు ఎట్లుదుర్యోధనుని పార్థుడు సమీపింపకుండునో. యెట్లుగాదుర్యోధ నుడు - రాజు శత్రువశము గాకుండునో, సాహసమునగాని, మోహమునగాని యిట్లు గాకుండునట్లు తగునీతి గావింపుడు. వనవాసము ముగింపుగానిచో నర్జునుడు మనకు గాన వచ్చు వాడు కాడు (పశు) ధనమునొందక యిపుడు క్షమించువాడును కాదు, ఎట్లుగానితడు ధార్తరాష్ట్రుని గలియకుండునో, సేన పరాజితముగాకుండునో యట్టివిధాన మొనరింపబడవలెను. ఇంతకుముందు దుర్యోధనునిచే నిట్టి వాక్యము పలుకబడినది, దానిందలంచి గాంగేయుడు యథావతు పలుకదగును- (అని ద్రోణుడు పలికెను.)

ఇందలి "సాధు పశ్యతి" అనునది చక్కగా నున్నది. చక్కగా బలుకుట, చక్కగా గ్రహించుట యను రెండర్థముల నిదిగ సాధించుచున్నది. భీష్ముని యీమాట అశ్వత్థామా కృపుల మతమునందలి మేల్మిని తెల్ల మొనర్చుచున్నది. 'ఆచార్యు నిట్లన కూడదు'-ఇట్లని పలుకుట తగదు. భీష్ము డట్లుగాక ఆచార్యుని యెల్లనుని దూపించువాడె "ఆచార్యో నాభివక్తవ్యః" (ఆచార్యుం డిట్లు వలుకందగువాడు కాడు) అని యుచితవచనములు పలికినాడు, పండితుల విమర్శించుచు దుర్యోధను డనియున్న

దానిని కృపుడు, ద్రౌణి తమ ప్రసంగములందు విమర్శించి యున్నారు. భీష్ముడదికారణముగ బండితుని మేరను నిరూపింప జొచ్చినారు. "దేశకాలపరిస్థితిని గమనించిన పండితు డెన్నడు మోహమొందడు" అనినాడు. ఈ మాట పండితుని వివేకస్థై ముగ ద్యోతకమొనర్చుచున్నది. ద్రోణభీష్ము లుయథార్థవాది కాగా దుర్యోధనుడు మోహమునబడి సంకేతమొనర్చినాడని యిది సాధించుచున్నది. భీష్ము డిట్లుపలికి మఱియు చిత్రప్రసంగము గావించుచున్నాడు "స్వార్థమందు ధర్మవిషయమందు వారును, అందఱును మోహమొందెదరు. కావున రాజా నీకు రుచించునేని పలికెదను (వినుము.) కర్ణుడుపలికినది తేజస్సంజననార్థమగునదై యున్నది. ఆచార్య పుత్రుడు క్షమింపదగును అనినాడు భీష్ము డుచితమాడెనని యిది తెల్పుచున్నది మఱియు దుర్యోధనుని నైజపురస్కృతవచనముగా నిది తేలుచున్నది. భీష్ముడిటు కార్యానుకూలవచనము గావించుచు గర్ణుని మాట కెట్టిరూపమునో గావించి యామాట దుర్యోధనునిపట్ల నేమిగా శోభించునది చూపువాడై యాచార్యపుత్రుడు క్షమింపదగు నని పలికినాడు. "అశ్వత్థామ క్షమింపదగును"- ఇట్లని కాక "ఆచార్యపుత్రుడు క్షమింపదగును" అనిపలుకుట పరిస్థితిని సరి గావించుచున్నది, "వాక్యంతే యది రోచతే" అనునది భీష్ముని యొక్క ఆత్మవిషయముకంటె దుర్యోధనుని మేల్మియందే యున్నదని గుర్తింపవలెను. కార్యగతిని బురస్కరించుకొని భీష్ముడు ద్రోణాశ్వత్థామ కృపులను గూర్చి ప్రశంసావచనములు

పలికి సమాధాన మొనరింప దలంచినాడు. భీష్ముడు మొదట ముగ్గురను గూర్చి పలికినాడు. పిమ్మట ద్రోణాశ్వత్థామల గూర్చి పలికినాడు. ఆ పిమ్మట ద్రోణునొక్కనినే ప్రశంసించినాడు. ద్రోణ ప్రశంసా సందర్భమున సాభిప్రాయముగ 'బ్రహ్మాస్త్రం బ్రహ్మవేదాశ్చ' అని పలికినాడు 'బ్రహ్మాణ్యం బ్రహ్మాస్త్రంచ' అని ప్రారంభమున పలికినది పర్యవసించుచు "బ్రహ్మాస్త్రం బ్రహ్మ వేదాశ్చ' అని పలుకుట గమనింపదగినది. భీష్ముడు తన ప్రసంగ మున కాద్యంతములందు 'ఆచార్యపుత్రః క్షమతాం' అని పలు కుట సాభిప్రాయమగుచున్నది. భీష్ముడు మనీషోక్తిని వివరించుచు "మ ఖ్యోభేదోహి తేషాంతు పాపిష్ఠో విదుషాం మతః' అని తన ప్రసంగమును ముగించినాడు. అపుడు "ఇట్లనుట న్యాయము కాదు, సర్వదా సర్వయత్నమున బుత్రుని యందు. శిష్యుని యందు హితమే పలుకదగినది' అని యశ్వత్థామ పలికినాడు. మఱియునప్పటికి యర్జునప్రశంస వాచ్యమైనదే యని మాట పలికినాడు "దుర్యోధనుండును- కౌరవులెల్లరు ద్రోణాచార్యుని శిష్యులే, వారలహితార్థమే గురువిపు డింతశ్రమపడుచున్నాడు, దోషోక్తిగా గార్యగతిని గల్గించుచున్నాడని'- యీ మాట యభిప్రాయమును వెల్లడించినది. అపుడు దుర్యోధనుడు పరిస్థితి నంతయు గుర్తించి ద్రోణుని క్షమింపవేడినాడు. ఇచ్చోట నున్న 'అభిద్యమానేతు గురౌ తద్వృత్తం శేషకారితం' అను దుర్యోధనవచనము వానిస్వభావమునకు దగియున్నది. దుర్యో ధనునితోబాటు కర్ణుడు. భీష్ముడు, కృపుడు నపు డుపశమనవచన

షులు పలికిరి. కాగా నా ప్రసంగమందు బాల్గొనిన వారందఱు (ముగ్గురు ద్రోణాశ్వత్థామలను దమించవేడికని పర్యవసాన మైనది

ద్రోణుడు "భీష్ముడు శాంతనవుడన్న ప్రథమవాక్యము నకే నేను ప్రసన్నుడనైతిని. ఇపుడు నీతిని గావింపుడు' అని పలికినాడు, పరిస్థితినిగమనించి, ద్రోణు డాదినే "రక్షధ్వమపి చాత్మనం" అని దుర్యోధనరక్షణను గూర్చి సూచించియున్నాడు, ఇంత గందరగోళమైన పిమ్మట దానినే (యారంభమం దాడి యున్న మాటనే-యాపరిస్థితినే) ద్రోణుడు మరల నిర్ధారించి పలుకుచున్నాడు,

దుర్యోధనుని పార్థుడు సమీపింపకుండునట్లు
దుర్యోధనుడు - రాజు - శత్రువశము గాకుండునట్లు

౧ సాహసమున ౨ మోహమున నిట్లు తటస్థించకుండు నట్లు - నీతిగావింపుడు" అని పలికినాడు, ఈ రెండుపాదముల ఆరంభమందు దుర్యోధన నామోచ్చారణమే యుండుట మఱియు సాహస మర్జునునందు, మోహము దుర్యోధనుని యందు విచిత్రముగా నిందు ధ్వనించుచు నిరువురివిషయము లోను సాహసమోహములు రెండును గానవచ్చునంచు నన్వయ మగుచుండుట గమనార్హమైనది. ఆనాటికి పాండవులకు సమయ పాలనము సంపూర్తికాలేదని దుర్యోధనుడు పలికినాడు. కావున భీష్ముని దాని నిర్ణయముగావింపవలసినదిగా ద్రోణుడు పలికి నాడు.

యథా సేనా న భజ్యేత తథా నీతి ర్విధీయతాం- ఇది దుర్యోధనవచనము. నచ సేనా పరాజయ్యా త్తథా నీతి ర్విధీయతాం- ఇది ద్రోణవచనము. ఇది గమనింపదగినదై యున్నది ద్రోణదుర్యోధనులవచనములను పురస్కరించుకొని భీష్ముడరణ్యాజ్ఞాతవాస వత్సరముల నిష్కర్ష నిట్లుపలికెను.

కళా కాష్ఠాశ్చ యుజ్యంతే ముహూర్తాశ్చ దినానిచ
అర్ధమాసాశ్చ మాసాశ్చ నక్షత్రాణి గ్రహా స్తథా  ౫౨-౧
ఋతవశ్చాపి యుజ్యంతే తథా సంవత్సరా అపి
ఏవం కాలవిభాగేన కాలచక్రం ప్రవర్తతే  ౨
తేషాం కాలాతిరేకేణ జ్యోతిషాంచ వ్యతిక్రమాత్
పంచమే పంచమే వర్షే ద్వౌమాసా వుపజాయతః  ౩
[*] ఏషా మభ్యధి కా మాసాః పంచచ ద్వాదశక్షపాః
త్రయోదశానాం వర్షాణా మితిమేవర్తతే మతిః  ౪

[*] అజ్ఞాతవాసమున ప్రవేశింప బోవుసందర్భములో ధర్మరాజిట్లు చిత్రముగా బలికినాడు.

తతో యుధిష్ఠిరో రాజా ధర్మపుత్రో మహామనాః
సన్నివర్త్యానుజాన్ సర్వా నితిహోవాచ భారత విరా ౧-౮
ద్వాద శేమాని వర్షాణి రాజ్యవిప్రోషితా వయం
త్రయోదశో ఽ యం సంప్రాప్తః కృచ్ఛ్రాత్ పరమదుర్వసః

(రాజ్యవిప్రోషితులమగు మన కివి పండ్రెండువత్సరములు. పరమదుర్వసమగు పదుమూడవవత్సరము సంప్రాప్తమైనది- అని ధర్మజుడు పలికెను.

అర్జునుడు బయల్వెడువఱకు పరవగాహ్యమైయుండిన మహామనస్కుడైన ధర్మరాజుగారించిన యజ్ఞాతవాసవిషయ నిర్ణయమం దీగోప్యవిషయ మిమిడియున్నది. పండ్రెండువత్సర ములు నిండి పదుమూడవ వత్సరము వచ్చినదని యిందుస్పష్టము లేకుండుట గమనింపదగినది. ఈ విషయనిర్ణయము గహనమై తెలియరానందున కౌరవు లష్టమినాడు సూర్యోదయసమయ మున (అజ్ఞాతవాసకాలముదాటి పోయిన మొదటిరోజున) విరాటునిగోవులను పట్టి యర్జునునిచే భంగమొందువారుగానైరి. "ద్వాదశే మానివర్షాణి రాజ్యవిప్రోషితావయం' అనుదానిలో స్పష్టమగు క్రియాపదము లేకుండటట గమనార్హము,

సర్వం యథావ చ్చరితం యద్య దేభిః ప్రతిశ్రుతం
ఏవ మేత ద్ధ్రువం జ్ఞాత్వా తతో బీభత్సురాగతః ౫
సర్వే చైవ మహాత్మానః సర్వే ధర్మార్థకోవిదాః
యేషాం యుధిష్ఠిరో రాజా కస్మా ద్ధర్మే ఽపరాధ్నుయుః ౬
అలుబ్ధాశ్చైవ, కౌంతేయాః కృతవంతశ్చ దుష్కరం
న చాపి కేవలం రాజ్య మిచ్ఛేయు స్తే ఽ నుపాయతః ౭
తథైవ తేహివిక్రాంతు మీషుః కౌరవనందనాః
ధర్మపాశనిబద్ధా స్తే న చేలుః క్షత్రియవ్రతాత్ ౮
యచ్చానృత ఇతిఖ్యాయా ద్యస్స గచ్ఛే త్పరాభవం
వృణుయు ర్మరణం పార్థా నానృతత్వం కథంచన ౯
ప్రాప్తేకాలేతు ప్రాప్తవ్యం నోత్సృజేయు ర్నరర్షభాః
అపి వజ్రభృతా గుప్తం తథా వీర్యాహి పాండవాః ౧౦
ప్రతియుధ్యేమ సమరే నర్వశస్త్రభృతాం వరమ్ ౧౧

(కళలు, కాష్ఠలుగా నేర్పడిన కాలము ముహూర్తములు, దినములని (వ్యవహారింపబడుచున్నది.) అర్ధమాసములు, మాసములు, నక్షత్రములు- అట్లే గ్రహములు - అను విభాగము కూడ కలదు, ఇట్లే ఋతువులుగా నేర్పడి యట్లే సంవత్సరములని (కాలము వ్యవహారింపబడుచున్నది) ఇట్లు కాల విభాగమున గాలచక్రము ప్రవర్తించుచున్నది. వీనియొక్క కాలాతిదేశమున, జ్యోతిస్సుల వ్యతిక్రమమున నయిదేసి సంవత్సరములకు రెండేసిమాసములు పుట్టుచున్నవి. (ఉపజాయత) ఇట్లుగా నైదునేలల పండ్రెండుదినము లీపదుమూడువత్సరములందు వర్తించియున్నవని నా అభిప్రాయము. సర్వము నా పాండవులు యథావతుగా నాచరించిరనియే తెలియందగును, దీనినంతయు దృఢముగా నెఱింగియే భీభత్సుడు వచ్చినాడు. వారందఱు మహాత్ములు. వారందఱు సర్వార్థకోవిదులు. ఎవరికి ధర్మరాజు నేతయో వారు ధర్మమునుండి యేలతప్పుదురు, కౌంతేయులు అలుబ్ధులు. దుష్కరము గావించువారలే. అనుపాయమున గేవలము రాజ్యమిచ్ఛయించువారు కారు. అట్లుగా బరాక్రమింపజూచువా రాకౌరవనందనులు. ధర్మపాశనిబద్ధులు వారు. క్షత్రియవ్రతమునుండి చలించువారలు కారు, అనృతులగువారు పరాభవమొందువారు. ఆపార్థులు మరణమునైన వరింతురేకాని అనృతత్వము నెట్లును చేయువారుగారు, ఆనరర్షభులు ప్రాప్తకాలమున నది దేవేంద్రరక్షితమై యుండినదైనను

నా ప్రాప్తవ్యమును విడనాడువారు కారు. అట్టివిశ్వాసవంతులు పాండవులు. సర్వశక్తిసంపన్నుండైన యర్జునుని మనముచేరి యెదిరింతము - అని భీష్ముడు పలికెను

కాలవిభాగమున ప్రసక్తమైన కాలచక్రమందు కాలాతిరేకమున జ్యోతిష్కులయొక్క వ్యతిక్రమమున పదుమూడు వత్సరములందు ౫ నెలల ౧౨ రోజులు అధికమువచ్చినవని. యీ నిర్ణయము పాండవులు గ్రహించుకొనియేయున్నారని. అది నిశ్చయించియే యర్జునుడు వ్యక్తమైనాడని భీష్ముడు పలికినాడు. మహాత్ములు, ధర్మార్థకోవిదులు, యుధిష్ఠిరనేతృత్వము గల వారునగు పాండవులదృఢనిశ్చయ మిదెయని భీష్ముడు పలికినాడు సౌరమానప్రకారమది ౧౨ సంవత్సరములు ౬ నెలల ౧౮ రోజులగును. కావున గౌరవులింకను ౫ నెలల ౧౨ రోజులు గడుపువారికున్నదని తలంచిరి. [*] పాండవుల యీ నిర్ణయమును భీష్ముడర్జునుడు బయలుపడినందున నిశ్చయము పలికినాడు కౌరవులు బహుళాష్టమినాడు గోవులను పట్టుటకు తిథిని నిర్ణయించినారు. ఆనాటి కీవిషయము కౌరవులందు దెలియవచ్చుట లేదు. మామూలు లెక్కగా పండ్రెండు వత్సరములు వనవాసము ముగించి పదుమూడవవత్సరము మొదటి రోజుననే యజ్ఞాతవాసములో బ్రవేశించుటయందు పెద్దప్రమాదము గలదు ఆ రోజున కౌరవదూతలనేకులు పాండవులజాడకై

[*] భీష్మాది కౌరవులం దీవిషయ మంతః ప్రవర్తమను గాంభీర్యమెంతయేని కలదు.

నంతట గనిపెట్టియుండగలరు. పాండవులజాడకై గాలించెదరు. దీనినిదలంచి పాండవులిట్లాచరింపవలసి వచ్చినది, ఆ యజ్ఞాత వాస వత్సరముమాత్రమే యర్జునునకు అపుంస్త్వముండగలదని దేవలోకమున నింద్రుడు వచించియున్నాడు. ప్రమదలచే బరిశీతుడైన యర్జునునం దీవిచిత్రప్రవృత్తి యేర్పడినది (అపుంస్త్వము, స్త్రీ భావము పార్థునందు ప్రవర్తించినది,) కావున పాండవుల యీ నిర్ణయమందు దేవతలు, ధర్మవిధానముగలదని స్పష్టమగుచున్నది. కృత్రిమస్వభావులగు గౌరవులు లోగడ ద్యూతసమయమున బేర్కొనినదాని ననుసరించియే ధర్మజు డీ నిర్ణయము గావించినాడు.

వయంవా ద్వాదశాబ్దాంస్తు యుష్మాభి ర్ద్యూతనిర్జితాః
ప్రవిశేమ మహారణ్యాం రౌరవాజిన వాసపః సభా ౧౫-౧౦
త్రయోదశంచ సజనే హ్యజ్ఞాతాః పరివత్సరం
జ్ఞాతాశ్చ పున రన్యాని వనే వర్షాణి ద్వాదశ ౧౧
అస్మాభి ర్నిర్జితా యూయం వనే ద్వాదశవత్సరాన్
వసధ్వం కృష్ణ యా సార్థ మజినైః ప్రతివాసితాః ౧౨
త్రయోదశేచ నిర్వృత్తే పున రేవ యథోచితం
స్వరాజ్యం ప్రతిపత్తవ్య మితరై రథ వేతరైః ౧౩

.... .... ... .... .... ... .... .... .... ...

[*] గజాశ్వం బహుధేనూక మపర్యంత మజావికం
గజాః కోశో హిరణ్యంచ దాసీ దాసాచ్చ సర్వశః ౨౦
ఏష నో గ్లహ ఏవైకో వనవాసాయ పాండవాః

యూయం వయంవా విజితా వసేమ వన మాశ్రితాః ౨౧
త్రయోదశంచవై వర్షమజ్ఞాతా స్స్వజనై స్తథా
అనేన వ్యవసాయేన దీవ్యామ పురుషర్షభాః ౨౨

---

[*] ఏవం ద్యూతజితాః పార్థాః కోపితాశ్చ దురాత్మభిః
దార్తరాష్ట్రైః సహామాత్యై ర్నిర్యయు ర్గజసాహ్వయాత్
౨౧ ౧

వర్థమానపురద్వారా దభినిష్క్రమ్య పాండవాః
ఉదఙ్ముఖాః శస్త్రభృతః ప్రయయు స్సహకృష్ణయా ౧-౧౦
ఇంద్రసేనాదయశ్చైవ భృత్యాః పరి చతుర్దశ
రథై రనుయయు శ్శీఘ్రైః స్త్రియ ఆదాయ సర్వశః ౧౧

పాండవులు మంత్రులను, ఆయుధములను, ఇంద్రసేనాదులగు భృత్యులను, రథములను, స్త్రీలను తమతోడ వనవాసమునకు గొనివచ్చిరి. జయద్రథుడు ద్రౌపదిని హరించిన సందర్భమున నిట్లు గలదు.

ఇత్యుక్త్వా హ్రియమాణాం తాం రాజపుత్రీం యశస్వినీం
అన్వగచ్ఛత్తథా ధౌమ్యః పదాతిగణమధ్యగః అర ౨౬౭-౨౮

పాండవుల పదాతులు వనమందున్నట్లు దీనివలన ననుమానము గల్గుచున్నది. అజ్ఞాతవాసములో ప్రవేశించు సమయమున నిట్లు గలదు

పురోహితో౽య మస్మాక మగ్నిహోత్రాణి రక్షతు
సూత పౌరోగవై స్సార్థం ద్రుపదస్య నివేశనే విరా ౪-౨

(మేమైనా మీ చేత ద్యూతనిర్జితులమై పండ్రెండు వత్సరములు రౌరవాజిన వాసములతో మహారణ్యమును ప్రవేశించెదము. పదుమూడవ వత్సరమున అజ్ఞాతవాసము గావించెదము అజ్ఞాత వాసమున విజ్ఞాతులమగుచో మరల వనమందు పండ్రెండువత్స రము లుండెదము. మాచేత నిర్జితులగు మీరు వనమందు పండ్రెండువత్సరములు ద్రౌపదితోకూడ నజనములు ధరించి యుండవలెను, పదుమూడు వత్సరములు పూర్తియైన ఓడినవారు స్వరాజ్యము ను గెల్చిన వారినుండి పరిగ్రహింపవలెను . , పశువులు, కోశము. హిరణ్మయము, దాసీదాసులు-అంతయు విడిచి మీరు గాని మేము గాని వనవాసము గావింపవలయును. పదుమూడవ

ఇంద్రసేనముఖాశ్చమే రథా నాదాయ కేవలాన్
యాంతు ద్వారవతీం శీఘ్ర మితి మేవ ర్తతే మతిః ౩
ఇమాశ్చ నార్యో ద్రౌపద్యా సర్వాశ్చ పరిచారికాః
పంచాలానేవ గచ్ఛంతు సూతపౌరోగవై స్సహ ౪

.... .... .... .... .... .... .... .... .... ....

గతేషు తేషు వీరేషు ధౌమ్యో ౽థ జపతాంవరః
అగ్నిహోత్రాణ్యుపాదాయ పాంచాలా నభ్యగచ్ఛత ౫౭
ఇంద్రసేనాదయశ్చైవ యథోక్తాః ప్రాప్య యాదవాన్
రథా నశ్వాంశ్చ రక్షంత స్సుఖమూషు స్సుసంవృతాః ౫౮

పాండవులు రథములు, అశ్వములు, భృత్యులు, సూత పౌరోగములు-వీరిని గొనివచ్చిరి. సూత పౌరోగవుల గురించి రెండుపర్యాయములు లిచ్చోట చెప్పబడియున్నది. అజ్ఞాతవాసము పూర్తియైనపిమ్మట అభిమన్యు వివాహఘట్టమున నిట్లుగలదు

వత్సర మజ్ఞాతవాసము పూ_ర్తియైన స్వరాజ్యముపొందవచ్చును, ఈ వ్యవసాయమున జూదమాడుదము - అని పణము నిర్ణ యించిరి )

"ధర్మపత్నీ సమేతముగా నజినధారులై వానప్రస్థులు కండు" అనుమాట పాండవులవిషయమున నిందుతటస్థించినది. కౌరవపక్షముగా నట్టి మాటలేదు, అధికమాసము రోజులు వ్రత చర్య యోగ్యము కానివి, కావున పాండవులీ మిష - చమ త్కార మొనరించి యజ్ఞాతవాసమునుండి బయలుపడిరి, భీష్మా డిట్లరణ్యాజ్ఞాతవాసముల నిర్ణయమును తెల్పి ధర్మవ_ర్తనులై పాండవులు వ_ర్తించిరని వెల్లడించి మఱియు నిట్లు పలికెను.

తస్మాద్య_త్త్ర కళ్యాణం లోకే సద్భి రనుష్ఠితం
త త్సంవిధీయతాం శీఘ్రం మానో హ్యర్థో ఽ భ్యగా
త్వరమ్ ౫౨-౧౨

... .... .... .... .... .... ... .... .... ....

అభిమన్యు ముపాదాయ సహామాత్రా పరంతపాః
ఇంద్రసేనాదయశ్చైవరథై స్తైస్సుసవాహితైః విరా ౭౨-౨౩
ఆయయు స్సహితా స్సర్వే పరిసంవత్సరోషితాః
దశనాగ సహస్రాణి హయానాంచ దశాయుతమ్ ౨౪

రథానా మర్బుదం పూర్ణం నిఖర్వంచ పదాతినాం
వృష్ణ్యంధకాశ్చబహవో భోజాశ్చ పరమౌజసః ౨౫
అన్వయుర్వృష్ణి శార్దూలం వాసుదేవం మహాద్యుతి
స్త్రియో రత్నానివాసాంసి పృథక్పృథ గనేకశః ౨

తస్మా ద్యుద్ధోచితం కర్మ కర్మవా ధర్మసంహితం
క్రియతా మాసు రాజేంద్ర సంప్రాప్తోహి ధనంజయః ౧౫

దుర్యోధనః

నాహం రాజ్యం ప్రదాస్యామి పాండవానాం పితామహ
యుద్ధోపచారికం యత్తు తచ్ఛీఘ్రం సంవిధీయతామ్ ౧౬

భీష్మ :

అత్ర యా మామికా బుద్ధిః శ్రూయతాం యది రోచతే
సర్వథాహి మయా శ్రేయో వ్యక్తవ్యం కురునందన ౧౭
శీఘ్రం బలం చతుర్భాగం గృహ్యా గచ్ఛ పురం ప్రతి
తతో ఽ పర శ్చతుర్భాగో గా స్సమాధాయ గచ్ఛతు ౧౮
వయం త్వర్ధేన సైన్యేన ప్రతియోత్స్యామ పాండవమ్ ౧౯
అహంద్రోణశ్చ కర్ణశ్చ ద్రౌణిః శారద్వత స్తథా
ప్రతియోత్స్యామ బీభత్సు మాగతం కృత నిశ్చయమ్ ౨౦

.... .... .... .... ... .... .... .... .... ....

తద్వాక్యం రురుచే తేషాం భీష్మేణోక్తం మహాత్మనా
తథైవ కృతవాన్ రాజా కౌరవాణా మనంతరమ్ ౨౦

---

౧౦,౦౦౦ ఏనుగులు, ౧ ౦౦,౦౦౦ గుఱ్ఱములు. అర్బుదము రథములు. నిఖర్వము పదాతులు కృష్ణుననుసరించి యీ చతురంగ సైన్యము వచ్చినదని యిందు గలదు. ఇది పాండవసైన్యమను నమమానము గలదు. పదునెనిమిది అక్షోహిణులసైన్యము కౌరవపాండవులను చేరినవి. కౌరవపాండవ సైన్యముల సంఖ్య యిందు చేరలేదు, మహాభారతయుద్ధమున యుద్ధమొనరించిన సైన్యమెంతయో తెలియవలసియున్నది.

(కావున కళ్యాణమును లోకమందు సత్పురుషు లనిష్ఠించు దానిని పరగతార్థము కాకుండు రీతిని వేగము గావింపదగును. యుద్ధమందు ఏకాంతసిద్ధి యనునదిగానము, ధనంజయుడు సంప్రాప్తుడై యున్నవాడు. . . . . , కావున యుద్ధోచిత కర్మగాని, ధర్మసంహిత కర్మగాని రాజేంద్రః గావింపుము. ధనంజయుడు సంప్రాప్తుడైనవాడు—భీష్ముడిట్లు పలుకగా దుర్యోధనుడు "తాతః నేను పాండవులకు రాజ్యమీయను. యుదోపచారికమైనది వేగముగావింపుము "అని పలికెను-" కురు నందనః సర్వథా నాచే శ్రేయమే వక్తవ్యమైనది. వేగము చతుర్భాగమును గొని పురమును గూర్చి వెడలిపొమ్ము. ఇం కొక బలచతుర్భాగము గోవులను గొనిపోవిమ్ము. మేము అర్ధ సైన్యమున పాండవునితో బ్రతియుద్ధమొనరించెదము, నేను, ద్రోణుడు, కర్ణుడు, ద్రౌణి కృపుడు—మేము కృతనిశ్చయులై వచ్చిన బీభత్సునితో బ్రతియుద్ధ మొనరించెదము, విరాటరాజే రానిమ్ము. దేవేంద్రుడే రానిమ్ము మకరాలయమును వేలమట్లు నేను వారించెదను' అని పలికెను. ఈ భీష్మవచనము వారి కప్పుడు రుచించెను. కౌరవరాజట్లుగా నాచరించువాడా యెను. ద్రోణుడు మధ్యభాగమున అశ్వత్థామ సవ్యభాగమున కృపుడు దక్షిణమున, కర్ణు డగ్రభాగమున, నేను పశ్చాత్ భాగ మున నుండుదము' అని భీష్ముడు కార్యవచనము పలికెను.

అర్థము పరులకు బోకుండురీతి సత్పురుషానష్ఠిత వివేక మును గావింపుమంచు భీష్ముడు గంభీరహృదయముగా బలికెను. కాగా పరిస్థితి యిపుడు విచిత్రమైనది. విరాటునిగోవుల నిచ్చి వేయుటతో మాత్రమే కాక పాండవులకు రాజ్యమప్పగించు పరిస్థితి యిపుడు తటస్థించినది. కావుననే దుర్యోధనుడు స్పష్ట ముగా పాండవులకు రాజ్యమీయను. యుద్ధోపచారిక మే పలు కుము' అనినాడు ద్రోణుడు తొలినుండిగాపించుచున్న కౌరవ హితమును పురస్కరించి భీష్ముడప్పుడు కార్యము తెలుగును నిశ్చ యించి పలికినాడు, యుద్ధరంగమున దుర్యోధనుడుండినను, గోవులుండినను రక్షణభార ముండగలదు. కావున ముందుగా దుర్యోధనుడు హస్తినాపురమునకు మరలవలెనని, వెంబడిని గోవులు పోవలెనని భీష్ముడు పలికినాడు. అట్లయిన నింక రక్షణ భార ముండదని, ఒకరుతప్పిన నొకరర్జును నెదిరించుచుండవచ్చు నని తెంపులేని యుద్ధపరిస్థితి యర్జుననందుంచవచ్చునని (ముంప వచ్చునని) భీష్ముడు కార్యనిశ్చయము పలికినాడు ఈ యేర్పాటు వారికి రుచించినది, ఆప్రకారము దుర్యోధనుడు హస్తినాపురి వైపు పోజొచ్చినాడు. వెంబడిని గోవులు పోవుచున్నవి అర్జునుని కౌరవవీరులయిదుగు రెదిరింప సిద్ధమైరి. ఆరంభదశయం దుత్తరుడు పాఱజొచ్చినాడు, చివరకు దుర్యోధనుడే రణరంగము నుండి యుద్ధమే ప్రారంభము కాకుండునపుడే వెడలిపోవువా డయినాడు. ఇది యర్జునునిసామంతము నెంతయేని వెల్లడించు చున్నది, అపుడు ద్రోణు డిట్లు పలికెను.

ఏత ద్ధ్వజాగ్రం పార్థస్య దూరతః సంప్రకాశతే
ఏష ఘోషః సరథజో రోరవీతి చ వానరః ౫౩-౫

వానరః సర్వసేనాయాం కరోతి భయ ముత్తమం
ఏష తిష్ఠ న్రథ శ్రేష్ఠే రథేన రథినాం వరః ౫

ఉత్కర్షతి ధనుః శ్రేష్ఠం గాండీవ మశనిస్వనం
ఇమౌహి బాణౌ సహితౌ పాదయో ర్మే వ్యవస్థితౌ ౬

అపరౌ చాప్యతిక్రాంతౌ కర్ణౌ సంస్పృశ్య మే శరౌ
నివర్త్యహి వనే వాసం కృత్వా కర్మాతిమానుషమ్ ౭

అభివాదయతే పార్థః శ్రోత్రేచ పరిపృచ్ఛతి ౭

చిరదృష్టో ఽయ మస్మాభిః ప్రజ్ఞానాం బాంధవప్రియః
అతీవజ్వలితో లక్ష్మ్యా పాండుపుత్రో ధనంజయః ౮

[*] రథీశరీ చారుతలీ నిషంగీ శంఖ పతాకీ కవచీ కిరీటీ
ఖడ్గీచ ధన్వీ విరరాజ పార్థః శిఖిధృత స్స్రగ్భిరివావసిక్తః ౧౦

---

[*] ఈ శ్లోకము విచిత్రముగా నున్నది. ఈ దీర్ఘాంతములు అపుంస్త్వమును సూచించుచు పుంస్త్వమందే వర్తించుచుండుట గమనింపదగినది. స్త్రీ భావమున నంతవఱకు వర్తించియున్న యర్జునుని పురుషత్వమును అందలి యేకరూపము నిది చక్కగా వివరించుచున్నది

ఇషుపాతేచ సేనాయాం హయాన్ సంయచ్ఛ సారథే
యావ త్సమీక్ష్యే సైన్యేఽస్మిన్ క్వాసౌ కురుకులాధమః ౧౨

సర్వా నేతా ననాదృత్య దృష్ట్వా త మతిమానినం
తస్య మూర్ధ్ని పతిష్యామి తత ఏతే పరాజితాః ౧౩
ఏష వ్యవస్థితో ద్రోణో ద్రౌణిశ్చ తదనంతరః

భీష్మః కృపశ్చ కర్ణశ్చ మహేష్వాసా వ్యవస్థితాః ౧౪
రాజానం నాత్ర పశ్యామి గా స్సమాదాయ గచ్ఛతి
దక్షిణం మార్గ మాస్థాయ శంకే జీవపరాయణః ౧౫
ఉత్సృజ్యైత ద్రథానీకం గచ్ఛ యత్ర సుయోధనః
తత్రైవ యోత్స్యే వైరాటే నాస్తి యుద్ధం నిరామిషమ్ ౧౬
తం జిత్వా వినివర్తిష్యే గా స్సమాదాయ సర్వశః ౧౭

(కౌరవులు వ్యూహ మొందియుండగా రథఘోషమున నర్జునుడు తూర్ణము వారిని సమీపించెను. ధ్వజాగ్రము, రథస్వనము గాండీవ నిస్వనము వినవచ్చెను. దానినంతయు దిలకించి గాండీవధన్వి వచ్చినది చూచి ద్రోణు డిట్లుపలికెను. ధ్వజాగ్రము దూరమునుండి గానవచ్చుచున్నది. వానరుడు భీకరనాద మొనరించుచున్నాడు వానరుడు సైన్యసర్వస్వమునకు భయము కల్గించుచున్నాడు. ఆరథశ్రేష్ఠమందుండి రథినాంవరుండైన పార్థుడశనిస్వనమగు ధనుశ్శ్రేష్ఠమును - గాండీవమును సారించుచున్నాడు. ఈ రెండమ్ములు చేరి నాపాదమందు జేరినవి. మఱి రెండమ్ములు చెవులను స్పృశించినవి వనమందు వాస మొనరించి, అతిమానుషకర్మ మొనరించిన పార్థు డభివాదన మొనరించి (కుశల) మడుగుచున్నాడు, చిరకాలమునకు బాంధవప్రియుం డర్జునుడు మనకు గానవచ్చినాడు పాండుపుత్రుడు ధనంజయు డతీవలక్ష్మి ప్రకాశమానుడై వెలుగొందుచున్నాడు. రథము, శరము, అమ్ములపొది, కేడెము, శంఖము, టెక్కెము, కవచము కిరీటము, ఖడ్గము, ధనస్సు గల్గిన(ట్లయిన) అర్జును డాహుతిచే ప్రజ్వలితమగు శిఖియట్లు విరాజిల్లుచున్నాడు' అని పలికెను.

అపుడర్జునుడు కౌరవులనందఱను గాంచి తత్కాలసముచితవచన ముత్తరునితో బలికెను. 'బాణప్రయోగసమయమున గుఱ్ఱములను జాగ్రత్తగా బట్టుము, ఈ సైన్యమున కురుకులాధము డెచ్చోటనున్నది కనుగొనుచు కట్టుండుము, ఎల్లరను దలకడచి యతిమానియగు వాని నెత్తిపై బడెదను. అపుడు వీరందఱు పరాజితులయ్యెదరు. ద్రోణుడు, ద్రౌణి, భీష్ముడు, కృపుడు, కర్ణుడు గానవచ్చుచున్నారు, రాజు నిందు చూడకున్నాను. దక్షిణమార్గమునుబట్టి జీవపరాయణుడై గోవులను గొని పోవుచున్నట్లున్నది. ఈ రథానీకమును తలగడచి సుయోధనుడున్న చోటునకు రథమును నడిపింపుము, అచ్చటనే యుద్ధమొనరించెదను. నిరామిషయుద్ధము గావింపను. ఆ దుర్యోధనుని జయించి గోవులను మరలించెదను.' అని పలికెను.

అర్జునుడు ద్రోణునందుమాత్రమే కృతజ్ఞతను వ్యక్తీకరించుటే ధర్మనిధానమై యున్నది, కావుననే ద్రోణు డర్జునుని రాకను ప్రశంసించి యాతడు గావించిన పాదాభివందనమునకు, (కుశల) ప్రశ్నకు మన్నన వాక్యమును వెల్లడించి యాతనిని బ్రశంసించెను. అపు డర్జునుడు రథమును దుర్యోధనుని నెత్తి మీదికి దోలుమని యుత్తరునితో బలికినాడు.

దుర్యోధనుడు ముందుగా హస్తినాపురికి వెడలిపోవలెనని, యాతని వెంట గోవులుపోవలయునని, అర్ధసైన్యముతో నొకరు తప్పిన నొక్కరుగా నర్జునునితో బోరాడుచు యుద్ధమంతరహితము గావింపవలెనని భీష్ముని యీ యుద్ధతంత్రమై యున్నది. రథికులనందఱ దలగడచి దుర్యోధనశిరమున బడిననపు

డండఱు పరాజితు లయ్యెదరని, అపుడు గోవులను మరలింప వచ్చునని యర్జునుని యుద్ధతంత్రమైయున్నది. ఆ జగదేకవీరు లిద్దఱు నిట్లుగా యుద్ధతంత్రమును నిర్ణయించిరి. అర్జున కార్య సాధనముగా దైవమిఁకొక్క విచిత్ర మేర్పఱచినది. కౌరవపక్షమందు గార్యగతినిపలికిన భీష్మున కపు డొక్కయాలోచనము స్ఫురించినదికాదు గోవులయొద్ద వీరునొక్కని నుంచుట పరమావసరమని భీష్మునకు దట్టినదికాదు, దుర్యోధనుడు ముందు భాగమున, భీష్మాదులు వెనుక భాగమున నుండగా గోవులు ధ్యభాగమున నుండునని భీష్ముని తలంపైనది.

అర్జునుడు చెప్పినప్రకార ముత్తరుడు దుర్యోధనుడుండుచోటునకు రథమును మరలించెను. అదిచూచి కృపుడు దుర్యోధనునకు హానికలుగునని గాబరాపొంది యిట్లు పలికెను.

నైషోఽంతరేణ రాజానం బీభత్సుః స్థాతు మిచ్ఛతి
తస్య పార్ష్ణిం గృహీష్యామో జవేనా భిప్రయాస్యతః ౨౦
న హ్యేన మతిసంక్రుద్ధ మేకో యుధ్యేత సంయుగే
అన్యో దేవా త్సహస్రాక్షాత్ కృష్ణాద్వా దేవకీసుతాత్ ౨౧
ఆచార్యాచ్చ సపుత్రాద్వా భారద్వాజా న్మహారథాత్
కిం నో గావః కరిష్యంతి ధనంవా విపులం తథా ౨౨
దుర్యోధనః పార్థజలే పురా నౌ రివ మజ్జతి
తథైవ గత్వా బీభత్సు ర్నామ విశ్రావ్య చాత్మనః ౨౩
శలభై రివ తాం సేనాం శరైశ్శీఘ్ర మవాకిరత్
కీర్యమాణాః శరౌఘైస్తు యోధా స్తే పార్థచోదితైః ౨౪

నాపశ్యా న్నావృతాం భూమి మంతరిక్షంచ పత్రిభిః
తేషా మావతతాం యుద్ధే నాపయానే భవ ఽ న్మతిః ౨౫
శీఘ్రత్వ మేవ పార్థస్య పూజాయంతి స్మ చేతసా
తత శ్శంఖం ప్రదధ్మౌస ద్విషతాం రోమహర్షణమ్ ౨౬
విష్ఫార్య్యచ ధనుః శ్రేష్ఠం ధ్వజే భూతా న్యచోదయత్
తస్య శంఖస్య శబ్దేన రథనేమి స్వనేనచ ౨౭
గాండీవస్యచ ఘోషేణ పృథివీ సమకంపత
అమానుషానాం సర్వేషాం భూతానాం ధ్వజవాసినామ్ ౨౮
ఊర్ధ్వం పుచ్ఛా న్విధున్వానా ధావమానా స్సమంతతః
గావః ప్రతిన్యవర్తంత దిశ మాస్థాయ దక్షిణామ్ ౨౯

(రాజును బీభత్సుడు నిలువనిచ్చినాడుకాడు. అతని వెంటనే మనము చెచ్చెరబోవుదము, అతిసంక్రుద్ధుడగు పార్థునితో దుర్యోధను డొక్కరుండు యుద్ధమొనర్పం జాలడు ... దేవేంద్రుడు, దేవకీసుతుడు, సపుత్రకుడగు ద్రోణుడుగాక వేఱొక రాతని నెదిరింపజాలరు. గోవులుకాని, విపులమైన ధనముగాని యేమి (ప్రయోజనము) మనకు. దుర్యోధనుడను నావ పార్థుడను జలములో మునిగిపోవునుగదా,' కృపుడిట్లుగా బలికెను. అట్లే (తథైవ) బీభత్సుడు స్వనామోచ్చారణ మొనరించి శలభముల ట్లాసేనను శరపరంపరచే ముంచివేసెను, ఆయోధులు శరసంఛాదితమగుట భూమ్యాకాశములను గాంచరైరి ఎటుపాఱుటకును తోచనివారై మనస్సులందా పార్థుని శీఘ్రత్వమును తలపోయజొచ్చిరి, అపు డర్జునుడు ద్విషద్రోమహర్షణమగు శంఖమును పూరించెను. ధనుః శ్రేష్ఠమును టంకారమొన

రించెను. ధ్వజమందలి భూతములను ప్రచోదించెను. ఆశంఖ శబ్దమున. రథనేమిస్వనమున, గాండీవఘోషమున. ధ్వజవాసములైన భూతముల యమానుషశబ్దములవలన భూమికంపించెను. గోవులు తోకలు పైకెత్తి విదలించుచు నలుగడలబరువులెత్తుచు దక్షిణదిశనుండి మరలిపోయినవి.)

నాయకుడులేని యీ యల్పసైన్యము బెదిరిపోయినది. అర్జునుడు స్వనామోచ్చారణ పూర్వకముగా శరపరంపర గురిపించెను. అర్జునశీఘ్రతత్వమున నా సైన్యము కర్తవ్యమూఢమై నిశ్చేష్టత నొందినది. ఇదివఱ కర్జునుడు దేవదత్తమును పూరింపగా నుత్తర నిగుఱ్ఱములు పడిపోయినవి. ఉత్తరు డొరిగిపోయినాడు. గావున నది యర్జునునకొక యనుభవమును కల్గించినది. అర్జునుడది గమనించి యమానుషశబ్దములు పెక్కుగల్గించినాడు. దీనితో గోవులు బెదరి నలుదిక్కులకు బాఱినవి. వాటంతటయవియే - యీ గోవులన్నియు గోష్ఠాగారమును చేరిపోయినవి. ఇట్లుగా గౌరవులను జయించకముందే - యుద్ధము ప్రారంభముగాకముందే - యాదియందే గోవులన్నియు నర్జునవశమై విరాటనగరము చేరిపోయినవి. దైవమిట్టి విచిత్రసన్నివేశమపుడుగావించినది.

శత్రుసైన్యమును చెచ్చెరచిందరవందర గావించి గోవులను జయించి యర్జునుడింకను యుద్ధము చేయందలంచి దుర్యోధనాభిముఖముగా బోవుచుండెను. [*] విరాటరాజధానిని

[*] గోషు ప్రయాతాసు జవేన మత్స్యాన్ కిరీటినం కృతకార్యంచ మత్వా ౫౪-౨

గోవులు చేరిపోవుటంజేసి కిరీటి కృతకార్యుడని తలంచిన కురు ప్రవీరు లపుడు దుర్యోధనుని పార్థుడు సమీపించుచున్నాడని పరుగుపరుగున నచ్చటికి రాజొచ్చిరి. అర్జును డుత్తరునితో కాంచనరశ్మియోక్త్రములనుపట్టి శ్వేతాశ్వములను కడువడిని బోనిమ్మిదె నేను కురుసింహబృందమును ప్రవేశించెదను. గజము గజమునట్లు దురాత్ముడు సూతపుత్రుడు నాతో యుద్ధమాడ జూచును. [1*] దుర్యోధనోపాశ్రయజాతదర్పుడగు నాకర్ణుని పైకి రథము బోనిమ్ము' (మాం ప్రాపయ) అని పలికెను. [2*] అర్జును డనినదే తడవుగా నుత్తరుడు రథికుల నుగ్గు చేయుచు రథమునడపి పాండవుని రణమధ్యమునకు జేర్చెను. ముందుగా చిత్రసేనుడు, సంగ్రామజిత్తు, శత్రుసహుడు, జయుడు - కర్ణునికంటె ముందుగా నర్జును నెదిరించిరి. ఈ తుములయుద్ధ మందు గురుప్రవీరుడగు వికర్ణుడు భీమముగా భీమానుజు నెదిరించి తాలజాలక తొలగిపోయెను. శత్రుంతపు డర్జును నెదిరించి గతాసుడై నేలపై చెట్టువలె పడిపోయెను. [3*] నరర్షభు లానరర్షభు నెదిరించి యా వీరులు వీరతరముగా భగ్నమొంది

[1*] త మేవ మాం ప్రాపయ రాజపుత్ర దుర్యోధనో పాశ్రయ జాత దర్పం ౫

[2*] వ్యధ్వంసయత్తత్రథినా మనీకం తతో౭వహ త్పాండవ మాజి మధ్యే ౬

[3*] నరర్షభా స్తేన నరర్షభేన వీరా రణే వీరత భగ్నాః
చకంపిరే వాతవశేన కాలే ప్రకంపితానీవ మహావనాని ౧౪

గాలికి మహావనములట్లు కంపించిపోయిరి. కిరీటమాలియైన గాండీవధ్వనుడు దిక్కువిదిక్కులందు విజృంభించి శత్రుభంజన మొనరించుచు సంగ్రామజిత్తుశిరము నొక్క బాణమున ద్రుంచి వేసెను. తమ్ముడు హతుడుకాగా కర్ణుడు పార్థునెదిరించి పండ్రెండు బాణము లతనిపైని, విరాటపుత్రుని కరమందొక బాణము వేసెను. సర్వధనుర్ధారులం దుత్తములగు నాకర్ణార్జునుల యుద్ధమును తిలకించుచు కౌరవులల్లే నిలిచిపోయిరి. అర్జును డుదీర్ణకోపుడై హర్షయుక్తుడై గర్ణు నీక్షించి క్షణకాలములో ఘోరశరౌఘవృష్టియందు దురంగమాతంగసూతులను ముంచివేసెను, గజారూఢులు. గుఱ్ఱపురౌతులు బాగుగా దెబ్బలుతిని బిగ్గరగా గూతలిడిరి [1*] భీష్మ ముఖులును నపుడు చిందరవందరయైన రథాశ్వములుగలవారై యర్జున ఘోరశరౌఘ వృష్టియం దంతర్హితులై యుండిరి అట్టియెడ కర్ణుండును నర్జున శరౌఘములను శరౌఘములచే గొట్టుచు ధనుర్బాణములగొని మిణుంగుఱులు గ్రక్కుచున్న యగ్నిచాడ్పున బ్రజ్వలించెను. అవ్విధంబున నల్లె త్రాటిని సారించుచున్న [2*] కర్ణుని బ్రశంసించుచు గౌరవులు చప్పట్లు చఱచిరి. శంఖభేరీపటహాంబులు వాయించిరి [3*] ఆకులభీషణమైనట్టి యుద్ధూతలాంగూల మహాపతాక ధ్వజమును (హనుమద్ధ్వజమును) గాండీవనిర్ఘోషకృతప్రణాదుడగు కిరీటిని గాంచి కర్ణుడు సింహనాదము గావించెను. [4*] కర్ణుని కర్ణునిసర్వపరికరములను మర్దించుచు నపుడు కిరీటి పితామహుని, ద్రోణకృపులను వీక్షించెను. [5*] ఆభీషణసంగ్రామమున

గర్ణార్జునుల నపుడు ఘనాంతరచంద్రసూర్యుల క్లైల్లరు దిల కించిరి. అతుకారియై కర్ణు డర్జునుని, యాతనిహయములను, సారథిని, కేతువును బాణములతో గొట్టెను. ఇందువలన ప్రబోధితసింహమట్లయి యర్జునుడు కర్ణునతిక్రమించి యాకర్ణాంతము ధనుస్సునుపూరించి శరప్రయోగము గావించెను. కర్ణుడు నిలువ లేక సర్వాంగవేదన నొంది పాండవపాణ తప్తుడై సంగ్రామశిరః ప్రదేశమును విడిచి శీఘ్రగతిని పారిపోయెను. రాధేయు డట్లు తొలగిపోగా నపుడు దుర్యోధనాదులెల్ల సంకులముగా నర్జును

---

[ 172 పేజీ తరువాయి ]

[1*] అంతర్హితా భీష్మముఖాః సహాశ్వాః కిరీటినా కీర్ణరథాః పృషత్కైః ౧౫

[2*] తతస్త్వభూద్వై తలతాళశబ్దః సశంఖభేరీ ప్రణవప్రణాదః ౧౬

[3*] ఉద్ధూతలాంగులమహాపతాక ధ్వజోత్తమాం సాకులభీష ణాంతకం గాండీవనిర్ఘోషకృతప్రణాదం కిరీటినం ప్రేక్షనవాద కర్ణః ౧౭

[4*] స చాపి వైకర్తన మర్దయిత్వా .... పితామహం ద్రోణ కృపౌచ దృష్ట్వా ౧౮

[5*] రథే విలగ్నా వివ చంద్రసూర్యౌఘనాంతరే ణాను దదర్శ లోకః ౨౦

నెదిరించిరి [1*] అర్జునుడు చతురంగసైన్యమందెల్ల బాణములు నిండించి ప్రతిరెండంగుళములందు బాణములునాటించి కల గుండు గావించెను. [2*] అర్జునోత్తరుల యుద్ధతంత్ర నైపుణ్యము (నెల్లరు) ప్రశంసించిరి. [3*] అర్జునుని సర్వాస్త్ర తేజములచేతను. గాండీవ ధనుష్టంకారముచేతను, ధ్వజస్థభూత ముల యమానుష శబ్దములచేతను, వానరుని భైరవవముచేతను శంఖప్రణాదముచేతను కౌరవబలమం దర్జునుడు భయమును గల్గించెను. అనంతభోగమగుభుజగము మహార్ణవమందు క్రీడిం చున ట్లర్జునుం డరాతిబలమును విక్షోభముగావించెను సవ్యసాచి సాయకాసనమండలము రణరంగమందంతట గానవచ్చుచుండెను.

---

[1*] న రథానాం న చాశ్వానాం న గజానాం న వర్మణాం
అనివిద్ధం శితై ర్బాణై రాసీ ద్వ్యంగుళ మంతరమ్ ౨౨-౨

[2*] దివ్యయోగాచ్చ పార్థస్య హయానా ముత్తరస్యచ
శిక్షాశిల్పోపపన్నత్వా దస్త్రాణాంచ పరిక్రమాత్ ౬
వీర్యవత్త్వం ద్రుతం చాగ్ర్యం దృష్ట్వా జిష్ణో రపూజయన్ ౭

[3*] తత స్సర్వాస్త్రతేజోభి ర్ధనుషో నిస్వనేనచ
శబ్దే నామానుషాణాంచ భూతానాం ధ్వజవాసినామ్ ౧౬
భైరవం శబ్ద మత్యర్థం వానరస్యచ కుర్వతః
దైవారిపాశ్చ బీభత్సు స్తస్మిన్ దౌర్యోధనే బలే ౧౭
భయ ముత్పాదయామాస బలవా నరిమర్దినః ౧౮

[1*] అరూపమందు గన్నుపడనట్లుగా నలత్ష్యమందు గాండీవ ధన్వుని శరములు ప్రయోగింపబడలేదు. గజసహస్రమార్గమంతటి విశాలమైన తలమం దర్జుని దివ్యరథముమార్గ మేర్పడి యుండెను. ఇట్టి సంకుల సమరమున నర్జునుడు ద్రోణుని, దుస్స హుని, ద్రౌణిని, దుశ్శాసనుని, కృపుని, భీష్ముని, దుర్యోధనుని బాణములతో గొట్టెను. [2*] కర్ణుని గూబ రింగుమనునట్లు బాణమేసెను. సర్వాస్త్రకోవిదుడగు గర్ణు డిట్లు విద్ధుడై విర థుడు కాగా కౌరవబలమంతయు భంజన మొందెను. సైన్య మట్లు భగ్నమగుటం గాంచి యుత్తరు డభిప్రాయ మెఱింగి యర్జునునితో 'రథము నెచ్చటకు గొనిపోవలయును' అని యడి గెను. రథచోదనవిషయకమగు వివరణము నిట్లుగా నర్జును డుత్త రున కెఱిగించెను, [*3] కృపానీకము సమీపమునకు నన్ను గొనిపొమ్ము. అతనికి శీఘ్రాస్త్రమును దర్శింప జేసెదను. సదా

---

[*1] ఏతం త్వరూపేషు యథా చక్షూంషి నకదాచన
నాలక్ష్యేషు శరాః పేతు స్తథా గాండీవధన్వినః ౨౮

[2*] కర్ణంచ కర్ణినా కర్ణే వివ్యాధ పరవీరహా ౩౯

[*] కృపస్య దర్శయిష్యామి శీఘ్రాస్త్రం దృఢధన్వినః ౪౪
ఆచార్య ఏషహి ద్రోణః ... కురు ష్వైనం ప్రదక్షిణమ్ ౪౬
అత్రైవ చావరో హైన మేష ధర్మ స్సనాతనః
యది మే ప్రథమం ద్రోణః శరీరే ప్రహరిష్యతి ౪౭
తతో ఽ స్య ప్రహరిష్యామి నాస్య కోపో భవే దితి ౪౮
ఆచార్య స్యైష పుత్రోవై అశ్వత్థామా మహారథః
ఏతస్య త్వం రథం ప్రాప్య నివర్తే థాః పునః పునః ౫౦
ధృతరాష్ట్రసుత శ్శ్రీమా నేష రాజా సుయోధనః
ఏత స్యాభిముఖం వీర రథం పరరథారుజమ్ ౫౨

నాకు మాన్యుడు, సర్వశస్త్రభృతులకు మాన్యుండా ద్రోణునకు ప్రదక్షిణము గావింపుము మచ్చోట నీ యవరత్వ మిది సనాతన ధర్మ మగును. నన్నా ద్రోణుడు మొదట ప్రహరించిన నపుడు నేను గొట్టెద నట్లయిన నాతనికి గోపము గానేరదు. అశ్వత్థామ రథమునుండి మరలమరల మరలుచుండును. శీఘ్రాస్త్రప్రయోగ మున నేను ద్రోణశిష్యులందు ప్రథముడనంచు నున్నవాడా నాగ కేతనుండగు దుర్యోధనునకు శీఘ్రాస్త్రము నీవిపులరణరంగ మందు దర్శింపజేయుదును, అతనిరథమున కెదురుగా రథమును పోనిమ్ము. కర్ణుడు సదా నాయందు స్పర్ధ గల్గియుండు నచ్చోట నీవు యత్నపరుండవై యుండుము. తారార్కచిత్రితధ్వజుం డును, శ్వేతచ్ఛత్రశోభిత మూర్ధనుడు, హైమచంద్రార్క

---

ప్రాపయ సైన్యేష రాజాహి ప్రమాధీ యుద్ధదుర్మదః
ఏష ద్రోణస్య శిష్యాణాం శీఘ్రాస్త్రే ప్రథమో మతః ౫౩
ఏతస్య దర్శయిష్యామి శీఘ్రాస్త్రం విపులం రణే ౫౪
ఏతస్య రథ మాస్థాయ రాధేయస్య దురాత్మనః
యత్తో భవేథాః సంగ్రామే స్పర్ధతేహి సదా మయా ౫౬
యస్య తారార్క చిత్రోఽసౌ రథే ధ్వజవరః స్థితః
యస్యైత త్పాండురం ఛత్రం విమలం మూర్ధ్ని తిష్ఠతి ౫౭
హైమచంద్రార్కసంకాశం కవచం యస్య దృశ్యతే
జాతరూపశిరస్త్రాణం మన స్త్రాసయతీవ మే ౫౮
ఏష శాంతనవో భీష్మః సర్వేషాం నః పితామహః
రాజశ్రియాభివృద్ధశ్చ దుర్యోధనవశానుగః ౬౦

సంకాశకవచుండును. జాతరూప శిరస్త్రాణుడు నగు భీష్ముడు-శాంతనవుడు మాకెల్లరకు పితామహుండు నాకు మనసావ మగుచున్నాడు రాజశ్రేయాభిలాషుడు దుర్యోధనవశానుగుడై యున్నాడు. పశ్చాత్ ప్రయాణవ్యూహమున నట్లయిన నాకు విఘ్న కరుడు కానేరడు ఆతనితో యుద్ధమునకు హయములను జాగ్రత్తగా బట్టుము అని పలికెను. ఈ మహాద్వంద్వమును తిల

---

ప్రతిజ్ఞాపూర్వుడైన శాంతనవుడు రాజ్యమంగీకరించలేదు. జాత్యంధుడైన ధృతరాష్ట్రునకు రాజ్యాధికారము లేకపోయెను, ప్రాప్తింపదగిన రాజ్యము తాను పొందలేము క్షేత్రజుండగు పాండుమహారాజు పట్టాభిషిక్తుండగుట కిష్టయించలేదు అందువలన పాండునకు రాజ్యమును జ్యేష్ఠుడగు ధృతరాష్ట్రుడు రాష్ట్రమును ధరించినవాడుగా నేర్పడినాడు ధృతరాష్ట్రుడైనాడు, గాంధారి ముందుగా గర్భమును ధరించినది కాని ధర్మజుడే యగ్రజుగా భూపతనమైనాడు. ఈర్ష్య నొంది గాంధారి గర్భవిచ్ఛేద మొనరించుకొనినది భీమసేనదుర్యోధనులొకేమారు పుట్టిరి. దేవతలవలన కుంతీమాద్రులందు జన్మించిన పాండవులు పాండుమహారాజున కౌరసపుత్రులైరి హనుమంతుడు కేసరిని, వాయువును తండ్రులుగా బేర్కొనినాడు (సుందరాకాండ) అట్లే పాండవులు ధర్మానిలేంద్రాశ్వినులను, పాండుమహారాజును తండ్రులుగా బేర్కొనినారు. అనగా ధర్మజునకు యమధర్మరాజు, పాండుమహారాజు తండ్రులు, ఇట్లే భీమాదులును నిద్దఱిద్దఱు కౌరసపుత్రులుగా నేర్పడిరి. సూర్యునివలన కుంతియందు ప్రథముడుగా జన్మించిన కర్ణుడు రాధేయు

కింప దేవాదులందఱు విచ్చేసి నభము నలంకరించిరి. విమానావళి చేత నాకాశము, చతురంగసైన్యముచేత పృథివి మిక్కిలిగా శోభించినవి. సర్వరత్నవిభూషితము కామగమను. దివ్యము నగు దేవరాజవిమానము - సుదర్శనము ఖేచరమగుచు

డై నాడు, రాజవంశమునుండి చ్యుతుడై నాడు, రాజ్యైక దేశమగు నంగదేశమునకు మొదటగా ప్రభువై నాడు, ఇది దుర్యోధనునివలననే యేర్పడుట గమనింపదగినది. కౌరవ పాండవులందు జ్యేష్ఠుడగు యుధిష్ఠిరుండు కురురాజ్యమున కంతకు యువరాజయినాడు. రాజ్యసంశోభితులు పాండవు లగుచున్నందుల కీర్ష్యకల్గి దుర్యోధనుడు పాండవులను సమూలము గాల్చివేయ దలంచి లక్కయింట బాండవుల ప్రవేశింప జేసెను. పాండవు లీయాపదను మెలకువగాగడచి యసహాయులై యేకాకులై పెక్కిడుమలంబడి యెట్టకేలకు బాంచాల దేశమునకు బోయిరి, ద్రౌపదిని పరిణయమొందిరి, భీష్మవచనానుసారము నర్ధరాజ్యము నొందిరి. ద్రౌపదీసమేతులై పాండవులు రాజసూయ మొనరించి జగత్సార్వభౌములైరి. పాండురాజ నియుక్తుడైయున్న ధృతరాష్ట్రునందు జిత్రముగా నర్ధరాజ్యము వర్తించినందున భీష్మద్రోణాదులందఱు తత్పక్షస్థులుగా నగుట యేర్పడినది. ధృతరాష్ట్రుని కొడుకులు దుర్యోధనాదులు నూర్గురు హతులుకాగా, కర్ణుడీల్గగా 'ధర్మరాజు సర్వరాజ్యమునకు పట్టాభిషిక్తుడై జగదేకసార్వభౌముడై నాడు, భీముడు యువరాజాయెను. రాజ్యక్రమమెల్ల నడపెను. అపుడు ధృతరాష్ట్రుడు, ఆతని వైశ్యాపుత్రుడు యుయుత్సుడు పాండవుల యొద్దనుండువారైరి.

శోభించెను [*] అలంకృతుండగు దేవేంద్రుడు సురసంవృతుడై రణరంగ శోభితుండగు గుమారు నర్జునుని జహాస్త్రములచే వీక్షమాణుడై యెంతదిలకించియు సంతృప్తుడు గాలేక యదే వీక్షించుచుండెను.

ఈ యుద్ధమున దొంతరగా నిర్జితులైన వారు సుయోధనానుజుడగు వికర్ణుడు. వికర్ణుడు తాళజాలక పరుగున పారిపోయినాడు అపు డర్జునుడు విజృంభించి కర్ణునెదుట వాని యనుజుడగు సంగ్రామజిత్తును వధించెను. ఆరోషమునగర్ణు డర్జును నెదిరించెను. దంతములతో మదగజ మెదిరించినట్లుగా గర్ణు డెదిరించి పెద్దయుద్ధ మొనరించెను భీష్మాదులును నంత ర్హితులగుచున్న యాతుమూలయుద్ధమం దర్జును నెదిరించి కర్ణుడు విజృంభించెను అర్జునుని దివ్యపరికరములను చూచుచు సింహనాద మొనరించి కర్ణు డర్జునుని నొప్పించెను. ప్రబోధితసింహమట్లర్జును డపుడు విజృంభించి యుద్ధ మొనరించెను అపుడు కర్ణుడు సర్వాంగమర్దితుడై పాండవబాణతప్తుడై సంగ్రామశిరః ప్రదేశమునుండి తొలగిపోయెను. అపుడు దుర్యోధనపురోగములగు కౌరవులెల్లరు పార్థు నెదిరించిరి. ఆసంకులసమరమం దర్జునుడు సర్వత్ర శరప్రయోగ మొనరించి యెల్లరనొప్పించెను. ద్రోణాదులపై బాణపరంపర గురిపింపగా నావ్యూహ మసుదు విచ్ఛేద మొందెను. ఈ ౫౪ అధ్యాయమున రణరంగవర్ణనము రసవంత

---

[*] వజ్రభృచ్ఛుశుభే తత్ర విమానస్థ స్సురైర్వృతః
విప్రేక్షమాణో బహుభిర్నాతృప్య త్సూను మాహవే ౫౩-౧౨

ముగా నున్నది, ఉత్తరార్జునుల చాకచక్య మిందు నిరూపింప బడినది, కాలాగ్నియట్లు విజృంభించుచున్న యర్జును నెవరును దేరిచూడజాలకుండిరి. సాయంసమయమున సూర్యుడ_స్తమించునే కాని యర్జును డాజినుండి మరలువాడు కాడంచు నెల్లరు దల పోసిరి. కర్ణ భంజనమున వ్యూహాభంజన మైనది రధికుని (అర్జు నుని) హృదయ మెఱుంగగోరి యు_త్తరుడు సమయములో క_ర్తవ్యవిషయ మడిగెను అర్జునుడు దుర్యోధనునిపై బడబోవు చుండుట నెఱింగియది తెల్పినవాడు కృపుడు. ఆ కృపుని యెదు టకే ముందుగా నర్జునుడు రథమును నడుపుమని యు_త్తరునితో బలుకుట చిత్రముగా నున్నది. భీష్మ ద్రోణాదులకు గోప మేర్పడకుండునట్లు యుద్ధతంత్రము నెల్ల నర్జును డు_త్తరున కెఱిగించినాడు అశ్వత్థామనుగూర్చియు యోగ్య వచనము పలికినాడు. కర్ణదుర్యోధనుల నెదిరించున ఱుకును తెల్లమొన రించినాడు [1*] ఉ_త్తరుడు చిత్రముగా రథము నడిపించి యందు ద్రోణునకు ప్రదక్షిణ మొనరించినవిధము గావించి రథ మును కృపుని యెదుటకు గొనివచ్చినాడు [2*] కృపుని గౌరవ మును నిలుపుచు నర్జునుడు యుద్ధము గావించెను, చివరకు పదు

---

[*] జాంబూనదమయీ వేదీ ధ్వజే యస్య ప్రదృశ్యతే
తస్య దక్షిణతో యాహి కృప శ్శారద్వతో యతః ౫౭-౨

[2*] చ్యుతం గౌతమ మాలోక్య స్థానాత్ కుంతీసుత స్తదా
నావిధ్య త్పరవీరఘ్నో రక్షమాణో ౽ స్య గౌరవమ్ ౨౭

మూడు బాణములు కృపునిపైని, యాఱింటిని గుఱ్ఱములపైని యర్జునుడు ప్రయోగింపగా నప్పుడు హీనుడైన కృపుని యుద్ధభూమినుండి నరర్షభులు మరలించి తెచ్చిరి. పిమ్మట శోణాశ్వవాహనుడైన ద్రోణుని శ్వేతాశ్వవాహనుడగు నర్జునుడు సమీపించి వినయపూర్వకముగా నిట్లు పలికెను.

తౌరథౌ వీర్యసంపన్నౌ దృష్ట్వా సంగ్రామమూర్ధని
ఆచార్య శిష్యౌ వజితౌ కృతవిద్యౌ మనస్వినౌ ౫౮-౧౫
సమాశ్లిష్టౌ తదాన్యోన్యం ద్రోణపార్థౌ మహాబలౌ
దృష్ట్వా ప్రాకంపత ముహుః భరతానాం మహద్బలమ్ ౧౬
హర్షయుక్త స్తతః పార్థః ప్రహసన్నివ వీర్యవాన్
రథం రథేన ద్రోణస్య సమాసాద్య మహారథః ౧౭
అభివాద్య మహాబాహుః స్సామపూర్వ మిదం వచః
ఉవాచ శ్లక్ష్ణయా వాచా కౌంతేయః పరవీరహా ౧౮
ఉషితాఃస్మో వనే వాసం ప్రతికర్మ చికీర్షవః
కోపం నార్హసి నః కర్తుం సదా సమరదుర్జయ ౧౮
అహంతు ప్రహృతే పూర్వం ప్రహరిష్యామి తే௨నఘ
ఇతి మే వర్తతే బుద్ధి స్తద్భవాన్ కర్తు మర్హతి ౨౦

(అజితులు, కృతవిద్యులు, మనస్వులు, ఆచార్యశిష్యులు నగు ద్రోణార్జునుల సమాసమిమును గాంచి కౌరవసైన్యము మిక్కిలిగా గంపించెను. అర్జునుడు హర్షయుక్తుడై ప్రహసించుచు ద్రోణరథమున కెదురుగా రథమును చేర్చి సామపూర్వము, శ్లక్ష్ణమునగు వాక్య మిట్లు పలికెను. సదా సమర దుర్జయ

వనమందువసించిన మేము ప్రతికర్మ గావించువారమే యగు దుము. మాయందు గోపింపదగదు, పూర్వవిద్ధుడనై పశ్చాత్ప్రహ ర్తను కావలయునని వాయభిప్రాయ మగుచున్న దట్లు గావింపవలసినది.' అని పలికెను. అధికవింశతిసాయకములను ద్రోణుడు ప్రయోగింపగా వాని నప్రాప్తములుగా నర్జునుడు ఛేదించెను.)

అర్జునుడు ద్రోణుని 'సదా సమరదుర్జయ' అని సంబో ధించుట గంభీరవిషయమై యున్నది. ద్రోణార్జునులిద్దఱు సదా సమరదుర్జయులే. అజితులే. అట్లోటమినెఱుంగని వారిరువుర కిపుడు సంగ్రామ మేర్పడినది. ధర్మపక్షమువా డర్జునుడు, మన్న్యపక్షమువాడు ద్రోణుడునై యున్నారు, కావున నిప్పు డేర్పడనున్న జయాపజయములు పక్షమునకు సంబంధించినవై యున్నవని యభిప్రాయము. ధర్మజ దుర్యోధనుల కిప్పుడు జయాపజయము లేర్పడుచున్నవని ఫలితార్థము. దుష్టపక్షము వాడు ద్రోణుడని స్పష్టముపలుకుట గాంభీర్యము కానేరదు. కావున నర్జును డీ యుదారవచనమున నీవిషయగాంభీర్యమెల్ల స్ఫురింపజేయు వాడగుచున్నాడు, 'మాయందు గోపమొంద దగదు' అని బహువచనముగా నర్జునుడు వచించుటయు గమ నార్హమైయున్నది, పాండవవిజయ పూర్వక కౌరవపరాభవము (ఓటమిని) నిది ధ్వనింపజేయుచున్నది, అర్జునుని యీ నిదాన వచనమునకు ద్రోణుడు బదు లేమియు బలుకలేదు అధికవింశతి బాణములు ప్రయోగించి ద్రోణుడు యుద్ధమారంభించెను. అర్జును డాదియందే శరములచే ద్రోణునకు బాదాభివందనము,

కుశలప్రశ్న గావించియున్నాడు. మఱియు సంకులయుద్ధమందు ద్రోణునిపై డబ్బదిబాణములు వేసియున్నాడు. ద్రోణునితోడ నిది ప్రత్యేకమగుయుద్ధము గాన నర్జును డిపుడు ధర్మమార్గ వినయమును (వివేకమును) గావించుచు బలాత్క్రమించెను. [*] ఆ గొప్పయుద్ధమున ద్రోణుడు చివరకు దాళలేనివా డాయెను. అపు డశ్వత్థాను రథబృందముతోడ వేగవచ్చి యర్జును నెదిరించెను.

అశ్వత్థామాతు తత్కర్మ హృదయేన మహాత్మనః
పూజయామాస పార్థస్వ కోపం చాస్యాకరో ద్భృశమ్ ౨౪

ఆవృత్యతు మహాబాహు ర్యతో ద్రౌణి స్తతో హయాన్
అంతరం ప్రదదౌ పార్థో ద్రోణస్య వ్యవసర్పితుమ్ ౨౭

సతు లబ్ధ్వాంతరం తూర్ణం వ్యపాయా జ్జవనై ర్హయైః
ఛిన్నవర్మధ్వజ శ్శూరో నికృత్తః పరమేషుభిః ౨౮

(అశ్వత్థామయు నాయర్జునకృత్యమునకు మనస్సులో మెచ్చుకొనెను, గొప్పకోపమొంది శరసహస్రములు వర్షించుచు నర్జును నెదిరించెను, అశ్వత్థామయొద్ద కపు డర్జునుడు మరలెను. ద్రోణుడు తొలగిపోవుట కర్జును డంతరమొసంగగా నతడు లబ్ధ్వాంతరుడై శీఘ్రాశ్వములతో రణభూమినుండి ఛిన్నవర్మ ధ్వజుడై తొలగిపోయెను.)

---

[*] తయో రాసీ త్సంప్రహారః క్రుద్ధయో ర్నరసింహయోః
అమర్షిణో స్తదాన్యోన్యం దేవదానవయోరివ ౫౪

అర్జునుని పరమసామంత్ర మిచ్చోట నభివ్యక్తమగుచున్నది జగదేకవీరు లిరువురితో (ద్రోణాశ్వత్థామలతో - తండ్రికొడుకు లిరువురితో) గావించుచున్న పరమబీభత్ససంగ్రామ మది. ఆయర్జునపరాక్రమమునకు మనస్సులో నశ్వత్థామ మెచ్చుకొని యెను, తండ్రియొక్క పరిస్థితినిగాంచి గొప్పకోపమొందెను అర్జును డశ్వత్థామ నట్టిపరిస్థితిగా నెదిరించుచుగూడ రణరంగము నుండి తొలగిపోవుటకు ద్రోణున కవకాశ మొసంగెను. అట్లు లబ్ధావంతరుడగుచు ద్రోణుడు వేవేగ నచ్చోటునుండి పాఱి పోవుటయం దర్జునుని భూరిపరాక్రమవిశేష మెంతయేని సువ్యక్తమగుచున్నది [*] అర్జునునకు నశ్వత్థామకు నపుడు మఱియు దుములమగుయుద్ధము జరిగినది. అర్జును డశ్వత్థామ గుఱ్ఱములను గొట్టగా నవి దిగ్భ్రమనొందినవి. అపుడే సూక్ష్మ వివరమునుగాంచి యశ్వత్థామ గాండీవమునారిని ద్రెంపివేసెను.

---

అథ పూర్ణాయతోత్సృష్టైః శరైః స్సన్నతపర్వభిః
స్తదారయేతా మన్యోన్యం ప్రాణద్యూతే ప్రవర్తితే ౬౩
ఆకీర్యమాణే ద్రోణేతు శరైర్గాండీవధన్వినా
హాహాకారో మహానాసీ త్సైన్యానాం భరతర్షభ ౬౭
పాండవస్యతు శీఘ్రాస్త్రం మఘవాన్ ప్రత్యపూజయత్
గంధర్వాప్సరసశ్చైవ యేచ తత్ర సమాగతాః ౭౩

[*] ద్రోణార్జునయుద్ధమున జెప్పబడిన రెండేసి శ్లోకము లర్జునాశ్వత్థామయుద్ధమం దొక్కొక్క శ్లోకములుగా వ్రాయ బడినవి.

తదస్యా పూజయన్ దేవాః కర్మదృష్ట్వా ౽ తిమానుషమ్
౫౯-౭

ద్రోణో భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చైవ మహారథః
సాధు సాధ్వితి భాషంతో ౽ పూజయన్ కర్మ తస్య తత్ ౮

(ఈ యమానుషకృత్యమును గాంచి దేవతలు మెచ్చిరి. ద్రోణుడు, భీష్ముడు, కర్ణుడు, కృపుడు ప్రత్యేక ప్రత్యేకముగా ప్రశంసావాక్యములు పలికిరి. [*] అశ్వత్థామ గాండీవమునారి నట్లుగొట్టి యా వివరమందే యర్జునునిహృదయమందు శరములు ప్రయోగించెను, అపు డర్జునాశ్వత్థామల కతిఘోరమైనసంగ్రామ మేర్పడినది.)

అథయ్యావిషుధీ దివ్యౌ పాండవస్య మహాత్మనః
తేన పార్థో రణే శూర స్తస్థౌ గిరి రివాచలః ౧౫
అశ్వత్థామ్నః పున ర్బాణాః క్షిప్ర మభ్యస్యతో రణే
జగ్ముః పరిక్షయం తూర్ణ మభూ త్తే నాధి కో ౽ ర్జునః ౧౬

---

తయో ర్దేవాసురసమః సన్నిపాతో మహానభూత్
కిరతో శ్శరజాలాని వృత్రవాసవయో రివ ౫౬-౩

ద్రోణార్జునసంగ్రామమం దీ విశేషములు రెండు శ్లోకములుగా వ్రాయబడియున్నవి. (౫౮-౪౬-౫౪)

న స్మ సూర్య స్తదా భాతి నచ వాతి సమీరణః
శరజాలవృతో వ్యోమ్ని ఛాయాభూతే సమంతతః ౫౯-౪

ద్రోణార్జునసంగ్రామమం దీరెండువిశేషములు రెండు శ్లోకములందు వ్రాయబడియున్నవి (౫౮-౩౧-౬౮)

అరునుడు కృపునిగుఱ్ఱములను గొట్టగా నవి దిగ్భ్రమ నొందినవి. కృపుడు స్థానమునుండి చ్యుతుడుకాగా నాతని గౌరవము గాపాడుచు నాతడు సర్దుకొనువఱకు నర్జునుడు శర ప్రయోగ మొనరింపలేదు అశ్వత్థామ గుఱ్ఱముల నర్జునుడు గొట్టగా నవి దిగ్భ్రమనొందినవి. అశ్వత్థామ యిదేసమయములో బరాక్రమించి గాండీవమునారిని ద్రెంపి యర్జుననిహృదయ మందు శరములు ప్రయోగించెను. దేవత లీ యశ్వత్థామ కృతమును ప్రశంసించిరి. కౌరవవీరులు (ద్రోణముఖ్యులు) ప్రత్యేకముగా నశ్వత్థామ పరాక్రమమును ప్రశంసించిరి.

స రోషవశ మాపన్నః కర్ణ మేవ జిఘాంసయా
త మైక్షత వివృత్తాభ్యాం నేత్రాభ్యాం కురుపుంగవః ౧౮
తథాతు విముఖే పార్థే ద్రోణపుత్రస్య సాయకాన్
త్వరితాః పురుషా రాజ న్నుపాజహ్రుః సహస్రశః ౨౧
ఉత్సృజ్యతు మహాబాహు ర్ద్రౌణిపుత్రం ధనంజయః
అభిదుద్రావ సహసా కర్ణమేవ సపత్నజిత్ ౨౧

(దివ్యాక్షయతూణీరుడగు నర్జును డచలమట్లు రణరంగ మందు నిలువగలిగెను, అశ్వత్థామ శరపరిక్షయు డగుటంజేసి యర్జును డధికుడు కాగలిగెను. ఆ పరిస్థితియందు గర్ణు డర్జును నెదిరింపగా నపుడు హాహా కారము గల్గెను, రాధేయుని జూడ గనే యర్జుననకు గోపము వృద్ధి పొందెను రోషవశుడై కర్ణుని జూచెను. ధనంజయుడు ద్రోణపుత్రుని విడిచి తత్క్షణము

[*] అర్జుననకు సారథికృష్ణుడు, ధ్వజము హనుమంతుడు. రథ మగ్నిదత్తము, గుఱ్ఱములు గంధర్వరా జొసంగినవి. గాండీవము బ్రహ్మదత్తమైనది. గాండీవమునారిని ద్రెంచుటయనునదే పెద్ద విశేషము అంతకన్న చేయునది వేఱిమియు కానేరదు.

పరుగునవచ్చి కర్ణు నెదిరించెను, కర్ణునితో ద్వైరథ యుద్ధము గావింపగోరి యర్జును డిట్లు పలికెను. పార్థు డిట్లుగా నశ్వత్థామ నుండి విముఖుండు కాగా నపుడు పురుషులాతనికి సాయకము లందించిరి.

అర్జును డశ్వత్థామతోడి యుద్ధమందు గొంచెముసేపు నిల్చి నాడనియు, నధికుడాయెననియు గలదు. అశ్వత్థామయందు భావమును గనబఱచుచు నర్జునాధిక్యమును, అతని రణవిజయ మును వ్యక్తీకరించుట విచిత్రముగా నున్నది.

అర్జును డిప్పటికి భీష్మునిదప్ప తక్కినవీరవరుల నెల్ల సాధించియున్నాడు. సంకులయుద్ధము కౌరవులందఱతోను గావించియున్నాడు. అర్జునుడు కర్ణుని ముందుంచుకొని యందఱకు హృదయమునదగులు నట్టి మాట లిపుడు పలుకుచున్నాడు కర్ణు నిదివరకే యర్జును నెదిరించి యున్నవాడు. మాటపలుకుట కిదే తగుసమయముగా నర్జునుడు తలంచినాడు.

యన్సభాయాం స పాంచాలీం క్లిశ్యమానాం దురాత్మభిః
దృష్టవానసి తస్యాద్య ఫల మాప్నుహి కేవలమ్ ౬౦-౫
ధర్మపాశనిబద్ధేన యన్మయా మర్షితం పురా
తస్య రాధేయ కోపస్య విజయం పశ్య మే మృధే ౬
ఏహి కర్ణ మయా సార్ధం ప్రతియుధ్యస్వ సంగరే
ప్రేక్షకాః కురవ స్సర్వే భవంతు తవ సైనికాః ౭
కర్ణః ॥
ధర్మపాశనిబద్ధేన యత్త్వయా మర్షితం పురా
తథైవ బద్ధ మాత్మాన మబద్ధ మివ మన్యసే ౧౧

యది తావ ద్వనే వాసో యథోక్త శ్చరిత స్త్వయా
త త్త్వం ధర్మార్థశిత్ క్లిష్టః స మయా యోద్ధు మిచ్ఛసి ౧౭
అర్జునః :
ఇదానీ మేవ తావ త్త్వ మపయాతో రణా న్మమ
తేన జీవసి రాధేయ నిహాత స్త్వనుజ స్తవ ౧౪

భ్రాతరం ఘాతయిత్వాక స్త్యక్త్వా రణశిరశ్చ కః

త్వదన్యః కః ప్రమాన్ సత్సు బ్రూయా దేవం వ్యవస్థితః ౧౬
స గాథవేదనో హిత్వా రణం ప్రాయా దుదఙ్ముఖః
తతో ఽ ర్జున ఉదక్రోశ దు త్తరశ్చ మహారథః ౨౭

(కర్ణ! సభామధ్యమందు బలుమాటలాడి యున్న వాడవు యుద్ధమున నా కీడులేడని పలికితివి, సమయమేర్పడిన దిపుడు. నాతో యుద్ధ మొనరించి నీబలమును తెలియుదువు. ఇంకెవరిని నవమానింపవు. ధర్మమును విడినాడి కేవలము పరుషవచనము లాడితివి. పలికిన దాచరించుట దుష్కరమని తలంచెద. సభ యందు దురాత్ములచే క్లిశ్యమానయగు పాంచాలిని కనుగొంటి వా ప్రతిఫల మిపు డొందగలవు నేను ధర్మపాశనిబద్ధుడనై పూర్వమోర్చియున్నట్టి కోపము యొక్క విజయమిపుడు గాంచెదవు లెమ్ము. అరణ్యమందు బంద్రెండుసంవత్సరములు సహించియున్న యాప్రతికోపము నిపుడు గాంచుము, కర్ణ! రమ్ము, నాతో బ్రతియుద్ధ మొనర్పుము. కౌరవులు, నీవై నికు లెల్లరు ప్రేక్షకులు కావలసినది అర్జును డిట్లు పలుకగా గర్ణు డిట్లనెను. నోట వచించినది చేసి చూపుము, చేతకంటే కూత ఘనము నీదని తెల్లమగును. నీ విదివఱ కోర్చియుండిన

వశ త్రికెల్లనే యని యిప్పుడు నీ పరాక్రమమును గాంచి గ్రహింప బడును. ఇతో గృహ్ణామహే పార్థ రథ వృష్ట్యా పరాక్రమం ౬౦.౧౦ పూర్వము ధర్మపాశనిబద్ధుండను నీవు ఒప్పుండ వేయమ్యునటన్నట్లు తలంచుచుంటివి యధిక్షేపకుడవానను మీరు గావించిరేమె నాతో యుద్ధమాడ తలంచుచుంటివా. నీవు కారణముగ శక్రుడే స్వయము సంగ్రామమొనరించినను పరాక్రమించునట్టి నాకెట్టి వ్యధయు నుండబోదు. అపేక్షించియున్న దిదే వేగ నాసన్నమైనది. నాతో యుద్ధమొనరించి నీ బలమును నీవు తెలియుదువు' అని పలికెను. 'ఇపుడేకదా నాతోడి యుద్ధమున నీవు తొలగిపోయితివి కావున బ్రతికియున్నావు. నీ తమ్ముడు నిహతుడైనాడు. భ్రాతను ఘాతమొనరించి, రణశిరమును త్యజించినవాడు నీకన్న వేఱొక డెవ్వడిట్లు సత్పురుషులందు బలుకంగలడు' అని పలికెను. అర్జునుడిట్లుపలుకుచునే కాయావరణభేదములగు బాణములను విడిచెను. అపుడు కర్ణార్జునులకు ఘోరసంగ్రామమాయెను గాఢవేదననొంది కర్ణుడు రణభూమిని విడిచి యుదఙ్ముఖముగా బాఱిపోయెను. అపుడర్జును డట్టహాస మొనరించెను. మహాఘు డుత్తరుండును కేళి గావించెను)

దుర్యోధననిర్బంధమున భీష్మాదులు ద్యూతమునాడు ద్రౌపది కష్టదశను చూచియుండవలసివచ్చినది. వారిపుడీయర్జునుని మాటలు విని సహించుకొనువారయినారని యభిప్రాయము. కర్ణుడు భీష్మాదుల నెల్ల నలక్ష్యము గావించి యింక

ములు పలుకుచు 'రథేషువాపి తిష్ఠంతో యుద్ధం పశ్యంతు మామకం' (౪౮-౨౩) అని పలికియున్నాడు. చిత్రముగా గౌరవసైన్యమే యిపుడు ప్రేక్షకులు కానిమ్ము' అనుమాట యర్జునునినోట. వెలువడుట గమనింపదగినది. కౌంతేయుని మాటలు విని రాధేయుడు బీరములుపలుకుచు పాండవులు సమయము నతిక్రమించి వర్తించుచున్నారని దెప్పిపొడిచినాడు. కర్ణుని యహంకారవచనములు విని 'చావే మేలు' అన్నపలుకు లంటించుచు నర్జునుడు 'తమ్ముడు శూరుడు ధీరుడై రణరంగ మందు ప్రాణమర్పించి యున్నవాడు. నీవు పాఱిపోయి లజ్జా విహీనుడవై యిట్టిమాటలు మరల నాడుచుంటివి' అని స్పష్టము గావించినాడు. అతీవసమరమున హర్షనుండగునట్టి యర్జును నెదుట నట్టే సేపు నిలువంజాలక కర్ణుడు గాఢవేదననొంది రణరంగము విడిచి పాఱిపోయినాడు. యుద్ధమునకు బూర్వము దుర్యోధనుడు జీవపరాయణుడై దక్షిణదిక్కుగా బాఱిపోయి నాడు, కర్ణుడిపు డుదఙ్ముఖముగా బాఱిపోయినాడు, ఉత్తరుడు పలాయనమొందినపుడు కౌరవ సైనికు లపహాస్యమొనరించిరి. కర్ణుడు పాఱిపోవుచున్నప్పు డుత్తరు డట్టహాసమొనరించెను. కౌరవసైనికులే ప్రేక్షకులు కాగా మత్తరు డపహాస్యమొన రించువాడాయెను.

అర్జును డపు డుత్తరునితో 'నాతోడ యుద్ధమాడ గాంక్షించుచున్న వాడా భీష్మునియొద్దకు రథము పోనిమ్ము' అని పలికెను. రథనాగహయాకులమైన మహాసైన్యమును

గాంచి మిక్కిలిగా శరవిద్ధుడై యున్న [*] యుత్తరుడింక రథచోదనము నావలన గాదంచు పలికినాడు అపుడర్జును డిట్లు పలికెను.

మా భైపీ స్తంభ యాత్మానం త్వయాపి నరషంగస
అత్యద్భుతాని కర్మాణి కృతాని రణమూర్ధని ౬౧ ౧౫
రాజపుత్రో ఒసి భద్రం తే కులే మత్స్యస్య విశ్రుతే
జాత స్త్వం శత్రుదమనే నావసాదితు మర్హసి ౧౫
ధృతిం కృత్వా సువిపులాం రాజపుత్ర రథే పునః
యుధ్యమానస్య సమరే హయాన్ సంయచ్ఛ శత్రుహన్ ౧౬
ఏవ ముక్త్వా మహాబాహు ర్వైరాటిం నరసత్తమః
అర్జునో రథినాం శ్రేష్ఠ ఉత్తరం వాక్య మబ్రవీత్ ౧౭
సేనాగ్ర మాశు భీష్మస్య ప్రాపయ స్త్వైతదేవ మాం
ఆచ్ఛేత్స్యా మ్యహ మేతస్య ధను ర్జ్యామపి చాహవే ౧౮

(భయపడకుము. రణమూర్ధమున నత్యద్భుత వ్యాపారము నీచేతను గూడ గావింపబడియే యున్నది. రాజపుత్రుండవు - శత్రుదమన మొనరించుకులమున నుద్భవించియున్నావు - శోక

[*] అదృష్టపూర్వః శూరాణాం మయా సంఖ్యే సమాగమః
౬౧-౨

శ్రుతిః స్మృతిశ్చమే వీర ప్రనష్టాః మూఢచేతసః ౯
దృష్టిః ప్రచలితా వీర హృదయం దీర్యతీవమే ౧౦
వపు శ్చోగ్రం తవ రణే క్రుద్ధస్యేవ పినాకినః
వ్యయచ్ఛ స్తవ భుజం దృష్ట్వాభీ ర్మే భవత్యపి ౧౧

విశ్రుతమైన మత్స్యకులమందుద్భవించితివి. ఇట్లుగా విషాద మొందదగవు, సువిపులమగుధృతిని గావించి సారథ్యమొన రింపుము - అర్జున డిట్లుత్తరునిగూర్చిన మేల్మి మాట ముందుగా బలికి పిమ్మట తన్నుగూర్చినమాట పలికినాడు. 'భీష్ముని యొక్క సేనాగ్రమునకు నన్ను జేర్చు మాతనిధనుర్జ్యాలను ఛేదించె దను. బీభత్ససంగ్రామ మొనరించెదను' అనినాడు.

అసంభ్రాంతో రథే తిష్ఠ సమేషు విషమేషుచ
దివ మావృత్య తిష్ఠంతం గిరిం భింధ్యాంస్మ పత్రిభిః ౨౭
అహ మింద్రా ద్దృఢాం ముష్టిం బ్రహ్మణః కృతహస్తతాం
ప్రగాఢే తుములం చిత్ర మవిద్ధం ప్రజాపతేః ౨౮

సమవిషమములం దసంభ్రాంతుడవై రథమందు నిలు పుము, దినము నావరించియున్న గిరినైన శరములచే దునియలు గావింతును. నే నింద్రవచనమున పూర్వము పౌలోములు, కాలఖంజు లనేకులను - వందలకొలంది హతమొనర్చితిని. నేనింద్రునివలన దృఢముష్టిని, బ్రహ్మవలన కృతహస్తత్వము, ప్రజాపతివలన ప్రగాఢము, తుములము నగు రణమందు చిత్రము అనివిద్ధమునగు నేర్పును (పొందియున్నాను.) వజ్రపాణి యసు రులను పాఱదోలినటుల కౌరవసైన్యమునెల్ల చెల్లాచెదరు గావించెదను, చూడుము.

రౌద్రం రుద్రా దహం హ్యస్త్రం వరుణా దపి వారుణం
అస్త్రమాగ్నేయ మగ్నేశ్చ వాయవ్యం మాతరిశ్వనః ౩౩
వజ్రాదీని తథాస్త్రాణి శక్రాదహ మవాప్తవాన్ ౩౪

ధార్తరాష్ట్రం వనం ఘోరం నరసింహాభిరక్షితం
అహముత్పాటయిష్యామి వైరాటే వ్యేతు తే భయమ్ ౩౫
తస్య జిష్ణు రుపావృత్య ధ్వజం మూలాదపాతయత్
వికృష్య కలధౌతాగ్రైః సపద్భిః ప్రాపత ద్భువి ౩౮

నేను రుద్రునివలన రౌద్రాస్త్రము, వరుణునివలన వరుణాస్త్రము, అగ్నిహోత్రునివలన నాగ్నేయాస్త్రము, వాయువు వలన వాయవ్యాస్త్రము, ఇంద్రునివలన వజ్రాదులగు నస్త్రములను బొందియున్నాను. ఉత్తరు డిట్లు సవ్యసాచిచే నాశ్వాసితుడై భీమమైన భీష్మాభిరక్షితమైన సైన్య సమీపమునకు రథము చేర్చెను. కౌరవులను జయించుచు వచ్చుచున్న యర్జునుని భీష్ము డప్పుడు నివారించెను. (అభ్యవారయ దవ్యగ్రః క్రూర కర్మాపగాసుతః) అర్జునుడు (జిష్ణుడు) భీష్మునిధ్వజమును గూల్చెను. విద్ధుడై భీష్ముడు భూమిపై బడిపోయెను.

ఉత్తరుడు సారథ్యనై పుణ్యమును కనబఱచుచు రథికుని చిత్తవృత్తిని గ్రహించియు, బ్రశ్నించియు ననుకూలముగను, సమర్థతగను రథమును నడిపించెను అట్టి శూరయుద్ధ ముత్తరు డెఱుంగడు. కావున నాత్తైక్ష్ణమునకు దాళలేక సారథ్యకృత్యమునకు వెనుకాడెను. అర్జును డుత్తరునిసమర్థతను, వానికుల వైశిష్ట్యమును పలికి 'విపులధైర్యమున రథచోదనమొనరింపుము' అని ప్రోత్సహించెను. అర్జునుడు సోత్కర్షగా నొక్కమాటకూడ పలుకువాడు కాడు. పరిస్థితిని గమనించి యిపుడు సోత్కర్షనుత్కంఠుడై పచించి యుత్తరుని ధీరునిగావించి భీష్ము నెదిరించెను. అసమాన యుద్ధోత్సాహ ప్రవర్తకుండైన సవ్యసాచి

యాతీక్ష్ణ తరయుద్ధమందు భీష్ముని ధ్వజమును నేలపై బడ వేసెను. భీష్ముడు శరహతుడై భూమియందు బడిపోయెను

దుశ్శాసనుడు, వికర్ణుడు, దుస్సహుడు వివింశతి సప్త్య సాచి నెదిరించిరి. అందు మొదట దుశ్శాసనుడు పార్థబాణ ప్రపీడితుడై రణము విడిచి తొలగిపోయెను, దుస్సహ వివింశతు లొకేమా అర్జును నెదిరించి హతాశ్వులై, విభిన్నాంగులై యన్యరథము లెక్కి మరలిపోయిరి. ఇట్లుగా ధృతరాష్ట్రుని నలుగురు కుమారు లర్జును నెదిరించి రణము నుండి తొలగి చనిరి, అప్పుడు కౌరవమహారథులు చేరివచ్చి యర్జును నెదిరించిరి [౧*] అర్జునుడు గొప్పయుద్ధము గావించి యా మహారథవ్యూహమును భేదించెను. అపుడు దుర్యోధనుడు, కర్ణుడు, దుశ్శాసనుడు, వివింశతి, ద్రోణాశ్వత్థామలు, కృపుడు [౨*] వీరలందఱు ధనంజయజిఘాంస గల్గి మరల యుద్ధమునకు దలపడిరి [౩*] వర్షాకాల మేఘము లట్లొక్కఒక్కఱు శరపరంపరను కురిపిం

---

[౧*] నదద్భిశ్చ మహానాగై ర్హేషమాణైశ్చ వాజిభిః
భేరీశంఖ నినాదైశ్చ సశబ్దస్తుములో ఽ భవత్ ౬౨ ౩

త్వరమాణః శరా నస్యన్ పాండవః ప్రబభౌ రణే
మధ్యందినగతో ఽ ర్చిష్మాన్ శరదీవ దివాకరః ౫

ఉపప్లవంతి విత్రస్తా రథేభ్యో రథిన స్తథా
సాదిన శ్చాశ్వపృష్ఠేభ్యో భూమౌచైవ పదాతయః ౬

[౨*] పున ర్యయశ్చ సంరబ్ధా ధనంజయ జిఘాంసవః ౬౩-౨

[౩*] శరౌఘాన్ సమ్య గస్యంతో జీమూతా ఇవవార్షికాః ౫

చిరి [౧*] అతిఘోరమైన యీ యుద్ధమున నర్జునునిమీద
ప్రతిరెండంగుళములు బాణములు నాటులుచేసి నొప్పించిరి. పిద
ప్పుడు ప్రహరించి దివ్యమైన రౌద్రాస్త్రమును ప్రయోగించెను
[౨*] అర్జునుని చేతియందలి గాండీవము మెఱుపువలె యున్న
వలె, వజ్రమువలె, మెఱసెను [౩*] కౌరవవ్యూహమున
యోధులందఱు శాంతిపరులై చిత్తస్వాస్థ్యము నొందరైరి.
హతచేతస్కులై యోధులందఱు సంగ్రామవిముఖులైరి [౪*]
జీవితమందు నిరాశగల్గి సైనికులు దిక్కులకు పాఱిరి.

తతస్త్వతీవ సంగ్రామే చాపహస్తో ధనంజయః
శిరసాం పాత్యమానానాం మంతకా నిశితైః శరైః
అశ్మవృష్టి రివాకాశా దభవ ద్భారతర్షభ ౧౩
దర్శయిత్వా తథాత్మానం రౌద్రం రుద్రపరాక్రమః
అవరుద్ధో౽ చరత్పార్థో వర్షాణి త్రిదశాని చ ౧౪
క్రోధాగ్ని ముత్సృజన్ ఘోరో ధార్తరాష్ట్రేషు పాండవః
తస్య తద్దహతః సైన్యం దృష్ట్వా ఘోరం పరాక్రమం
సర్వే శాంతిపరా భూత్వా ధార్తరాష్ట్రస్య పశ్యతః ౧౬

[౧*] న తస్య ద్వ్యంగుళ మపి వివృతం సంప్రదృశ్యతే ౭
[౨*] యథా బలాహకే విద్యుత్పావకో వా శిలోచ్చయే ౧౦
[౩*] సర్వే శాంతిపరా యోధాః స్వచిత్తాని న లేభిరే
సంగ్రామే విముఖా స్సర్వే యోధా స్తే హతచేతసః ౧౩
[౪*] వ్యద్రవంత దిశః సర్వా నిరాశాని స్వజీవితే ౧౪

అపుడు భీష్ము డర్జును నెదిరించి రౌద్రమగు రణ మొన రించెను. [1*] అర్జునుడు భీష్ముని శ్వేతచ్ఛత్రమును ఛేదింపగా నది వెంటనే భూమిపై బడిపోయెను. [2*] ఆగొప్ప భీష్మార్జునయుద్ధమును కౌరవయోధులు ససైనికులై గాంచుచుండిరి. [3*] కౌరవులెల్ల రీయుద్ధమునుగాంచి మిక్కిలిగాప్రశంసించిరి [4*] వారిరువు రస్త్రయుద్ధ మొనరించి యాపిమ్మట మరల శరయుద్ధమునకు దిగి యొకరినొక రతిగా నతిక్రమించి పరాక్ర మించిరి. [5*] దేవతలెల్ల రాసంగ్రామవిశేషమును తిలకించు చుండగా నపుడు చిత్రసేనుడను గంధర్వుడు పరమప్రీతుడై

---

[1*] ఛత్రం చిచ్ఛేద భీష్మస్య తూర్ణం తదపత ద్భువి ౬౪-౭

[2*] ప్రేక్షంతే కురవ స్సర్వే యోధాశ్చ సహసైనికాః ౧౩

[3*] తత స్తే కురవ స్సర్వే సాధుసాధ్వితి చాబ్రువన్ ౨౦

[4*] అస్త్రయుద్ధేతు నిర్వృత్తే శరయుద్ధ మవర్తత ౨౭

అతీవ పాండవో భీష్మం భీష్మ శ్చాతీవ పాండవం

బభూవ తస్మిన్ సంగ్రామే రాజన్ లోకే తదద్భుతమ్ ౩౪

[5*] ప్రేక్షంతే స్మాంతరిక్షస్థాః సర్వే దేవా స్సవాసవాః ౩౭

శశంస దేవరాజాయ చిత్రసేనః ప్రతాపవాన్ ౩౭

ఆదదానస్యహి శరాన్ సందాయచ విముంచతః

వికర్షత శ్చగాండీవం నాంతరం సమదృశ్యత

౬౧-౧౨౹౬౨-౨౩౹౬౫-౪౨

యర్జునుని రణకౌశలమును మిక్కిలిగా నక్షించెను. [*] ఆ ప్రశంసను విని దేవేంద్రుడు పుష్పవృష్టి గురిపించెను. వామ పార్శ్వమున గొట్టి యింకను పరాక్రమించుటకు యతమాను డగు భీష్ముని ధనుస్సును ఛేదించి స్తనాంతరమున గొట్టి నొప్పించి యర్జునుడా భీష్ము శోణితోపప్లుతు గావించెను. విసంజ్ఞుడైన భీష్ముని నతని సారథి యప్పుడు రణభూమినుండి మరలించెను.

భీష్ముడు సంగ్రామ శిరఃప్రదేశమును విడిచి పలాయమానుడు కాగా దుర్యోధను డర్జును నెదిరించి భల్లాయుధమున నర్జునుని లలాటమధ్యమందు గొట్టగా వేసి నెత్తురు కాఱ జొచ్చెను. ఉద్ధతమన్యువేగుడై యర్జునుడు దుర్యోధను నెదిరించెను. వికర్ణు డప్పుడు మఱినలుగురు రథికులతో గూడి గజారూఢుడై వచ్చి యర్జును నెదిరించెను. అర్జును డాహస్తిని గొట్టి పడవేసి పిమ్మట హస్తినాపురాధీశుని హృదయమున బాణమేసెను.

దృష్ట్వైవ పార్థేన హతంచ నాగం । యోధాంశ్చ సర్వాన్
ద్రవతో నిశమ్య

---

అర్జును డెప్పుడు శరములుదీయుచున్నది, సంధించుచున్నది, ప్రయోగించుచున్నది, యేయంతరము గానవచ్చుటలేదని చిత్రసేనుడు ప్రశంసించినాడు. ఈశ్లోక మీయుద్ధఘట్టమందు మూడుచోట్లు లదు. ఉత్తరుడు - కౌరవులు - చిత్రసేనుడు పలికినట్లు లదు. అంతకంతకు శీఘ్రతః శరప్రయోగ మర్జును డొనరించుచున్నాడను లాఘవత్వవిశేషము నిది వ్యక్తీకరించుచున్నది

[*] పూజయామాస దివ్యైః పుష్పవర్షేణ భారత ౬౪-౪౬

రథం సమావృత్య కురుప్రవీరో । రణాత్ ప్రదుద్రావ యతో న
పార్థః ౬౫-౧౮

తం భీమ రూపం త్వరితం ద్రవంతం । దుర్యోధనం శత్రుసహోఽ
భిషంగాత్ ॥ ప్రాస్ఫోటయః ద్యోద్ధుమనాః కిరీటీ । బాణేన విద్ధం
రుధిరం వమంతమ్ ౧౯

౧ విహాయ కీర్తిం విపులాం యశశ్చ । యుద్ధా త్పరావృత్య
పలాయసే కిం

న తేద్య తూర్యాణి సమాహతాని । తథైవ రాజ్యా దవ
రోపితస్య ౧౬

౨ యుధిష్ఠిర స్యాస్య నిదేశకారీ । పార్థ స్తృతీయో యుధి
సంస్థితోఽస్మి తదర్థ మావృత్య ముఖం ప్రయచ్ఛ । నరేంద్ర
వృత్తం స్మర ధార్తరాష్ట్ర ౧౭

3 మోఘం తవేదం భువి నామధేయం । దుర్యోధనేతీహ
కృతం పురస్తాత్ నహీహ దుర్యోధనతా తవాస్తి । పలాయ
మానస్య రణం విహాయ ౧౪

౪ న తే పురస్తా దథ పృష్ఠతో వా । పశ్యామి దుర్యోధన
రక్షితారం అపైహి యుద్ధా త్పురుషప్రవీర ప్రాణాన్
ప్రియాన్ పాండవతోఽద్య రక్ష ౧౭

ఆహూయమానశ్చ స తేన సంఖ్యే । మహాత్మనా వై ధృతరాష్ట్ర
పుత్రః వివర్తిత స్తస్య నిరంకుశేన మహాగజో మత్త ఇవాం
కుశేన ౬౬-౧

(హస్తి హతమగుట, యోధులు పాఱిపోవుట గాంచి యాతడు ప్రవీరుడు పార్థుడు లేనిచోటనుండు సైన్యమునుండి దూరముతోడ బాఱిపోయెను. నిశాతాస్త్రంపుగుములు పార్థుని చేతి నిచే గాఢముగా గ్రుచ్చబడి రక్తముకమనమోకరించుచు నట్లు పాఱిపోవుచుండగా కిరీటి యాతని బిలచి నిలువుమని పారాడ నెంచి చేయితట్టిపిలిచి యిట్లు నుపాలంభించెను. 'విపులమైన కీర్తి యశమును విడనాడి యుద్ధమునుండి పలాయన మొందెదవేల. ఇపుడు తూర్యములు లేవేలనో (త్యక్త్వా రాజ్యాదపకోశితస్య) యుధిష్ఠిరని దేశకారెని, పార్థుడ, తృతీయుడను, యుద్ధసంసిద్ధుడనై యున్నవాడను. కావున తిరిగి ముఖముచూపింపుము (ప్రయచ్ఛ) ధార్తరాష్ట్రనరేంద్రవృత్తమును స్మరింపుము. దుర్యోధనుడనునామధేయము నీకెంతవఱకునుపట్టినది యింక నీపుడమిపై వమ్మిక్కియగుచున్నది. రణభూమినివిడిచి పలాయమానుడవగు నీకింక దుర్యోధనత్వము మఱిలేదు. ముందటగాని, వెనుకగాని నిన్నురక్షించువారిని (నేను) చూడలేదు. పురుషప్రవీరుడా! యుద్ధభూమినుండి తిరిగిపొమ్ము ప్రియమైన ప్రాణములను పాండవునినుండి రక్షించుకొనుము'—అనంతుతుండైన యర్జునుండిట్లు సామంతమును చూపుచు నుపాలంభింపగా దుర్యోధను డంకుశముచే బొడవబడిన మదగజమునట్లు నిలిచిపోయెను. తొక్కబడిన భోగివలె దుర్యోధను డపుడర్జునునుపై దిరుగబడ నుద్రేకించెను.)

ఆదినే 'రక్షధ్వ మసి చాత్మానం' అని ద్రోణుడు హుషారు పలికినాడు. రక్షకుడు కానరానందున, యోధులు

పాఱిపోవుటవలన నా తావునుండి ప్రాణార్తుడై దుర్యోధనుడు పాఱిపోవలసివచ్చినది. 'రణాత్ ప్రదుద్రావ యతో న పార్థః' అనునది దుర్యోధనుని ప్రాణార్తిని మిక్కిలిగా వ్యక్తీకరించుచున్నది. రజస్వలయగు ద్రౌపదీసతిని సభ కీడ్పించిన యా దురాత్మునినోట నిపుడు రక్తము గాఱజొచ్చినది. దుర్యోధనునుపాలంభించినవి నాలుగుశ్లోకము లిచ్చట గలవు ౧, ౩ శ్లోకములు దుర్యోధనపరాభవమును, ౨, ౪ శ్లోకములు పాండవునిసామంతమును వ్యక్తీకరించుచున్నవి. మంచివారు చెడ్డవారు- అందఱు మాటపలుకువారలే. స్థానమందు మాట నప్పగించెదరు సన్మార్గులు, అస్థానమున మాట విసరెదరు దుర్మార్గులు. 'లే రిచట నీకు మగలు' అని ద్రౌపదినిగూర్చి కౌరవులు పలికిరి. మత్స్యయంత్రము భేదించునాడు ద్రౌపదిచే విమర్శింపబడిన కర్ణుడు ద్యూతమున నస్థానప్రసంగముగా 'నీకు మగ లిచట లేరు' అని పలికినాడు, ద్రౌపదిని వివస్త్రను గావింపవలసినదని పలికినాడు. అర్జును డిపుడు కౌరవవీరుల నెల్ల గొట్టియున్నాడు, దుర్నిరీక్షుడై యుద్ధరంగమున నిలిచినాడు. రక్తము వమనముగావించుకొనుచు పాఱుచున్న దుర్యోధనునితో 'నిన్ను రక్షించువారిని నేనుచూడలేదు' అని యర్జునుడు పలికినాడు. 'నిన్ను రక్షించువారులేరు' అనినచో నీమాట భీష్మాదులందు ప్రతిఫలించిన దగును. సాత్త్వికశిఖామణియగు పార్థుడు 'నపశ్యామి రక్షితారం' అని యోగ్యవిషయమెంతయో పలికినాడు. ఈయర్జునునిబారినుండి పాఱిపొమ్ము' అని

పలుకుట సామంతమేయగును. 'ప్రాణాన్ ప్రియాన్ పాం డవతో ఉద్య రక్ష' అనినాడు, 'పాండవతః' అనుట-యెంతటి సత్యభావమునో, నిదానమునో ఏంపుచున్నది. సర్వపాండవ కృత్య మదియని భావము. ధర్మమార్గవిస్తారమైన దీమాట.

అర్జునుడు దుర్యోధను డిసువురును మత్తమహాగజము లే. అర్జునుడు నిరంకుశుడు, దుర్యోధను డంకుశవిద్ధుడై నిలిచినాడు. తోకత్రొక్కబడినపాము వలెనె బుస్సుమని లేచినాడు ఈపరి స్థితిని జూచి యాదుర్యోధనున కుత్తరభాగమున గర్ణుడు నిలిచెను, భీష్ముడుపశ్చిమమున, ద్రోణుడు కృపుడు వివింశతి దుశ్శాసనుడు నగ్రభాగమున నిలిచిరి. వారందఱు ప్రయోగిం చునస్త్రముల నస్త్రములచేనివారించి యర్జును డవారణీయ మగుసంమోహనాస్త్రము నపుడుప్రయోగించెను. గాండీవ ఘోషమున గౌరవబలముమనములు వ్యథనొందినవి, శంఖ ప్రణాదమున కురువీరు లవశులయిరి. అర్జునుడిట్టిసామంతము రణభూమిని గావింపగా వారందఱపుడు చాపములు విడిచివి సంజ్ఞులైరి. అర్జునుడుత్తరమాటనుస్మరించి యుత్తరునిచే గౌరవులవలువలను తెప్పించెను. అయ్యస్త్ర మెఱింగియున్న భీష్ముడు సంజ్ఞావంతుడగుట నాతనివలువను మినహాయించి యర్జును నాదేశానుసార ముత్తరుడు తక్కిన వస్త్రములను దెచ్చి రథమెక్కెను. యుద్ధమధ్యమునుండి మరలిపోవుచున్న యర్జుననిగాంచి సంజ్ఞావంతుడై యున్న యా భీష్ముడొక్క రుండు రాజధర్మము ననుసరించి యర్జును నెదిరింపగా నయ్యె

ర్జును డతని బడవేసి (అపాస్య) మేఘమధ్యమునుండి పైకి వచ్చిన సహస్రకిరణుడట్లు పైకేతెంచెను. ఈ గోహారణయుద్ధ మందు మొదటలో భీష్ము డర్జునశరముల కంతర్హితుడైనాడు. భూమిపై బడిపోయినాడు, చివరకొక్కడుగా మిగిలి యర్జును నెదిరించి యపాస్తుడైనాడు. అంతులేని రణతంత్రము నేర్పుఅచ నెంచిన భీష్ము డిట్టుగానగుట గమనింపదగినది. భీష్మావమాన ముగా యుద్ధ మిట్లంతముకాగా కురుప్రవీరుల కపుడు తెలివి కలిగెను. [1*] రణవిముక్తుడై యున్న సురేంద్రకల్పుండగు నర్జునుని గాంచి దుర్యోధనుడు త్వరితముగా నిట్లు పలికెను.

[2*] అయం కథంస్వి ద్భవతా విముక్త। స్తథా
ప్రమథ్నీత యథా న ముంచేత్
త మబ్రవీత్ శాంతనవః ప్రహస్య।క్వ తే గతా
బుద్ధి రభూత్ క్వ వీర్యమ్ ౬౬-౨౦
శాంతిం పరాం ప్రాప్య యదా స్థితో౽భూ। రుత్సృజ్య
బాణాంశ్చ ధను ర్విచిత్రం
న త్వేష భీభత్సు రలం నృశంసం।క ర్తుం న పాపేఽస్య
మనో విశిష్టమ్ ౨౧

[1*] 'పార్థం నిరీక్ష్యాథ సురేంద్రకల్పం రణే విముక్తం స్థిత మేక మజౌ' (౬౬-౧౯) అని యిచ్చట గలదు. జితకాశియై యర్జును డసమానుడై యపుడు వెలుగొందెనని యిది వ్యక్తీకరించుచున్నది.

[2*] ఈమాట మఱియు భీష్మావమానముగా బరిణమించుచున్నది, 'తథా ప్రమథ్నీత యథా న ముంచేత్' అనునది ప్రసంగదీయు పరమానార్య వచనముగా నున్నది.

[*] త్రైలోక్యనాథో వ్యజహాత్ స్వధర్మం సర్వేన తస్మా
న్మహాత్రారణే ఽస్మిన్

క్షిప్రం కురూన్ యాహి కురుప్రవీర । విజిత్య గాశ్చ ప్రతి
యాతు పార్థః ॥

(ఇతను నీవల్ల నెట్లు విముక్తి నొందినవాడు, పోకుండునట్లుగా

[*] భీష్మునకు శంతనునివలన స్వచ్ఛందమరణ మనునది వరము గలదు. మఱియు శిఖండి నిమిత్తము బలవన్మరణముకూడ తటస్థించినది. నరాంశజుడగు నర్జునునివలన భీష్మపతనమగునని జమదగ్ని మొదలగువారు వ్యక్తీకరించిరి. ఈవిషయము భీష్ముడుస్వయము దుర్యోధనునితో బలికినాడు. (అంబోపాఖ్యానము- ఉద్యోగపర్వము.) స్త్రీరూపుడగు శిఖండిని ముందుంచుకొని పాండవులు భీష్మపతనము ధర్మముగా సాధించిరి. భీష్మునిచరితమం దేర్పడినవి రెండును మరణ ప్రసక్తిగానుండుట గమనింపదగినది. స్వచ్ఛంద మరణుడగుట భీష్ముడు శిఖండినిమిత్తముగా యుద్ధ౦తన మొందియూ నుత్తరాయణ పర్యంతము జీవించియుండి పిమ్మట స్వచ్ఛందమరణ మొందినాడు.

అశ్వత్థామ నిమిత్తము (అశ్వత్థామకు క్షీరసంపాదనార్థముగా) ద్రోణు డప్రియముగా బరధర్మకర్తయైనాడు. అర్ధపాంచాల దేశప్రభువుగా నేర్పడినాడు. కావున 'రణరంగమందు నే నస్త్రసన్యాసము గావించెదను' (స్వధర్మవర్తనయ్యెదను) అని ద్రోణుడు ధర్మరాజునకు దనయంతమును గూర్చి తెల్పినాడు. సత్యసంధుడగు ధర్మజునివలన నశ్వత్థామ నిమిత్తమగు (పుత్రనిమిత్తమగు నప్రియము అశ్వత్థామా హతః (హతః కుంజరః) అను మాటవిని ద్రోణు డస్త్రసన్యాసము గావింపవలసిన వాడయినాడు. పరధర్మమునుండి మరలి స్వధర్మప్రవర్తకు డయినాడు. ద్రోణవధార్థ మవతరించిన ధృష్టద్యుమ్ను డపుడుద్రోణుని శిరమును నఱికివేసెను.

ధర్మరాజు ద్రోణుని వధోపాయ మడిగి తెలిసికొనుట

శాంతవ తస్మాన్మహాబాహో వధోపాయం వదాత్మనః

నరికట్టవలసినది.' అని దుర్యోధనుడు భీష్మునిగూర్చి పలికెను.

---

ఆచార్య ప్రణిపత్యైవ పృచ్ఛామి త్వాం
నమో ఽ స్తు తే భీష్మ ॥ ౪౩-౫౮

ద్రోణ ఉవాచ:

న శత్రుం తాత పశ్యామి యో మాం హన్యాద్రణే స్థితం
యుధ్యమానం సుసంరబ్ధం శరవర్షౌఘవర్షిణమ్ ౫౯
ఋతే ప్రాయగతం రాజన్ న్యస్తశస్త్ర మచేతనం
హన్యాన్మాం యుధి యో వీరః సత్య మేత ద్బ్రవీమి తే ౬౦
అస్త్రం చాహం రణే జహ్యాం శ్రుత్వా సుమహ దప్రియం
శ్రద్ధేయవాక్యాత్ పురుషాత్ సత్య మేతత్ బ్రవీమి తే ౬౧

(ధర్మరాజు యుద్ధమున కనుమతి నర్థింపగా ద్రోణుడు యుద్ధమందు జయము గల్గునని శుభవచనము పలికెను. అపుడు ధర్మజుడు 'కావున వధోపాయ మెఱిగింపవలసినది, ప్రణతుడనై యడుగుచుంటిని. నీకు నమస్కారము' అని పలికెను. ద్రోణుడు 'యుద్ధమొనర్చు నన్ను రణరంగమందు జంపు శత్రుని నేనుగానను. న్యస్తశస్త్రుడను గానిచో నన్ను వధింప శక్యముకాదు. నిజము చెప్పుచున్నాను. శ్రద్ధచేయదగినవాక్య మట్టిపురుషునివలన- మహదప్రియమును వినినచో నపుడు నేను రణమం దస్త్రసన్న్యాస మొనరించెదను. సత్యము పలుకుచున్నాను' అని పలికెను.)

ద్రోణు డస్త్రసన్న్యాసము గావించిన పరిస్థితి:

అధర్మతః కృతం యుద్ధంసమయో నిధనస్య తేద్రోణ౧౯౧-౩౬

ప్రహసించి 'నీ బుద్ధి యెటుపోయినది. నీకేర్య మేమయినది.

న్యస్తాయుధం ద్రోణ సమీక్ష్యాస్త్రైరిహ స్థితాన్
నాతః క్రూరతరం కర్మ పునః కర్తుం త్వమర్హసి 38

వేదవేదాంగవిదుష స్సత్యధర్మ పరస్య తే
బ్రాహ్మణస్య విశేషణ తవైత న్నోపపద్యతే 39

న్యస్యాయుధ మమోఘా స్త్వం తిష్ఠ వర్త్మని శాశ్వతే
పరిపూర్ణస్తు కాల స్తే వస్తుం లోకే ఽద్య మానుషే 40

బ్రహ్మాస్త్రేణ త్వయా దగ్ధా అనస్త్రజ్ఞా నరా భువి
యదేత దీదృశం విప్ర కృతం కర్మ న సాధు తత్ 41

న్యస్యాయుధం రణే క్షిప్రం ద్రోణ మా త్వం చిరం కృథాః
మా పాపిష్ఠతరం కర్మ కురుష్వ త్వం పున ర్ద్విజ 42

ఇతి తేషాం వచః శ్రుత్వా భీమసేన వచశ్చ తత్
ధృష్టద్యుమ్నంచ సంప్రేక్ష్య రణే స విమనా భవత్ 43

సందహ్యమానో వ్యథితః కుంతీపుత్రం యుధిష్ఠిరం
అహతం వా హతం వేతి పప్రచ్ఛ సుత మాత్మనః 44

స్థిరా బుద్ధిర్హి ద్రోణస్య న పార్థో వక్ష్యతే ఽనృతం
త్రయాణామపి లోకానా మైశ్వర్యార్థే కథంచన 45

కృష్ణః

య ద్యర్ధదివసం ద్రోణో యుధ్యతే మన్యు మాస్థితః
సత్యం బ్రవీమి తే సేనా వినాశం సముపేష్యతి 46

గణభూమిని పరమశాంతినొంది పడియుంటివికదా. చిత్రము ! ధనుర్బాణములను విడిచియుంటివే. ఆ బీభత్సుడు పాపమాచ

స భవాం స్త్రాతు నో ద్రోణాత్సత్యా జ్జ్యాయోఽనృతం వచః
అనృతం జీవిత స్యార్థే వద న్న స్పృశ్య! తే త్వషైః ౪౮

తయో స్సంవదతో రేవం భీమసేనో ఽ బ్రవీ దిదం
శ్రుత్వైవం తే మహారాజ వధోపాయం మహాత్మనః ౪౦

గాహమానస్య తే సేనాం మాలవ స్యేంద్రవర్మణః
అశ్వత్థామేతి విక్రాంతో గజ శ్శక్రగజోపమః ౪౧

నిహతో యుధి విక్రమ్య తతో ఽ ద్రోణ మబ్రువం
అశ్వత్థామా హతో బ్రహ్మ న్నివర్త స్వాహవా దితి ౪౨

సత్యవాన్హి త్రిలోకేఽస్మిన్ భవాన్ ఖ్యాతో జనాధిప
తస్య తద్వచనం శ్రుత్వా కృష్ణవాక్యప్రచోదితః ౪౪

భావిత్వాచ్చ మహారాజ వక్తుం సముపచక్రమే
త మతథ్యభయే మగ్నో జయే సక్తో యుధిష్ఠిరః ౪౬

అశ్వత్థామా హత ఇతి శబ్ద ముచ్చై శ్చకారహ
అవ్యక్త మబ్రవీ ద్రాజన్ హతః కుంజర ఇత్యుత ౪౭

[*] తస్య పూర్వం రథం పృథ్వ్యా శ్చతురంగుల మున్నతః బభూవైవంతు తేనోక్తే తస్య వాహోఽస్పృశ న్మహీమ్ ౪౮

[*] అధర్మము, పాపము - అని దీని యభిప్రాయము కాదు.

రించువాడుకాడు. అతని మనస్సు [illegible] హేతువుగానూడ నాతడు [illegible]

యుధిష్ఠిరాత్తు తద్వాక్యం శ్రుత్వా ద్రోణో మహారథః
పుత్రవ్యసనసంతప్తో నిరాశో జీవితేఽభవత్ ౬౯

ఆగస్కృత మివాత్మానం పాండవానాం మహాత్మనాం
ఋషివాక్యేన మన్వానః శ్రుత్వా నిహతం సుతమ్ ౭౦
విచేతాః పరమోద్విగ్నో ధృష్టద్యుమ్నమవేక్ష్య
యోద్ధుం నాశక్నుద్రాజన్ యథాపూర్వమరిందమ ౭౧

ఋషులు-విశ్వామిత్రాదులు ద్రోణునితో నిట్లు పలికిరి. 'అధర్మముగా యుద్ధము గావించుచుంటివి. నీకిది నిధనసమయ మగుచున్నది. నిన్ను న్యస్తాయుధునిగా చూడగోరి నిలిచిన వారము మేము. ఇంకనూ క్రూరతరమగు కృత్యమింక నీవు చేయదగవు. వేదవేదాంగ విదుషుండవు, సత్యధర్మపరుండవు. విశేషించి బ్రాహ్మణుండవగు నీయం దిది తగినది కాదు. న్యస్తాయుధుడవై మోహమొందక, శాశ్వతపథమందు నిలువుము. మనుజలోకమందు నీవుండవలసినకాలము పరిపూర్ణమైనది. అస్త్రమెఱుంగనివారలు నీచే బ్రహ్మాస్త్రమున దగ్ధమైరి. ఈదృశమగుకృత్యము సాధువు కాదు ...... ఈ ఋషుల - విశ్వామిత్రాదులమాట. భీమసేనునివచనములు విని, ధృష్టద్యుమ్ను నెదుటగాంచి ద్రోణుడు రణమందు విమనస్కుడాయెను. సందహ్యమానుడై ద్రోణుడు ధర్మజుని

కావుననే నీరణమం దందఱు నిహతులు కాలే దది గమనిం
పుము. కురుప్రవీరుడా ! క్షిప్రగతిని మరలుటయే యుచితము.

---

గూర్చి 'అహతుడా, హతుడా కుమారుడు' అని యడిగెను.
ముల్లోకముల ఐశ్వర్యవిషయమందుగూడ పార్థుడు- ధర్మరాజు
అనృతమాడడని-ఈస్థిరమైనయభిప్రాయము ద్రోణునకుగలదు.
అందువలన నాతనినే ద్రోణుడడిగెను, ఇంకెవ్వరిని యడుగ
లేదు. బాల్యాత్ప్రభృతి యిట్టియాశయే ద్రోణున కాతని
యందు గలదు.

కృష్ణుడు ధర్మరాజుతో నిట్లనెను. 'ఇంక అర్ధదివసము
గాని మన్యుయుక్తుడై ద్రోణుడు పోరాడుచో, యథార్థము
చెప్పుచున్నాను. నీ సేన వినాశన మొందును. అందువలన నీవు
ద్రోణునివలననుండి మమ్ము రక్షింపవలసినది. సత్యముకన్న
అనృతవచనమే యెక్కువైన (దిపుడపి) తెలియుము. జీవితార్థ
మగు ననృతోక్తివలన బాపమంటునది కాదు-కృష్ణుడు ధర్మ
రాజు నిట్లు వాదాడుచుండునపుడు భీమసేను డిట్లు పలికెను.
'ద్రోణవధోపాయము వినవలసినది. మాలవదేశాధీశుని
గజము-ఐరావతోపమానమగుదానిని జంపి నేను ద్రోణునితో
బ్రహ్మన్ ! అశ్వత్థామా హతః-ఆహవనివర్తనుడవు కమ్మింక-
అని పలికితిని...... ధర్మరాజా ! సత్యవంతుడవు, అట్లుగా
త్రిలోకవిఖ్యాతుడవై యుంటివి. నీవీమాట పలికినచో ద్రోణు
డింక యుద్ధము గావించువాడు గానేరడు' అని పలికెను.

పార్థుడు గోవులను జయించి వెడలిపోనిమ్ము' అని పలికెను. ఆత్మహితమైన యీ భీష్మవచనమును విని, వివర్ధమానమగు చున్న ధనంజయాగ్నిని గాంచి యెల్లరు దుర్యోధనునిదలపోసి మరలిపోవుటయే మంచిదని నిశ్చయించిరి.

---

భీముని యీ మాటవిని, కృష్ణవాక్యప్రచోదితుడై భవితవ్యమును దలంచి ధర్మరాజు వతథ్యభయమగ్నుడు, జయాసక్తుడు నగుచు 'అశ్వత్థామా హతః' అని పెద్దకంఠమున బలికి యవ్యక్తముగా 'హతః కుంజరః' అని పలికెను. అంతకుపూర్వము చతురంగుళమున్నతమైన ధర్మజునిరథము భూమిని స్పృశించినదాయెను. ధర్మజుని యీవాక్యము విని ద్రోణుడు పుత్రవ్యసనసంతప్తుడై జీవితమందు నిరాశనొందెను......... పూర్వమట్లు యుద్ధముగావించువాడు కాజాలకపోయెను. కర్ణుని రథచక్రము గొప్పయుద్ధములో బ్రాహ్మణశాపమున క్రుంగిపోయినది. శాపకారణముగా నట్లు భూమిగ్రసించి యున్న రథచక్రము నెత్తుకొను వ్యర్థప్రయత్నమును రణరంగమున గర్ణుడు గావించుచుండెను. ఆ బ్రాహ్మణశాపకారణముగనే ప్రమత్తుడై యున్న యాకర్ణుని కృష్ణవాక్యానుసారము ధర్మముగా నర్జునుడు సంహరించినాడు.

కర్ణునకు బ్రాహ్మణ శాపము

దురాచార వధార్హస్త్వం ఫల మాప్నుహి దుర్మతే

శాంతి 3-23

[*] పితామహం శాంతనవంచ వృద్ధం
ద్రోణం గురుంచ ప్రణిపత్య మూర్ధ్నా
ద్రౌణిం కృపం చైవ కురూంశ్చ మాన్యాన్
శరై ర్విచిత్రై రభివాద్య చైవ ౬౬-౧౭

యేన విస్పర్ధసే నిత్యం యదర్థం ఘటసే భృశం
యుధ్యత స్తేన తే పాప చక్రం భూమి ర్గ్రసిష్యతి ౧౪
తత శ్చక్రే మహీగ్రస్తే మూర్ధానం తే విచేతసః
పాతయిష్యతి విక్రమ్య శత్రు ర్గచ్ఛ నరాధమ ౧౫
యథేయం గౌ ర్హతా మూఢ ప్రమత్తేన త్వయా మమ
ప్రమత్తస్య తదారాతిః శిర స్తే పాతయిష్యతి ౧౬
ఇత్యుక్తో బ్రాహ్మణే నాథ కర్ణో దైన్యా దధోముఖః
రామ మభ్యగమ ద్భీత స్తదేవ మనసా స్మరన్ ౧౭

(దురాచారుడా! వధార్హుడవు. దుర్మతీ! దీని ఫలితము నొందుము. ఎవనితో నిత్యము స్పర్ధగావించుచుంటివో, దేనికై ఇంతగా ప్రయత్న పరుడవై యుంటివో యాతనితో యుద్ధము చేయునపుడు నీ రథచక్రమును భూమిగ్రసించును. నీ రథ చక్రము మహీగ్రస్తమగునపుడు విచేతస్కుడవగు నిన్ను నరాధముడా! శత్రువు విక్రమించి నిన్ను పడివేయగలడు, పొమ్ము. ప్రమత్తుండవగు నీచేత నా గోవు చంపబడినది గాన ప్రమత్తుడవగు నీయొక్క శిరస్సును నీయరాతి త్రెంపగలడు.

[*] భీష్ముని గూర్చి 'పితామహం శాంతనవం' అని. ద్రోణునిగూర్చి

బ్రాహ్మణ శాప మిట్లేర్పడగా గర్వ నిర్ముక్తుడై పరశురా మునియొద్దకు వచ్చెను. వెన్నిచ్చి పారిపోకుండ ప్రమత్తుడై ప్రవర్తించు గర్ణు డిట్లుగా నంతమొందినాడు.

పైకెగిరివచ్చు సందర్భమున నా దుర్యోధనుని భీమసేనుడు గదతో గొట్టి పడవేసెను. మార్కండేయశాప కారణముగ నవసాన మొందుచున్న దుర్యోధనుడు పైకెగురుట వాని తలవ్రాత. ఈ గదాయుద్ధనైపుణ్యాచే దుర్యోధనుని యంతమునకు హేతువైనది. ఈయుచితసమయమునువినియోగించికొని భీముడు తనప్రతిజ్ఞనసంపూర్తిగావించువాడై ధర్మమార్గానుసారియై దుర్యోధనుని తొడపై గదతో గొట్టెను. దుర్యోధనుడు పడిపోయెను. అనృతము, అన్యాయముగా గానవచ్చు ప్రతిసంఘటనయందు పాండవులధర్మమార్గానుసరణముత్కృష్టముగా నేర్పడియే యుండును.

దృష్ట్వా ప్రయాతాంస్తు కుమారన్ కిరీటీ
హృష్టోఽ బ్రవీత్తత్ర స మత్స్యపుత్రం
ఆవర్తయాశ్వాన్ పశవో జితాస్తే
యాతాః పరే యాహి పురం ప్రహృష్టః ౩౦

దేవాసు దృష్ట్వా మహాదద్భుతం త
ద్యుద్ధం కురూణాం సహ ఫాల్గునేన
జగ్ముర్యథా స్వం భవనం ప్రతీతాః
పార్థస్య కర్మాణి విచింతయంతః ౩౧

'వృద్ధం గురుం' అని, ద్రౌణికృపులఁగూర్చి 'కురూంశ్చ మాన్యాన్' అని యుండుట చక్కగా నున్నది. ఇచ్చట 'వృద్ధం' అను మాట భీష్మద్రోణు లిరువురులకు నన్వయించుచున్నది.

(అర్జునుడు భీష్మునకు ద్రోణునకు శిరసా ప్రణతు డాయెను. మాన్యులగు నశ్వత్థామకృపులకు విచిత్రశరాభివా దన మాచరించెను. ఉత్తమరత్న చిత్రమైన దుర్యోధనునిమకు టమును శరమున ఛేదించెను. మాన్యులగువీరుల నామంత్రించి గాండీవఘోషము గావించుచు దేవదత్తము పూరించుచు శత్రుమనోవిదారణ మొనరించెను. ధ్వజమున శత్రువుల నెల్ల నిరాకరించి కిరీటి మరలిచనుచున్న యా కౌరవులను గాంచి హృష్టుడైనాడు. 'గుఱ్ఱముల మరలింపుము, గోవులు జయింప బడినవి, పరులు వెడలిపోయిరి, ప్రహృష్టుడవై పురమును ప్రవేశింపుము' అని యర్జును డుత్తరునితో బలికెను. ఫాల్గును నితో గౌరవులకు గల్గిన యా మహాదద్భుతయుద్ధమునుగాంచి దేవతలంత పార్థునికర్మలను (యుద్ధ వైశిష్ట్యమును) చింతించుచు స్వభవనమునకు వెడలిపోయిరి.)

ఆర్తులై చెల్లాచెదరైన కౌరవసైనికు లర్జునుని శరణు జొచ్చిరి. "నే నార్తుల నేమియు గొట్టువాడగాను మిమ్ముల నాశ్వాసించుచున్నాను. సుఖముగా వెడలిపొండు" అని అర్జు నుడు పలుకగా వా రాతనిగూర్చి శుభవచనములు పలికి వెడలిపోయిరి. పరమసామంతమున నిట్లు విరాటరాష్ట్రాభిము ఖుండై వెడలిపోవుచున్న యర్జునుని కౌరవు లపుడు వెంబడింప జాలరైరి అర్జును డుత్తరునితో 'నీ తండ్రియొద్ద పాండవు లున్న సంగతి నీకు విదితమైనదికదా. పురము ప్రవేశించి నన్ను గూర్చి ప్రశంసింపకుము విరాటుడు భీతుడై సమ్మోహమొం

దగలను. ఇదంతయు నీవు గావించినక్షే ఘనము' అని పలి
కెను ఉత్తరుడు 'అపారణీయమైన పరాక్రమకృత్యము చూపిన
నాకేమి శక్తిగలదు. సవ్యసాచీ! నీవు చేసిన సాహసకార్యము
తండ్రియొద్ద నిన్నుగూర్చి వెల్లడింపను' అని పలికెను. కిరీటి
తాంగుడై యున్న యర్జునుడు శ్మశానవిటపమునకు వచ్చెను.
వహ్నిప్రతిమముగు వానరుడు భూతములతో సహా ఆకా
శమునకెదిరిపోయెను. రథమందు మరల సింహధ్వజ మేర్పడెను.

---

(పితామహం శాంతనవం చ వృద్ధం ద్రోణం గురుం చ ప్రతిపత్త్యా
మూర్ధ్నా) దుర్యోధనుని మకుటమునుగూర్చి 'ఉత్తమ రత్న
చిత్రం' అని యుండి యర్జునునిగూర్చి 'కిరీటీ' అని యుండుట
గమనింపదగినది. గాండీవము, దేవదత్తము, ధ్వజమునను
గూర్చి యొక్కొక్కపాద మిచ్చోట రచింపబడుటయు గంభీ
రముగా నున్నది. కౌరవులు విరాటుని గోవులను బట్టిరా నది
కురుపాండవయుద్ధముగా బరిణమించినది. కావుననే 'దేవాస్త్ర
దృష్ట్వా మహదద్భుతం త ద్యుద్ధం కురూణాం సహ ఫాల్గునేన'
అని ఈ యుద్ధవిషయము ముగింపబడినది.

[*] 'కిరీటినా సారథినా మహాత్మనా' అనియు,
'బృహన్నళారూప ముపేత్య సారథిః' అనియు, 'బృహన్నళా
సారథినా ప్రవీరః' అనియు (౬౭-౧౪, ౧౬-౨౪) నిచ్చోట
గలదు, ఛందతః రూపకల్పన మొనరించుకొను వరముగల్గి
యున్న యర్జునుడు యథాప్రకారము బృహన్నళారూప
మొందినాడని యిచ్చోట నిర్ధారణమగుచున్నది. అజ్ఞాతవాస
వత్సరము తీరినవా డర్జునుడు కావున మంపత్వప్రసంగమింక

ఉత్తరుడు ప్రహృష్టుడై [*] సారథియైన కిరీటితోడ నగరము నుగూర్చి బయలుదేరెను. శత్రుహంతయగు నర్జునుడు పరమాార్యకర్మ యిట్లొనరించి శత్రువులనుపడగొట్టి వేణినిధరించినవాడై మరల నుత్తరుని (అశ్వ) రశ్మలను పట్టుకొనెను. బృహన్నళారూపమొంది హృష్టుడై నగరమును గూర్చి బయలుదేరెను. కౌరవులు ప్రభగ్నులై దీనులై హస్తినాపురమునకు వెడలిపోయిరి.

కౌరవు లుదయకాలమున విరాటునిగోవులను పట్టిరి మధ్యాహ్నకాలమున కర్జునుడు విజయవంతుడైనాడు. సేదదీరి యపరాహ్ణకాలమున నుత్తరుడు బృహన్నలతో బురమును ప్రవేశించెను.

దక్షిణదిశయందు విరాటుడు గోవులనుజయించి పురము ప్రవేశించెను. సభనుచాలించి విరాటు డంతఃపురమునకు బోయి యుత్తరుని గూర్చి ప్రస్తావించెను.

---

యూతనియందు లేనిదేయైనను షండరూపవర్తియై నాలుగు రోజులు ప్రవర్తించినాడు. అర్జునుడు సదా పురుషుడేకాని షండు డెప్పుడునుకాడని పర్యవసానము. పురప్రవేశవిషయం ముత్తరుడే ప్రధానుడుగా జెప్పబడుట గమనింపదగినది 'అర్జునుడు నుత్తరుడు పురము ప్రవేశించిరి, ఉత్తరార్జునులు ప్రవేశించిరి, అర్జునోత్తరులు ప్రవేశించిరి' అని యిచ్చోట నుండుట సందర్భమే కాదు. 'రథికుడుత్తరుడు సారథితోడ పురము ప్రవేశించెను' అనియే యిచ్చట సందర్భమని గమనింపదగినది.

ఆచఖ్యు స్తస్య తత్సర్వే స్త్రియః కన్యాశ్చ వేశ్మని
అంతఃపురచరా శ్చైవ కుమారీభిః సహాంగనాః [illegible]

(అంతఃపురమందలి స్త్రీలు, కన్యలు [illegible] పలికిరి. 'బృహన్నలాసహాయుడై సాహసించియు [illegible] సాహసమున భీష్మునిని, కృపుని, కర్ణుని, దుర్యోధనుని, ద్రోణుని, ద్రోణపుత్రుని - మహారథములవారిని - అతి [illegible] జయించి [illegible] బోయినాడు' అని పలికిరి.)

పాండవు లజ్ఞాతవాసము చేయు విషయముకంటె, కీచకు లందఱు రాత్రికాలమందే యజ్ఞాతవిధిని హతులైరను విషయముకంటె ఉత్తరు డొక్కడు యుద్ధమునకు బోయిన విషయము మఱియు సద్భుతముగా విరాటపర్వమందు గలదు. సుశర్మ గోవులను సప్తమినా డపరాహ్ణ కాలమున బట్టెను. సూర్యుడు పరిణతుడగునపుడు యుద్ధము ప్రారంభమాయెను. అపరరాత్రికిపిమ్మట విరాటున కాయుద్ధమున విజయము లభించినది. అష్టమినాడు సూర్యోదయసమయమున నీ విజయవార్త విరాటనగరమున జాటింపబడినది. అదే సమయమునకు గోపాధ్యక్షు డంతఃపురమునకు వచ్చి కౌరవులు గోవులను బట్టినసంగతి దెల్పి యుద్ధమున కుత్తరుని బురికొల్పినాడు. బృహన్నలను సారథిగావించుకొని యుత్తరు డతిసాహసమున నొక్కడే కౌరవుల నెదిరింప నుఱుకుగా బోయెను. అర్జునుడు మధ్యాహ్నసమయమునకు గౌరవుల నెల్ల జయించినాడు. విరాటుడు పురముప్రవేశించి సభనుచాలించి యంతఃపురమునకు

బోయి యుత్తరునిగూర్చి ప్రస్తావించినాడు. స్త్రీలు, కన్యలే యుత్తరుడు కౌరవుల నెదిరింప నొక్కరుడు పోయియున్న విషయ మెఱిగించిరి. ఈ విషయమంతయు నిట్లంతఃపురము నందే పరివర్తమగుట బహు గంభీరముగా నున్నది. అజ్ఞాత వాసవిశేషమున కెంతయేని యనువర్తించు సన్నివేశముగా నీ విషయ మిట్లేర్పడుట యద్భుతముగా నున్నది. ఆమధ్యాహ్న సమయమున కుత్తరునియొద్దనుండి విజయవార్త విరాటునకు వచ్చినది. కౌరవులతోడి కలకలమంతయు నిట్లు మెఱుపువలె నేర్పడి ముగియుట పరమాద్భుతముగా నున్నది. [1*]గోవులు పట్టుబడుట, విడువబడుట – రెండును జరిగినపిమ్మట నే కౌరవులతోడ యుద్ధమైనసంగతి యిచ్చోట గమనింపదగిన పెద్దవిశేషము.

స్త్రీలు, కన్యలు. చెప్పినమాటవిని విరాటుడు భృశాను తప్తుడై చతురంగసైన్యము నాయత్తమొనర్చువాడై 'కుమారుని వేగనరయుడు, జీవించియున్నాడో, లేదో, షండుడు వానికి సారథియైనాడు' అనిపలికెను. ధర్మజుడు నవ్వుచు విరాటునితో 'బృహన్నల సారథియగుచో, పరులింక గోవులను గొనిపోజాలరు. నీ గోవులు నీవేయగును [2*] సర్వ

---

[1*] ఇయం కూటే మనుష్యేంద్ర గహనా మహతీ శమీ
భీమశాఖా దురారోహా శ్మశానస్య సమీపతః ౫౭-౧౫
ఆగోపాలావిపాలేభ్య ఆచక్షాణాః పరంతప
ఆజగ్ము ర్నగరాభ్యాశం పార్థా శ్చత్వారిబర్హణాః ౩౬

మహీపాలురతో. దేవాసుర సిద్ధయక్షులతో గూడి కౌరవులు వచ్చినను గూడ నీ కుమారుడు జయమొందువాడేయగును' అనిపలికెను. ధర్మరాజునోట ఈ పలుకేర్పడు సమయమునకు సరిగా నుత్తరుడుపంపినదూతలు విరాటనగరమునకువచ్చి విజయవార్తను వెల్లడించిరి. 'గోవులన్నియు జయింపబడినవి, కౌరవులు పరాజితులైనారు, ఉత్తరుడు సూతునితో కుశల మున్నవాడు' అని దూతలు పలికిరి. ధర్మరాజు [1*] దైవవశమున గోవులు జయింపబడినవి, కౌరవులు పలాయన మొందిరి. నీ పుత్రుడు కౌరవులను జయించుట - అనునది యద్భుతముకాదని తలంచెను జయమాతనికే ధ్రువము. బృహన్నల యంతకిదా యాతనికి' అని పలికెను. అప్పుడువిరాటుడు సంప్రహృష్ట తనూరుహుడై [2*] కుమారునివిజయమును

గోపాలానాంతు ఘోషస్య హన్యతాం త్వైర్మహారథైః
ఆరావః సుమహా నాసీత్ సంప్రహారే భయంకరే౩౫-౬
రాజపుత్రి ప్రత్యవేక్ష సమానీతాని సర్వశః
గోకులాని మహాబాహో వీరగోపాలకైః స్సహ ౬౭-౧౯

ఈ శ్లోకములుగూడ నీసందర్భమున గమనించదగినవైయున్నవి.

[2*] సర్వాన్ మహీపా సహితాన్ కురూంశ్చ
తథైవ దేవాసురసిద్ధయక్షాన్
అలం విజేతుం సమరే సుత స్తే
స్వనుష్ఠితః సారథినాహి తేన ౬౮-౧౭

సర్వమహీపాలు రొకతట్టు; దేవాదు లొకతట్టుగా నుండినను కౌరవులు పరాజితులు కావలసినదే యని యీ

విని దూతలకు పారితోషికముగప్పి మంత్రులతో నిట్లనెను. 'రాజమార్గములను పతాకములచే నలంకరింపుడు, పుష్పోప హారములచే దేవతల నర్చింపుడు, కుమారులు, యోధము ఖ్యులు, గణికలు నలంకరించుకొని వాద్యములతోడ గుమారు నెదుర్కొనవలసినది, సమదవారణ మధిష్టించి ఘంటవా యించుచు శృంగాటకములందు నాకుమారుని విజయమును చాటింపవలసినది. ఉత్తర బహుకన్యాపరివృతయై శృంగార వేషాభరణముగా గుమారు నెదుర్కొనవలెను' అని పలికెను. విరాటునుత్సాహపూరిత వచనములు విని మంత్రు లపుడు గావింపదగిన కృత్యము లన్నియు గావించిరి.

సైన్యమును, కన్యలను, గణికలను బంపి విరాటుడు ప్రహృష్టుడై [1*] సైరంధ్రి! పాచికలు గొనిరమ్ము, కంకుడా! ద్యూతము ప్రవర్తింపదగును' అని పలికెను. ఇట్లు పలుకు చున్న విరాటునిజూచి పాండవుడు 'హృష్టత్వమందు గిత వునితో జూద మాడవలదని వింటిని, మోద యుక్తుడవగు నీతోడ నిపుడు జూదమాడ నుత్సహింపను. [2*] నీవు కోరినచో నీకు ప్రియమాచరించెదను' అని పలికెను. విరాటుడు

---

శ్లోకము చిత్రముగా నన్వయమగుచున్నది. 'అలం' అను మాట సమర్థు డుత్తరుడనికాక 'జయమొందువా డుత్తరుం డగును' అని యన్వయించుచుండుట గమనింపదగినది.

[1*] 'దిష్ట్యా వినిర్జితా గావః కురవశ్చ పలాయితాః' అని ధర్మజుడనినాడు. విజయవార్త కుత్సాహవచనము ధర్మజుడే పలుకుట సందర్భోచితము, పోషణ మగుచున్నది. గోవిజ యమును గూర్చియే ధర్మజుడు మొదటిమాట నుచ్చరించుట

[1*] 'నా కన్నింటికంటె ద్యూతమే పరమ ప్రియమైనది'
పలికెను. కంకుడు 'రాజేంద్ర! బహుదోషమగు జూదమున
నేమి, దేవనమున బహుదోషములు కల్గును గావున దానిని
పరిహరింపవలయును. వింటివి కదా పాండవేయుడగు యుధిష్ఠిరుడు
[2*]సుమహత్ స్ఫీతమైన రాజ్యమును, త్రిదశోపములగు భ్రాత
లను, రాజ్యము నెల్ల బోగొట్టుకొనెను కదా, కావున జూదము
నిచ్చగింపను. అథవా నీ యిష్టమొందిన వాడవయిన నట్లే యాడె
దను' అని పలికెను. ద్యూతము ప్రవర్తింపగా విరాటుడు

---

సమీచీనముగా నున్నది. ధర్మజుని ధర్మనిదానము ఇది సువ్య
క్తము చేయుచున్నది అత్యంతము తనకు సంబంధించియున్న
కౌరవపరాజయముమాట విస్మృతిగా పలికినాడు ధర్మరాజు.
గోవిజయము వెచ్చెర జరిగినది – అని వారిస్మృతము. నిర్మాను
ష్యమగు ప్రదేశమది.

[3*] ఆచ్ఛాదయిత్వా దూతాం స్తాన్ మంత్రిణః సోఽభ్య
చోదయత్ ౬౮-౨౩

[ *] అక్షా నాహర సైరంధ్రి కంక ద్యూతం
ప్రవర్తతాం ౩౧

కీచకమరణమున భయగ్రస్తుడైన విరాటున కిపుడు
సైరంధ్రియందు తత్పూర్వపరిస్థితియే (మంచిదాసి యను
స్థితియే) యున్నదని యిది వ్యక్తీకరించుచున్నది. ఆమెనే
పాచికలు తెమ్మని విరాటుడు పురమాయించినాడు, ద్రౌపది
యొక్క ప్రవర్తనమందలి నిదానము నిదిసూచించుచున్నది.
'కైకేయి (సుదేష్ణ) సురను తేవలసినదని, విరాటుడు పాచిక
లను తేవలసినదని సైరంధ్రిని నియోగించినవారెరి.

పాండవునితో 'చూడుము, నా కుమారునిచే నట్టికౌరవులు జయింపబడినారు' అనెను. మహాత్ముడు ధర్మరాజు విరాటునితో 'బృహన్నల యంత (సారథి) యగుచో నతం డేల యుద్ధ విజయమొందకుండును' అని పలికెను. ఇట్లు ధర్మజుడుపలుకగా విరాటుడు కుపితుడై 'బ్రహ్మబంధూ! నా కుమారునితో సమము చేసి షండుని ప్రశంసించుచున్నావు, వాచ్యావాచ్య మెఱుంగకుంటివి. నిశ్చయము నన్నవమానించుచున్నావు. భీష్మద్రోణముఖులనెల్ల నెందుకు జయింపలేడు. వయస్యుం డవుగావున నీ యపరాధమును క్షమించుచున్నాను. బ్రదికి యుండగోరుదువేని యిట్టిమాట పలుకకుము' అనెను. యుధి

---

[2*] ప్రియంతు తే చికీర్షామి నర్తతాం యది మన్యసే 33

[1*] స్త్రియో గావో హిరణ్యంచ యచ్చాన్య ద్వసు కించన
న మే కించిత్తు రక్ష్యం తే అంతరేణాపి దేవితుమ్ 34

[2*] స రాష్ట్రం సుమహత్ స్ఫీతం భ్రాతౄంశ్చ త్రిదశోపమాన్
రాజ్యం హారితవాన్ సర్వం తస్మా ద్ద్యూతం న రోచయే ౩౬

రాజ్యమును, తమ్ములను జూదమున ధర్మరా జోడిపోయినాడని యిచ్చట గలదు. భార్యనుగుఱించి ధర్మజుడిపుడు పలుకుట లేదు. ద్రౌపదినిపందెమిడుట శకునికారణముగ నేర్పడినది. అది చిక్కుసమస్యగా నపుడు పరిణమించి యందున గౌరవులే చిక్కనపడిరి. విరాటునితో ధర్మజు డీమాట (సమస్త మోడిపోయినమాట) పలుకునపుడు ద్రౌపదియే పాచికలందించినది. ఉత్సాహసమయమున జూదమాడుటయం దిష్టముగల్గినవాడు ధర్మరాజు. ద్రౌపది తన చేతులతో

ష్ఠిరుడు [*] 'భీష్ముడు ద్రోణుడు ద్రౌణి వైకర్తనుడు సుయో
ధనుడు (రాజేంద్రుడు) మహారథులు. మరుద్గణపరివృతుండగు
మరుత్పతి యుండినను బృహన్నల దాగలంత గెలిచినవాని
నెవడు ప్రతియుద్ధ మొనర్పగలవాడగును. ఎవని గాండీవము
నకు సాటి సభాతో నభ విఖ్యాతియై యున్నదో, ఎవని కపిధ్వజము
చూచి యెవనికి హర్షము జనించునో, వసువాసవసమాన
సహితులనందఱి నెవ్వడు జయించునో యట్టివాని సహాయము
(సః) వాడెందులకు విజయమొందడు' అని పలికెను.

---

నందించినపాచికలతో ధర్మజుడు ద్విగుణోత్సాహముస
జూద మప్పుడాడినాడు. అదిగావించుటకే ద్రౌపది యచ్చోట
తాళియుండినదని గ్రహింపదగును.

[*] యత్ర ద్రోణ స్తథా భీష్మో ద్రౌణిః వైకర్తనః కృపః
దుర్యోధనశ్చ రాజేంద్ర స్తథాన్యే చ మహారథాః
మరుద్గణైః పరివృతః సాక్షా దపి మరుత్పతిః ౫౩

కౌరవవీరులకు దేవగణములకు మధ్యగా దుర్యోధను
డిపుడు రాజేంద్రశబ్దముచే నిర్దేశింపబడుట గమనింపదగినది.
అర్జునపరాక్రమమందలివిజయ మెంతరూఢియైనదో యది యీ
మాటయందు సాధింపబడినది. గంభీరవిస్తారమగు నీ యర్జున
పరాక్రమప్రశంసయందిచ్చోట నుత్తరునిపేరు లేకుండుటయు
గమనింపదగినది 'సః' అని యుత్తరు డిచ్చోట నిర్దేశింపబడి
నాడు. అచ్చోట నెవడుండినను జయము నిశ్చయమే యని
ఫలితార్థ మగుచున్నది. (శ్లో ౨ వ్యాః, సః ౪౭-౪౮ యనియే
యుత్తరుని గూర్చి యిచ్చోట గలదు.)

బహుశః ప్రతిషిద్ధో౽పి నచ వాచం నియచ్ఛసి
నియంతాచే న్నవిద్యేత న కశ్చి ద్ధర్మ మాచరేత్ ౪౭

'ఎంతగానిషేధించినను నోరుకట్టుకుంటివి. నియంతయంటుగానిచో నెవ్వాడు ధర్మమాచరింపడు' అని విరాటుడనుచు ప్రకుపితుడై 'వలదు' అని భర్త్సనమొనరించి పాచికతో ధర్మజుని మోమున గొట్టెను. ఆ బలమైనదెబ్బ కాతని [*] ముక్కునుండి రక్తము కాఱెను. అది భూమిపై బడకుండ ధర్మరాజు చేతులతో బట్టి పార్శ్వస్థితయైయున్న ద్రౌపది నీక్షించెను ఆతని యభిప్రాయమెఱింగిన భర్తృచిత్తవశానుగయగు ద్రౌపది జలపూర్ణసౌవర్ణపాత్రమును గొనివచ్చి యా రక్తమునందు బట్టెను. ఉత్తరు డపుడు ద్వారదేశమునకే తెంచి లోనకు వర్తమాన మంపగా విరాటుడు హృష్టుడై 'ఉభయులను లోపలకు బ్రవేశపెట్టవలసినది' అనెను.

క్షత్తారం కురురాజస్తు శనైః కర్ణ ముపాజపత్ ౫౫
ఉత్తరః ప్రతిశ త్వేకో న ప్రవేశ్యా బృహన్నళా
ఏతస్యహి మహాబాహో వ్రత మేత త్సమాహితమ్ ౫౬
యో మమాంగే వ్రణం కుర్యా చ్ఛోణితం వాపి దర్శయేత్
అన్యత్ర సంగ్రామగతా న్న స జీవే త్కథంచన ౫౭
స మృష్యా ద్భృశసంక్రుద్ధో మాం దృష్ట్వాతు సశోణితం
విరాట మిహ సామాత్యం హన్యా త్సబలవాహనమ్ ౫౮

---

[*] దక్షిణదేశ ప్రతులందు ధర్మజునినొసట రక్తము వచ్చినట్లు, ద్రౌపది పైటకొంగుతో నది తుడిచిపెట్టినట్లు గలదు. అది యోగ్యవిషయము కాదు.

(ధర్మరాజు ద్వారపాలకునితో నా...
నొక్కనినే ప్రవేశపెట్టుము. బృహన్నల నలను.
వ్రతముగలదు. సంగ్రామ గతుడై గానప్పుడు ... నవ్వు
గాయము గావించుటగాని, రక్తము చిమ్మునట్లు చేయుటగాని
కావించునో వాని నింక బ్రతుకనీయడు. ...
నన్ను జూచి భృశసంక్రుద్ధుడై సబలవాహనముగా హత మొన
ర్చును' అని పలికెను.)

[*] విరాటుని జ్యేష్ఠ సుతుడు భూమింజయుడు ప్రవే
శించి తండ్రికి నమస్కరించి కంకుని సమీపించెను. రుధిరసం
యుక్తుడై సైరంధ్రి యుపచారము గావించుచుండగా నేకాంత
స్థితుడైయున్న ధర్మజుని జూచి యుత్తరుడు త్వరమాణుడై
తండ్రి నిట్లడిగెను. 'ఎవనిచే గొట్టబడెను. ఎవనిచే నీ పాప
మాచరింపబడినది' అనెను. విరాటుడు 'నా చేతనే కొట్ట
బడినాడు. ఇంతమాత్రమే చాలదు. నిన్ను ప్రశంసించునప్పుడు
షండుని నితడు ప్రశంసించెను' అనెను. ఉత్తరుడు 'అకార్యం తే
కృతం రాజన్ క్షిప్రమేవ ప్రసాద్యతామ్' అనెను. క్షమాపణ
పలుకుచున్న రాజుతో ధర్మరాజు 'చిరము క్షాంతము, నాకు

---

[*] తతో రాజ్ఞ స్సుతో జ్యేష్ఠః ప్రావిశత్ పృథివీం

జయః (౬౮-౫౯)

విరాటస్య సుతో జ్యేష్ఠో వీరః శంఖో౽భ్యరహారయత్ (౨౧-౧౬)
విరాటునకు ఉత్తరుడు, శంఖుడు - ఈ యిద్దరు జ్యేష్ఠసుతులే
యని యున్నది.

కోపము లేదు, నా రక్తము భూమిపై బడుచో నీపాటికి సరాష్ట్రముగా నశించియుందువు' అనెను ధర్మరాజుని యీ మాట యుత్తరున కవగాహనమైనది. విరాటున కచ్చోటనున్నవాడు ధర్మజుడని తెలియదు. రక్తము కాఱుట కట్టినపైని బృహన్నల ప్రవేశించి విరాటునకునమస్కరించి కంకుని సమీపించెను. విరాటుడు కౌరవ్యుని - ధర్మజుని క్షమింపవేడి రణభూమినుండి యేతెంచియున్న యాయుత్తరుని సవ్యసాచి వినుచుండగా యుద్ధవిశేష మడుగజొచ్చెను. [*] 'ఆకౌరవప్రవీరులతో నెట్లు యుద్ధముగావించితివి' అని యడిగెను.

---

[*] త్వయా దాయాదవా నస్మి కైకేయ్యానందవర్ధన
త్వయా మే సదృశః పుత్రో న భూతో న భవిష్యతి   ౨౦
పదం సదసహస్రేణ య శ్చర న్నాపరాధ్నుయాత్
తేన కర్ణేన తే తాత కథ మాసీ త్సమాగమః   ౨౧
మనుష్యలోకే సకలే యస్య తుల్యో న విద్యతే
తేన భీష్మేణ తే తాత కథ మాసీ త్సమాగమః   ౨౨
ఆచార్యో వృష్ణివీరాణాం కౌరవాణాంచ యో ద్విజః
స్వ క్షత్రస్య చాచార్య స్సర్వశస్త్రభృతాం వరః   ౨౩
తేన ద్రోణేన తే తాతా కథ మాసీ త్సమాగమః
ఆచార్యపుత్రో య శ్శూర । స్సర్వశస్త్రభృతా మపి   ౨౪
అశ్వత్థామేతి విఖ్యాత స్తేనాసీ త్సంగరః కథం
రణేయం ప్రేక్ష్య సీదంతి హృతస్వా వణిజో యథా   ౨౫
కృపేణ తేన తే తాత కథ మాసీ త్సమాగమః
పర్వతం యో ౽ భివిధ్యేత రాజపుత్రో మహేషుభిః   ౨౬
దుర్యోధనేన తే తాత కథ మాసీ త్సమాగమః

అనగాధా ద్విషంతో మే సుఖో వాతోఽభివాతి మామ్ ౭౭
ఆచ్ఛిన్నం గోధనం సర్వం శార్దూనే నామిషం యథా ౭౮

విరాటుడు ముందుగా గద్దనిగూర్చిన యుద్ధసమాగమము నడిగెను. జగదేకవీరులగు ప్రథమలవారి యుద్ధవిశేషమునే విరాటు డడిగినాడు యుద్ధమెట్లయినది యని యడుగక యిట్లుగానడుగుటయే యిచ్చోట సందర్భవిశేష మగుచున్నది. ౭౭ శ్లోకము విరాటు నుత్సాహమునంతయు వెల్లడించుచున్నది.

న మయా నిర్జితా గావో న మయా నిర్జితాః పరే
కృతం త త్సకలం తేన దేవపుత్రేణ కేనచిత్ ౬౯-౧
సహి భీతం ద్రవంతం మాం దేవపుత్రో న్యవారయత్
స చాతిష్ఠ ద్రథోపస్థే వజ్రసంహననో యువా ౨
తేన తే నిర్జితా గావః కురవశ్చ పరాజితాః
తస్య తత్కర్మ వీరస్య న మయా తాత తత్కృతమ్ 3
[*] సహి శారద్వతం ద్రోణం ద్రోణపుత్రంచ షడ్రథాన్
సూతపుత్రంచ భీష్మంచ చకార విముఖాన్ శరైః ౪
దుర్యోధనం వికర్ణంచ సనాగ మివ యూథపం
ప్రభగ్న మబ్రవీ ద్భీతం రాజపుత్రం మహాబలః ౫
న హాస్తినపురే త్రాణం తవ పశ్యామి కించన
వ్యాయామేన పరీప్సస్వ జీవితం కౌరవాత్మజ ౬

..................................................

[*] అర్జునుడు కౌరవవీరులను జయించుట ౪ శ్లోకమందు, దుర్యోధనుని జయించుట ౫ శ్లోకమందు జెప్పబడుట

తం దృష్ట్వా రోమహర్షో ఒ భూ దూరకంపశ్చ మారిష
...........................................
కురూం స్తాన్ ప్రహసన్ రాజన్ సంస్థితాన్ హ్యాతవాససః ౧౦
ఏకేన తేన తే వీర షడ్రథాః పరిర్జితాః
శార్దూలేనేవ మత్తేన యథా వనచరా మృగాః ౧౧

(నాచే గోవులు జయింపబడలేదు. నాచేత పరులుచంప బడలేదు. ఆసమస్త మొకదేవపుత్రునిచే గావింపబడినది. భీతుడనై పాఱిపోవుచున్న నన్నా దేవపుత్రుండు నివారించెను. ఆతనిచేతనే గోవులు నిర్జింప బడినవి. కౌరవులు పరాజితులైరి. ఆవ్యాపారమంతయు నావీరునిదే. నాచే నది జరుగుట లేదు. ఆతడు కౌరవవీరులనెల్ల విముఖులను గావించి పిమ్మట దుర్యోధనుని జయించెను. ప్రభగ్నుడు, భీతుడునైన దుర్యోధనుని (రాజపుత్రుని) జూచి యాతడు 'హస్తినాపురమునందును నీకు రక్ష (సింక) గానను, జీవితము రక్షించుకొనుము. పలాయణుడవగు నీవు విడువబడవు రాజా! యుద్ధమందే మనము గావింపుము. జయించి పృథివి ననుభవింపుము. హతుడవగుచో స్వర్గ మొందెదవు'-అని పలికెను. ఆదేవపుత్రుడట్లు పలుకగా దుర్యోధనుడు వజ్రనిభములగు శరములు విడుచుచు సచివసంవృతుడై యెదిరించెను. పాముపలె బుసకొట్టుచు నెదుర్కొను

---

సాభిప్రాయముగా నున్నది. కౌరవవీరులను విముఖులనుగావించి యపుడుదుర్యోధనుని జయించెను- అని చెప్పుట మఱియు సాభిప్రాయముగానున్నది. ధర్మజునకు యుద్ధక్రమమును వ్యక్తీకరించుటయే యుత్తరు డిపుడు ప్రధాన మొనరించినాడు.

నాపరిస్థితికి నాకురోమాంచమైనది. తొడలు గడగడలాడి పోయినవి. అపుడా దేవపుత్రుండా రథానీకమును (కౌరవులను) నివారించి ప్రహసించుచు హృతవాసస్కుడై వెలింగెను. ఆయొక్కనిచేతనే యాప్రథములవారు పరినిర్జితులైనారు. మత్తశార్దూలముచే వనచర మృగములట్లు వారందఱు పరినిర్జితులైరి. ఉత్తరుడు యుద్ధవిషయమెల్ల నిట్లుగా దెల్పినాడు.)

'నేను గోవులను జయించలేదు పరులను జయించలేదు' అని పలుకుట యుచితము కాదు. అట్లుపలికిన యాజయము తనకుసంబంధించినదికాదని యుత్తరుడుపలికినట్లగును. ఉత్తరుడీ యుద్ధమున వీరకృత్యము-సారథ్య మాచరించియున్నాడు. ఉత్తరయు నిందు వీరవచనము నడిపియున్నది. అం

---

ప్రస్తుతకార్యప్రసక్తి యదియైయున్నది. కావున కౌరవప్రధానులే వరుసను విముఖులయినది యది యుత్తరుడు వివరించినాడు. (౮, ౫ శ్లోకములు) ద్యూతసమయమున గౌరవులు పాండవుల యొక్క, ద్రౌపదియొక్క వస్త్రములు తీయించినారు. అర్జునుడిపుడు యుద్ధరంగమున గౌరవుల వస్త్రములను తీయించినాడు. ద్యూతమపుడు భీష్ముడు ద్రౌపది ప్రశ్ననుగూర్చి మాటాడియున్నాడు. భీష్ముని వస్త్రముమాత్రమే యిపుడు మినహాయింపబడుట మఱియుగంభీరముగా నున్నది. ఉత్తరుడీవిషయముగా దనమాటముగించుట యెంతయో రసవంతముగా యున్నది.

దువలన యుద్ధవిషయము వ్యక్తీకరించుట యందర్జునుని యమోఘపరాక్రమమును వివరించి చెప్పినా డుత్తరుడు. 'తస్య తత్కర్మ వీరస్య న మయా తాత తత్కృతం' అని పలికినాడు. షడ్రథములవారిని నిర్జించి దుర్యోధను నుపాలంభించిన విశేషము నుత్తరుడు పేర్కొనెను.

'న హాస్తినపురే త్రాణం తవ పశ్యామి కించన' అని యర్జును డుపాలంభించినాడని యుత్తరుడు పలకినాడు. 'న తే పురస్తా దథ పృష్ఠతో వా పశ్యామి దుర్యోధన రక్షితారం'(౬౫-౧౫) అనియే యర్జునుడు దుర్యోధను నుపాలంభించియున్నాడు. హాస్తినాపురమునకు బోయినను దుర్యోధనుని పరిస్థితి యిదే-రక్షించువారు లేనిస్థితియే-యనునంత దెబ్బకొట్టినాడు, మాట పలికినాడు-అని యుత్తరు డా వచనమునకు భావమేర్పరచినా డని యభిప్రాయము, హతుడవగుదు వింక యని సాధించినా డని యభిప్రాయము, పౌరుషమున నపుడు దుర్యోధనుడు, కర్ణాదులు నర్జునుని చుట్టుముట్టుటనుగాంచిన యుత్తరునకు రోమాంచమయినది. తొడలాడి పోయినవి. ఈవిషయము యుద్ధరంగమునగాక యిచ్చోట వ్యక్తీకరింపబడుట రసవంత ముగా నున్నది. ఉత్తరు డీ సందర్భములో నర్జునుడు హృతవాసస్కుడైనాడని చిత్రముపలుకుట మఱియు గంభీరముగ నున్నది. 'హతవాససః, ఏకేన తేన తే వీర షడ్రథాః పరిః ర్జితాః' అనునవి రసవంతముగను, అర్జునుని సామంతమును వెల్లడించునవిగను నొప్పియున్నవి.

'ఆదేవపుత్రుం డేడీ, యతనిని నే నర్చింపవలయును' అని విరాటుడుపలుకగా నుత్తరుడు 'దేవపుత్రు డంతర్ధాన మొందినాడు. రేపటి మాపట ప్రాదుర్భవింపవచ్చునని తలం తును' అని పలికెను. ఇట్లుగా బేర్కొనబడుచున్న (ఛన్నం) పాండవు డచ్చోటనేయుండినవిషయ మా విరాటు డెఱుంగ జాలకుండెను. ఈమాట పాఠకహృదయమందొక చిత్రమగు తలంపును తట్టునట్లు గావించుచున్నది.

తతః పార్థో౽భ్యనుజ్ఞాతో విరాటేన మహాత్మనా
ప్రదదౌ తాని వాసాంసి విరాటదుహితుః స్వయమ్ ౬౯-౧౬
ఉత్తరాతు మహార్హాణి వివిధాని నవానిచ
ప్రతిగృహ్యాభవత్ ప్రీతా తాని వాసాంసి భామినీ ౧౭

(పార్థుడు విరాటు ననుమతినొంది యావలువలను స్వయము విరాటునికుమార్తె కొసంగెను. మహార్హములగు నావివిధనూత్నవస్త్రములను పరిగ్రహించి యుత్తర సంప్రీతు రాలాయెను. ఉత్తరపిలుపు, పనుపు ఇట్లుగా వీరోచితముగా సఫలమైనవి)

తత స్తృతీయదివసే భ్రాతరః పంచపాండవాః
స్నాతాః శుక్లాంబరధరాః సమయే చరితవ్రతాః ౭౦-౧
యుధిష్ఠిరం పురస్కృత్య సర్వాభరణ భూషితాః
ద్వారిమత్తా యథా నాగాః భ్రాజమానా మహారథాః ౨
[1*] విరాటస్య సభాం గత్వా భూమిపాలాసనే ష్వథ
నిషేదుః పావకప్రఖ్యాః సర్వే ధిష్ణ్యే ష్వి వాగ్నయః ౩

అథ మత్స్యోఽబ్రవీ త్తత్ర కంకం దేవరూప మవస్థితం
మరుద్గణై రుపాసీనం త్రిదశానా మివేశ్వరమ్ ౬
స కిలాక్షాతివాప స్త్వం సభాస్తారో మయా వృతః
అథ రాజాసనే కస్మా దుపవిష్ట స్త్వలంకృతః ౭
పరిహాసేప్సయా వాక్యం విరాటస్య నిశమ్య తత్
స్మయమానోఽర్జునో రాజ న్నిదం వచన మబ్రవీత్ ౮
[2*] ఇంద్ర స్యాప్యర్ధాసనం రాజ న్నయ మారోఢు మర్హతి
బ్రహ్మణ్యః శ్రుతవాం స్త్యాగీ యజ్ఞశీలో దృఢవ్రతః ౯
ఏష విగ్రహవాన్ ధర్మ ఏష వీర్యవతాం వరః
ఏష బుద్ధ్యాధికో లోకే తపసాంచ పరాయణః ౧౦

---

[1*] దక్షిణ దేశప్రతులందు ధర్మజుడు విరాటుని సింహాసనమున గూర్చుండినట్లు గలదు. అది గంభీరముగాదు. జగదేకసార్వభౌముడాచిఅతగద్దియపై గూర్చొనడు. రాజాసనమం దట్లు ధర్మజు డధిష్ఠించియుండగా విరాటుడు సింహాసనాధిష్ఠితుడు కాలేదు. అదియే యిచ్చోట నున్న గాంభీర్యము.

[2*] ద్రౌపది ధర్మరాజప్రభుత్వసంపదనంతయు పలికి వాపోయినదని ౧౮ వ అధ్యాయమున గలదు. ౭౦ అధ్యాయమున ధర్మజుని యుత్తమగుణముల నర్జునుడు పేర్కొనినట్లు గలదు. ఈ రెండధ్యాయములం దుల్లేఖింపబడినవిశేషము లొక్కటియేయైనను ధ్వనిభేద మిట్లుగలదు. ఇంద్రుని అర్ధాసన మధిష్ఠించియున్న యర్జును డీవిషయము పలుకుట మఱియు గంభీరముగా నున్నది.

కథం నార్హతి రాజార్హ మాసనం పృథివీపతే ౨౭

(మరుద్గణములచే నుపాసింపబడు త్రిదశేశ్వరునట్లు వెలుంగుచున్న కంకుని జూచి విరాటుడు 'నాచే సభాస్తారుడుగా వరింపబడిన నీ వలంకృతుడవై రాజాసనమందు గూర్చుంటివేల' అని యడిగెను. పరిహాసముగా బలికిన విరాటునిమాట విని యర్జునుడు స్మయమానుడై యీ మాట పలికెను. 'ఇంద్రు నర్ధాసనమందైన నధిష్ఠింప నర్హుండీతండు. బ్రహ్మణ్యుడు, శ్రుతవంతుడు, త్యాగి, యజ్ఞశీలుడు, దృఢవ్రతుడు, ధర్మవిగ్రహుడు, వీరవరుడు బుద్ధ్యాధికుడు, తపఃపరాయణుడు, త్రిలోకములందలి సకలాస్త్రముల నెఱింగినవాడు..... ఈతని శ్రీప్రతాపమునకు సుయోధనుడు సగణముగ, కర్ణ సౌబలులతో గూడ తపించుచుండును. ఈతనిగుణములను లెక్కించుటకు శక్యముకాదు......... రాజా ! యీతడు రాజాసనమున కెట్లనర్హుండు కాకుండును' అని పలికెను.)

పాండవులు సర్వాభరణభూషితులగుట గమనింపదగినది. పాండవులు రాజ్యము కౌరవులపరముగావించినను చతురంగసైన్యమును, పరివారమును, ఆయుధములను, ఆభరణములను, బొక్కసమును, దెచ్చికొనియున్నారని గానవచ్చుచున్నది. క్రమక్రమముగా వానిని వారు మరల చేర్చుకొనుచున్నారు. అలంకరించుకొని రాజాసనమం దధిష్ఠించియుండిన ధర్మజునివీక్షించి విరాటుడు పలికినమాట కంకునిగూర్చి పలికినట్లెక్కడ చెప్పబడుట గమనింపదగినది,కంకు డింక లేనేలేడు.

విరాటుని మనమందు మాత్రమే యది యున్నదని చమత్కా
రము. జగదేకసార్వభౌముడింక బదులుపలుకువాడు కాడు.
ధర్మజుడేమియు విరాటునిగూర్చి యిపుడు పలుకలేదు. విరాటు
నిది హాస్యవచనము. కావున నర్జునుడు స్మయమానుడై ధర్మ
జుని యుత్తమగుణములనెల్ల వివరించి పేర్కొనెను 'రాజాస
నమున కర్హుండెట్లు కాదు' అని యర్జునుడు తన మాట ముగిం
చుట యంత విషయమునకు సమాధానమగుచున్నది. ధర్మజుని
గూర్చియర్జును డిట్లు వెల్లడింపగా విరాటుడు మఱియు నిట్లనెను.

యద్యేష రాజా కౌరవ్యః కుంతీపుత్రో యుధిష్ఠిరః
కతమో ఽ స్యార్జునో భ్రాతా భీమశ్చ కతమో బలీ ౭౧-౧
నకుల స్సహదేవో వా ద్రౌపదీవా యశస్వినీ
యదా ద్యూతజితాః పార్థా న ప్రాజ్ఞాయంత తే క్వచిత్ ౨

అర్జునః

య ఏష వల్లవో బ్రూతే సూద స్తవ నరాధిప
ఏష భీమో మహారాజ భీమవేగపరాక్రమః ౪
ఏష క్రోధవశాన్ హత్వా పర్వతే గంధమాదనే
సౌగంధికాని దివ్యాని కృష్ణార్థే సముపాహరత్ ౫
గంధర్వ ఏషవై హంతా కీచకానాం దురాత్మనాం
వ్యాఘ్రా నృక్షాన్ వరాహాంశ్చ హతవాన్ స్త్రీపురే తవ ౬
య శ్చాసీ దశ్వబంధ స్తే నకులోఽయం పరంతపః
గోసంఖ్య స్సహదేవశ్చ మాద్రీపుత్రౌ మహారథౌ ౭

శృంగారవేషాభరణౌ రూపవంతౌ యశస్వినౌ
మహారథసహస్రాణాం సమర్థౌ భరతర్షభౌ ౮
ఏషా పద్మపలాశాక్షీ సుమధ్యా చారుహాసినీ
సైరంధ్రీ ద్రౌపదీ రాజన్ యస్యార్థే కీచకా హతాః ౯
అర్జునో ఽ హం మహారాజ వ్యక్తం తేశ్రోత్ర మాగతః
భీమాదవరజః పార్థో యమాభ్యాం చాపి పూర్వజః ౧౦
ఉషితాఃస్మో మహారాజ సుఖం తవ నివేశనే
అజ్ఞాతవాస ముషితా గర్భవాస ఇవ ప్రజాః ౧౧

(ఈతండు ధర్మజుండయిన నర్జునుం డేడి, బలవంతుండు భీముడేడి, నకులుడు సహదేవు డేరి, యశస్విని ద్రౌపది యేది, ద్యూతవిజితులైన పార్థులు తెలియవచ్చుటలేదు- అని విరాటు డనగా నర్జును డిట్లుపలికెను. 'వల్లవుడనని చెప్పు సూదుడే భీమ వేగపరాక్రముడగు భీముడు' గంధమాదనపర్వతమందు క్రోధవశులగువారి నీతడే హతమొనర్చి దివ్యములగు సౌగంధి కాదులను ద్రౌపది నిమిత్తము గొనితెచ్చెను. దురాత్ములగు గీచకులను సంహారించిన గంధర్వు డీతడే. వ్యాఘ్రములను, భల్లూకములను, వరాహములను పడద్రోసిన దీతడే. అశ్వబం ధుడే నకులుడు, గోసంఖ్యుడే సహదేవుడు. చారుహాసిని। సైరంధ్రియే ద్రౌపది. ఎవర్తె నిమిత్తముగా గీచకులెల్ల హతు లయిరో యామెయే ద్రౌపది. నే నర్జునుడను, నీవు తెలిసియే యున్నావు. భీమావరజుడను,నకులసహదేవులకు బూర్వజుడను. మహారాజా। నీయింట సుఖముంటిమి, గర్భవాసమందు ప్రజ

యట్లు మే మజ్ఞాతవాసము గడపితిమి - ఇట్లుగా నర్జునుడు తమ్మెఱిగించెను.)

పాండవులు స్నాతులై యలంకృతులై యున్నను విరాటుడు వారిని బోల్చలేకుండుట గమనింపదగినది. పాండవుల వేషధారణ మసాధారణవిషయమని యిది వ్యక్తీకరించుచున్నది. విరాటుడు కర్ణార్జునులనుగూర్చి ప్రథమప్రస్తావన గావించుట గమనింపదగినది. (౬౮-౭౧ ౭౧-౧) అర్జునుడు తమ్మెఱింగించు నీ సందర్భముననే ద్రౌపదీభీముల విరాటనగర కృత్యమును వ్యక్తమొనరింపవలసియున్నది. ఏతత్పురస్కృతమగు నుచితప్రశంస పలుకదగినదైన దర్జునునకు. ద్రౌపది యొక్క కష్టములను దీర్చి యిష్టమునుగూర్చినవాడు భీముడు. ఆ విషయ మిచ్చోట పలుకుటవలన యర్జునుని పరమయోగ్యత వ్యక్తమగుచున్నది.కీచకవధార్థము భీమునిదరికి ద్రౌపది పోవు సందర్భమున నిట్లు గలదు.

ద్రౌపదీ:- నాన్యః కర్తా ఋతే భీమా న్మమాఽద్యమనసః ప్రియం ౧౭-౪

భీమః:- అహ మేవహి తే కృష్ణే విశ్వాస్య స్సర్వకర్మసు ౨౦
అహ మాపత్సు చాపి త్వాం మోక్షయామి పునః పునః ౨౧

ఈ యథార్థవిషయ మర్జునుడు తననోట వచించినాడు. ఇది యర్జునుని సాత్త్వికసంపదను నింపుచున్నది. భీముడు గంధ

మాదన పర్వతమందు రాక్షసులనుజంపి సౌగంధికాపుష్ప
మును గొనితెచ్చినాడు. ఆ సౌ గం ధి కా పు ష్ప
మును దెచ్చియిచ్చి ద్రౌపది యిష్టమును దీర్చుట యిచ్చట
కార్యము, కావున 'భీముడు రాక్షసులను జంపెను' అని
పలుకక యర్జునుడు 'ఏష క్రోధవశాన్ హత్వా'అని పలికినాడు.
'సౌగంధికాని దివ్యాని కృష్ణార్థే సముపాహరత్' అని యసలు
విషయ మెల్ల సరసముగా బలికినాడు. కీచకులను వధించు
టయు నిట్టి సందర్భముగానే పలికినాడు, 'వ్యాఘ్రా న్వృక్షాన్
వరాహాంశ్చ హతవాన్ స్త్రీపురేతన' అని విచిత్రము పలికి
నాడు. యుద్ధభూమియం దుత్తరునకు, రాజసభయందు విరాటు
నకు నర్జునుడే తమ్మెఱింగించుటను గావించినాడు
'సైరంధ్రీం ద్రౌపదీం విద్ధి యత్కృతే కీచకా హతాః' అని
యర్జునుడు త్తరునితో బలికినాడు 'సైరంధ్రీ ద్రౌపదీ రాజన్
యస్యార్థే కీచకా హతాః' అని విరాటునితో బలికినాడు.
పరోక్షమందున్న ద్రౌపదినిగూర్చి వ్యక్తీకరించుట మొదటి
విషయము కావున 'ద్రౌపదీం, యత్కృతే' అని యర్జునుడని
నాడు, ఎదుటనున్న ద్రౌపదిగూర్చిపలుకుట రెండవవిషయము
కావున 'ద్రౌపదీ' అని యర్జును డనినాడు.
ఉత్తరునితో బలుకునపుడు 'అహామ స్మర్జునః' అని తన్నే ముం
దుగా నిర్దేశించి పలికినా డర్జునుడు. విరాటునకు దమ్మెఱిగించు
నీసందర్భమున చివరగా-ద్రౌపదినిగూర్చికూడ వ్యక్తీకరించిన
పైని, తన్నుగూర్చి యర్జునుడు పలికినాడు, మొదటిది కార్య
వచనముగాన నట్లుగా దన్నుగూర్చి నొక్కి-పల్కి-నాడు. రెం

డవది వ్యక్తమగుటయేసమయముగాన జివరగా దన్నెఱిగించు కొనినాడు.

వ్యాసుడు విరాట పర్వాద్యంతములందు గర్భదృష్టాంతము రచించినాడు.

విరాటనగరే చేరుః పున ర్గర్భభృతా ఇవ ౧౩-౧౨
అజ్ఞాతవాస ముషితా గర్భవాస ఇవ ప్రజాః ౭౧-౧౦

గర్భమందు పిండము బహుకష్టమొందును. ఆగర్భమందే యాపిండ మభివృద్ధి పొందును. సముద్రనేమీపతులగు పాండవు లజ్ఞాతవాసమున గర్భస్థ పిండమట్లు బహుకష్ట దశ నొందియున్నారు. సుఖముగా నజ్ఞాసవాస మచ్చోట గడచినందున నర్జును డిపు డదే దృష్టాంతము పేర్కొని కృతజ్ఞతను వెల్లడించినాడు.

[*]ఉత్తరుడు పాండవులను ప్రశంసించి పలికి యది సందర్భముగా నర్జునపరాక్రమ విశేషమును వ్యక్తీకరించినాడు. అది విని విరాటుడు 'నేనుకూడ సంగ్రామమున శత్రువశ మొందితిని.

---

[*] య ఏష జాంబూనదశుద్ధగౌర। తను ర్మహాన్ సింహ ఇవ ప్రవృద్ధః
ప్రచండఘోణః పృథుదీర్ఘనేత్ర। స్తామ్రాయతాక్షః కురు రాజ ఏషః ౭౧-౧౨
అయం పున ర్మత్తగజేంద్రగామీ।ప్రతప్తచామీకర శుద్ధగౌరః
పృథ్వాయతాంసో గురుదీర్ఘ బాహుః। వృకోదరః పశ్యత పశ్య త్రైనమ్ ౧౩

భీమసేనునివలన విముక్తి నొందితిని, ఆతనివలననే గోవులు జయింపబడియున్నవి' అని పలికి పాండవులను శరణు వేడెను. ధనంజయునిబురస్కరించుకొని ధర్మజ భీమ నకుల సహదేవులను మూర్ధాఘ్రాణ మొనరించి యాలింగన మొనకొనెను. వారి కజ్ఞాతవాసము పూర్తియైనందులకు సంతోషముపలికెను.

ఇదంచ రాజ్యం పార్థాయ యచ్చాన్య దపి కించన
ప్రతిగృహ్ణంతు తత్సర్వం పాండవా అవిశంకయా 28-3

ఉత్తరాం ప్రతిగృహ్ణాతు సవ్యసాచీ ధనంజయః
అయం తౌపయికో భర్తా తస్యాః పురుషసత్తమ 83

ఏవ ముక్తో ధర్మరాజః పార్థ మైక్ష ద్ధనంజయం
ఈక్షిత శ్చార్జునో భ్రాతా మత్స్యం వచన మబ్రవీత్ 3౫

ప్రతిగృహ్ణా మ్యహం రాజన్ స్నుషాం దుహితరం తవ
యుక్త ఏవహి సంబంధో మత్స్యభారతయో రపి 3౬

---

యస్త్వేష పార్శ్వే౽స్య మహాధనుష్మాన్।
శ్యామో యువా వారణయూథపోపమః
సింహోచాన్నతాంసో గజరాజగామీపద్మాయతాక్షో౽ర్జున ఏష వీరః ౧౮

రాజ్ఞః సమీపే పురుషోత్తమౌతు। యమా విషా
జిష్ణుమహేంద్రకల్పౌ
మనుష్యలోకే సకలే సమో౽స్తి। యయో ర్న రూపేన
బలేన శీలే ౧౫

విరాటః

కి మర్థం పాండవ శ్రేష్ఠ భార్యాం దుహితరం మమ
ప్రతిగ్రహీతుం నేమాం త్వం మయా దత్తా మిహేచ్ఛసి
౭౨-౧

అర్జునః

అంతఃపురేహ ముషితః సదా పశ్యన్ సుతాం తవ
రహస్యంచ ప్రకాశంచ విశ్వస్తా ప్తిత్రువ న్మయి ౨
ప్రియో బహుమత శ్చాసం న ర్తకో గీతకోవిదః
ఆచార్యవచ్చ మాం నిత్యం మన్యతే దుహితా తవ 3
వయస్థయా తయా రాజన్ సహ సంవత్సరోషితః
అతిశంకా భవేత్ స్థానే తవ లోకస్య వా విభో ౪

అభ్యాంతు ప ర్శ్వే కనకో త్తమాంగే। య్యైషా ప్రభా
మూ ర్తిమతీవ గౌరీ
నీలోత్పలాభా సుర దేవ తేవ। కృష్ణా స్థితా మూ ర్తిమతీవ
లక్ష్మీః ౧౬

'ప్రచండఘోణః' అని ధర్మజునిగూర్చి యు త్తరుడు ప్రశంసించుట బహుగంభీరముగా నున్నది. అట్లే భీమునిగూర్చి బాహు సంపదను ప్రశంసించుచు 'పశ్యత పశ్య త్వైనం' అని పలుకుటయు బహుగంభీరముగా నున్నది.

ధర్మజునిగూర్చి నేత్రములను, భీమునిగూర్చి బాహువులను, అర్జునుని గూర్చి ధనుష్మత్వమును, నకులసహదేవులనుగూర్చి గూనసమును ను త్తరుడు ప్రశంస గావించినాడు.

తస్మా న్నిమంత్ర యేఽహం తే దుహితాం మనుజాధిప
శుద్ధో జితేంద్రియో దాంత స్తస్యాః శుద్ధిః కృతా మయా ॥
స్నుషాయాం దుహితుశ్చాపి పుత్రే చాత్మనివా పునః
అత్ర శంకాం న పశ్యామి తేన శుద్ధి ర్భవిష్యతి ౬

'పృథుదీర్ఘ నేత్రః తామ్రాయతాక్షః' అని ధర్మజుని నేత్రసంపదను రెండు పర్యాయము లుత్తరుడు ప్రశంసించినాడు, 'పృథ్వాయతాంసః గురు దీర్ఘబాహుః' అని వృకోదరుని భుజసోయగమును రెండుపర్యాయములు వర్ణించినాడు.

'జాంబూనదశుద్ధగౌరతనుః' అని ధర్మజునిగూర్చి, 'ప్రతప్తచామీకర శుద్ధగౌరః' అని భీమునిగూర్చి ప్రశంసించినాడు.

'మత్తగజేంద్రగామీ, పృథ్వాయతాంసః' అని భీమునిగూర్చి, గజరాజ గామీ సింహోన్నతాంసః' అని యర్జునునిగూర్చి వర్ణించినాడు.

'ప్రచండఘోణః పృథుదీర్ఘ నేత్ర స్తామ్రాయతాక్షః కురురాజ ఏషః' అని ధర్మజునిగూర్చి. 'సింహోన్నతాంసోగజరాజ గామీ పద్మాయతాక్షోఽర్జున ఏషవీరః' అని యర్జునుని గూర్చి వర్ణించినాడు.

'యఏష జాంబూనదశుద్ధగౌరతనుర్మహాన్ సింహ ఇవ ప్రవృద్ధః' అని ధర్మజునిగూర్చి. 'అయంపున ర్మత్తగజేంద్ర గామీ ప్రతప్తచామీకరశుద్ధ గౌరః' అని భీమునిగూర్చి వర్ణించినాడు. రాజు, యువరాజు అను హోదాగా నీవర్ణనము

అభిశాపా దహం భీతో మిథ్యావాదాత్ పరతంప
స్నుషార్థ ముత్తరాం రాజన్ ప్రతిగృహ్ణామి తే సుతామ్ ౭
స్వస్రీయో వాసుదేవస్య సాక్షా ద్దేవశిశు ర్యథా
దయిత శ్చక్రహ స్తస్య బాల ఏవాస్త్రకోవిదః ౮
అభిమన్యు ర్మహాబాహుః పుత్రో మమ విశాంపతే
జామాతా తవ యుక్తో వై భర్తా చ దుహితు స్తవ ౯

విరాటః
ఉపపన్నం కురుశ్రేష్ఠే కుంతీపుత్రే ధనంజయే
య ఏవం ధర్మనిత్యశ్చ జాతజ్ఞానశ్చ పాండవః ౧౦

---

శోభించుచున్నది. 'యస్త్వేషపార్శ్వే' అని యర్జునునివిషయ మందు, 'రాజ్ఞఃసమీపే పురుషోత్తమౌతు' అని నకులసహదేవులగూర్చియు వర్ణింపబడుట వారలయంతరమును, శోభను గూడ వివరించుచున్నది.

'అభ్యాంతు పార్శ్వే కనకోత్తమాంగీ' అని ద్రౌపదినిగూర్చి వర్ణింపబడినది, జాంబూనద శుద్ధగౌరతనుడు మహాత్ముడు ధర్మరాజు, ప్రతప్తచామీకర శుద్ధగౌరవర్ణుడు భీమసేనుడు, కనకోత్తమాంగి ద్రౌపదియని యీవర్ణనమందు గలదు. 'అభ్యాంతుపార్శ్వే' అనునది పాండవపట్టమహిషిగా ద్రౌపది శోభించుచున్నదని వ్యక్తీకరించుచున్నది. పాండవపట్టమహిషి యగు ద్రౌపదినిగూర్చి యుత్తరుడు 'మూర్తిమతీవగౌరీ, మూర్తిమతీవలక్ష్మీః' అని వర్ణించినాడు. ఉత్తరు డిట్లుగా జగత్సార్వభౌములగు ద్రౌపదీపాండవులను వర్ణించినాడు.

యత్కృత్యం మన్యసే పార్థ క్రియతాం తదనంతరం
సర్వే కామాః సమృద్ధా శ్చ సంబంధీ యస్య మేఽర్జునః ౧౧

(ఈరాజ్య మిం కేదికాని మ్మదియంతయు పాండవులు నిశ్శంకగా బరిగ్రహింపదగును అర్జునుం డుత్తరను పరిగ్రహింపవలసినది ఆతడే జోపయికమైన విభుండగును—అని విరాటుడు పలుకగా ధర్మజు డర్జును నీక్షించెను. అర్జునుడు 'నీ కుమార్తెను నేను కోడలిగా బరిగ్రహింతును, మత్స్యభారతుల కీ సంబంధము యుక్తమైనది' అని పలికెను. విరాటుడు 'నేనొసంగుచున్న నాకుమార్తెను భార్యగాబరిగ్రహింప నేల నిశ్చయింపకుంటివి' అని పలికెను. ఈ మాటవిని యర్జును డిట్లు బదులు పలికెను. 'అంతఃపురమున సదా నీ కుమార్తెను చూచుచుంటిని, రహస్యమున, ప్రకాశమున నాయం దుత్తర తండ్రియని విశ్వాసమొందియున్నది. నర్తకుడుగా, గీతకోవిదుడుగా నుత్తర కిష్టుడనై బహుమానపాత్రముగానున్నవాడను. నిత్యము నన్నాచార్యుడుగా నీ కుమార్తె భావించియున్నది. వయస్సునందున్న యుత్తరతోకూడి సంవత్సరము కలసిమెలసియున్నాను. నీకు, లోకమున కతిశంకకు స్థానమగును. ఇట్లాచరించి శుద్ధుడను, జితేంద్రియుడను, పరిశుద్ధప్రవర్తకుండనని విశదమొందుట కార్యమిపుడు. కోడలు, కుమార్తె, పుత్రుడు, తాను సమానము. నాకిందు సంకోచమేమియు లేదు. అభిశాపమున, మిథ్యావాదమున భీతుడనగు నేను నీ కుమార్తెను కోడలుగా బరిగ్రహించుట యుక్తము. కృష్ణునకు మేనల్లుడు,

ఆచక్రహస్తునకిష్టుడు, సాక్షాత్ దేవకుమారు, డస్త్రకోవి దుడు నా కుమారు డభిమన్యుడు నీ కల్లుడగును. ఆ సౌభద్రుడు నీ కుమార్తెకు దగిన భర్తయగును—అని యర్జునుడు పలికెను. విరాటుడు 'కురుశ్రేష్ఠుడా! ఉపపన్నమిది. ధర్మనిత్యుండవు, జ్ఞాతజ్ఞానుండవు, ఏది విహితమని తలంతువో తదనంతర కార్య మొనరింపవలసినది, అర్జునుడు సంబంధియగుటవలన సర్వ కామము సమృద్ధమైనది' అని బదులు పలికెను.

ఉత్తరను భార్యగా నొసంగెదనని పలుకుట విరాటునిది ధర్మము, కోడలుగా బరిగ్రహించుట యర్జునుని సాత్వికసంపద యగుచున్నది ఉత్తరాభిమన్యుల వివాహము నిశ్చయమైనది. పాండవులు విరాటనగరమున నజ్ఞాతవాసము గడపి యుపప్లావ్య మున కేతెంచిరి. వివాహార్థ మర్జును డభిమన్యుని, కృష్ణుని రావించెను. కాశీరాజు, శైబ్యుడు, ద్రుపదుడు ఒకొ్కక్క యక్షౌహిణీసైన్యములతో గూడ విచ్చేసిరి. సబలవాహనులై వచ్చినవారలకెల్ల తగుమర్యాద గావించి విరాటు డుత్తర నభిమన్యున కొసంగుచున్నందులకు మిగుల బ్రీతుం డాయెను. రాజులందఱు విచ్చేసిన సందర్భమున కృష్ణుడు యాదవవీరు లతో సపరివారుడై యభిమన్యుని సుభద్రను తీసికొని వివాహ మునకు విచ్చేసెను. పాండవపరివారము, చతురంగసైన్య మపుడు పాండవులను చేరినది.

తోత వివాహో విధివ ద్వవృధే మత్స్యపార్థయోః ౭౨-౨౭
ఉచ్చావచా న్మృగాన్ జఘ్ను ర్మేధ్యాంశ్చ శతశః పశూన్
సురా మైరేయ పానాని ప్రభూతా న్యభ్య హారయన్ ౨౮

సుధేష్ణాంచ పురస్కృత్య మత్స్యానాంచ వరస్త్రియః ౩౦
ఆజగ్ము శ్చారుసర్వాంగ్యః సుమృష్టమణికుండలాః
వర్ణోపపన్నా స్తా నార్యో రూపవత్యః స్వలంకృతాః ౩౧
సర్వా శ్చాభ్యభవ త్కృష్ణా రూపేణ యశసా శ్రియా
పరివార్యో త్తరాం తాంస్తు రాజపుత్రీ మలంకృతామ్ ౩౨
సుతా మివ మహేంద్రస్య పురస్కృత్యో పతస్థిరే
తాం ప్రత్యగృష్ణా త్కౌంతేయః సుతస్యార్థే ధనంజయః ౩౩
సౌభద్ర స్యానవద్యాంగీం విరాటతనయాం తదా
తత్రాతిష్ఠ న్మహారాజో రూప మింద్రస్య ధారయన్ ౩౪
స్నుషాం తాం ప్రతిజగ్రాహ కుంతీపుత్రో యుధిష్ఠిరః
ప్రతిగృహ్యాచ తాం పార్థః పురస్కృత్య జనార్దనం ౩౫
వివాహం కారయామాస సౌభద్రస్య మహాత్మనః ౩౬
కృతే వివాహేతు తదా ధర్మపుత్రో యుధిష్ఠిరః
బ్రాహ్మణేభ్యో దదౌ విత్తం యదుపాహర దచ్యుతః ౩౬
తన్మహోత్సవసంకాశం హృష్టపుష్ట జనావృతం
నగరం మత్స్యరాజస్య శుశుభే భరతర్షభ ౪౧

(మత్స్యపార్థుల వివాహమహోత్స మతివైభవముగ విధ్యుక్తముగ జరిగినది. మంగళవాద్యములు చెలరేగినవి. మాంసాహారము, సురాపానములతో గొప్పభోజనములు జరిగినవి. అలంకృతులు సూతమాగదులు మున్నగువారు వినోద కార్యక్రమములు గావించిరి. సుధేష్ణను పురస్కరించుకొని

విరాటపురస్త్రీలు కళ్యాణమంటపము నలంకరించిరి. రూప వతులు, అలంకృతులునగు నాచారుసర్వాంగలు వరస్త్రీలు కళ్యాణమంటపమును శోభింపజేయుచుండిరి. రూపమున, యశ మున, శోభనమున ద్రౌపది యందఱికంటె మిగులశోభించు చుండెను. మహేంద్రకన్యను పోలియున్న యలంకృతయగు నుత్తరను పురస్కరించుకొని స్త్రీలెల్లలు కళ్యాణమంటప మును చేరిరి. పుత్రనిమిత్తముగా ధనంజయుడు వధువును స్వీ కరించెను. ఆ సభయం దింద్రరూపమున వెలుగొందుచు మహారాజుధర్మరాజు మిగులశోభించెను. ధర్మజు డపు డుత్త రను కోడలుగా బరిగ్రహించెను ఇట్లుగా నుత్తరాభిమన్యుల వివాహ మతి శోభాయమానముగా నేర్పడినది. ఏడువేల గుఱ్ఱములు, రెండునూఱులు గజములు, బహుధనము విరాటు డల్లున కరుణమొసంగెను. విధ్యుక్తముగా బ్రాహ్మణు లగ్ని హోత్రములు వేల్చిరి. కృష్ణుడు గొనివచ్చిన విత్తమును యుధిష్ఠిరుడు బ్రాహ్మణుల కొసంగెను. గోసహస్రములు, రత్నములు, వస్త్రములు, భూషణములు, యానములు, శయ నములు నొసంగెను. హృద్యమైన భోజనములు, వివిధపాన ములు గావించెను. హృష్టపుష్టజనావృతమైన విరాటనగరమున వివాహమహోత్సవ మతివైభవముగా జరిగెను.

వివాహమహోత్సవమందు విందు లతివైభవముగా విస్తారముగా జరిగినవి. ద్రౌపదీ ధర్మరాజు లాసభయందు మిక్కిలిగా శోభించిరి. ఉత్తర మహేంద్రకన్యవలె శోభించి